వేంకటసుబ్బరాయగుప్త, గ్రంధి

# గుప్తభావప్రదీపిక

గుంటూరు, 1926

Record no. 429

Vēṅkaṭasubbarāyagupta, Grandhi

Guptabhāvapradīpika

Guṇṭūru, 1926

Record no. 429

## Bibliographic Record Target

వేంకటసుబ్బరాయగుప్త, గ్రంధి.

గుప్తభావప్రదీపిక / గ్రంథకర్త గ్రంధి వేంకటసుబ్బరాయగుప్త.- గుంటూరు : కన్యకా ముద్రాక్షరశాల, 1926.

ii, viii, 4, 256 p. :ports. ;18 cm.

Record no. 429

Vēṅkaṭasubbarāyagupta, Grandhi.

Guptabhāvapradīpika / granthakarta Grandhi Vēṅkaṭasubbarāyagupta.- Guṇṭūru : Kanyakā Mudrākṣaraśāla, 1926.

ii, viii, 4, 256 p. :ports. ;18 cm.

Record no. 429

ఆర్యహితానంద గ్రంథమాల నెం. 7

# గుప్తభావప్రదీపిక.

గ్రంథకర్త

గ్రంధి వేంకట సుబ్బరాయగుప్త,

రాజవైద్య,

గుంటూరు.





కన్యకా ముద్రాక్షరశాల, గుంటూరు.

1926.

 [ వెల 0-10-0

ఆర్యహితావంద గ్రంథమాల నెం. 7

# గుప్తభావప్రదీపిక.

గ్రంథకర్త
గ్రంథి వేంకట సుబ్బరాయగుప్త,
రాజవైద్య,
గుంటూరు.



కన్యకా ముద్రాక్షరశాల, గుంటూరు.
1926.

 [ వెల 0-10-0.

ఆర్యహితానంద గ్రంథమాలలో వెలువడిన గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| 1. | శోఫరోగనివారణి | ... | 0 4 0 |
| 2. | శ్రీబాలవైద్యసుధాబ్ధి (1 వ భాగం) | | 2 8 0 |
| 3. | ఆంధ్రమాత (నాటకము) తగ్గింపుధర | | 0 8 0 |
| 4. | లక్ష్మీనరసింహ సోమయాజి జీవితము | ... | 1 8 0 |
| 5. | భాస్కరాభిప్రాయ ప్రత్యుత్తరము | ... | 0 1 0 |
| 6. | యతిధర్మబోధిని ... | ... | 0 2 0 |
| 7. | గుప్తభావప్రదీపిక ... | ... | 0 10 0 |

ప్రథమ ముద్రితమునకు ఇతరుల కిచ్చిన గ్రంథములు

1. అనుభవగృహవైద్యము. కం. గో.
2. ధన్వంతరీవైద్యలహరి. ఊ. వెం. సు.

వలయువారు :-

గ్రంథకర్త, గ్రంధి. వేంకట సుబ్బరాయగుప్త,

గుంటూరు.

# కృతిసమర్పణము.



సీ॥ వంగభాషను కవిత్వము రవీంద్రుని మించి
శైలిని జూపెను శక్తి నెవడు
బీదవిద్యార్థుల వేతనంబు లొసంగ
నురుధనంబుల ధార వోసె నెవడు
భోగంబులను పరిత్యాగంబు గావించి
కారాగృహమునకు చేరె నెవడు
జీతంబులేకనే జేయింతునని మంత్రి
పదవులజొరకుండ బట్టె నెవడు

గీ॥ దేశబాంధవుడను కీర్తి దిశలు వెలుగ
భరతమాతను సంతృప్తి బరచె నెవడు
సరసుడల చిత్తరంజను స్వాంతపంక
జమున కర్పింతు నీకృతి విమలభక్తి॥

శా॥ ద్రవ్యంబు న్గడియించి బాగుగ లస ద్ధర్మంబుల [ జ్జేయుచున్

సన్యాసవ్యముల న్గ్రహించి విబుధ స్సాంగత్య [ మొప్పారు వ

స్త్రవ్యాపారులు వైశ్యసంఘమెలమిన్ సాయంబు [ గావించి దే

శవ్యాప్తిన్గన జేసె బుస్తకమహా శక్తిన్గ్రత్తవత్నంబునన్॥

చ॥ ప్రథమ వఁశీగ్మహాసభ ధ్రువంబుగ గర్తపురంబు [ వర్ణమునన్

ప్రథిత యశంబుగా నటువ వ్రాసినపద్యము [ లన్నిగాంచి స

ద్బుధుడగు దాసు రామకవి బోధనునర్చెను [ ధార మందిడై

మధురముగా తెలుంగు సిక్షమానక వృద్ధి [ నొనర్చుకోదగున్॥

కృతికర్త.



దేశబంధు చిత్తరంజనదాసు,

కలకత్తా.

# తొలిపలుకు.

శ్రీమద్భగవదనుగ్రహమువలన బాల్యదశయందు ఆంధ్ర కవుల చరిత్రము చదువుట లభించినది. దానియం దన్నివర్ణము లంపు కవుల నామములు గనుపించినవిగావి వైశ్యజాతియం దొకకవియైన గనుపించకుండుటచే విచారపడి పూర్వము నుండియు వైశ్యులలో విద్యావ్యాప్తి కొరంతవడియుండుట గ్రహించితిని. పిమ్మట కవిత్వ మభ్యసింపవలయునని తలంపు గలిగెను. ఈ తలంపువలననే కవిత్వ మలవడినదని జెప్పుటకు సాహసించను. కవిత్వము ప్రయత్నముచేత సాధ్యపడినను భాషామాధుర్యము జన్మకాలవిశేషముచేత లభించవలసినదే! కుగ్రామముల జన్మించినవారికి తగిన గురువు లభించుటయు దుర్లభమే! వ్యాకరణ మెట్టిదో యెరుంగను. ఇక లక్షణ మట్టిలే నుండును. సహజకవిత్వమనియే భావించవచ్చును. కవిత్వమునకును బాల్య యవ్వన కౌమార కైశోరావస్థ లున్న వని నా యభిప్రాయము. ఆరంభదశయం దల్లిన పద్యములు మధ్యమదశలో నాకవికే సరిపడకుండును. అటులనే వృద్ధ దశయందు రచన దుర్బలముగానే యుండుననుటకు సందియము లేదు. నేసీదశల జూపించుటకే కవిత్వారంభము నుండియు ఇప్పటికి వ్రాసిన పద్యములు బొందుపరచి "గుప్త భావప్రదీపిక" యను పేరిడి ముద్రిత మొనరించి చదువరుల

కందజేసితిని. ఇందు దోషముల సవరించుటకు కోరుట యసం
దర్భము. ఏలనన కంబళిలో బరచిన యన్నమున వెంట్రుక
లేరుట కెంత దుర్లభమో ఈ గ్రంథమును దిద్దుట కంతకష్టము.
పాఠకులు నా యజ్ఞానమును పదేపదే మానసముల దలంచక
పద్యములందు భావమునుగ్రహించి సంతసించుటకు ప్రార్థితులు.

గ్రంథకర్త,

రాజవైద్య, గ్రంథి వేంకటసుబ్బరాయగుప్త కవి,

నంబూరు - గుంటూరు.



## గ్రంథకర్త జీవితము.

శ్రీమదనంతకల్యాణగుణాకరుడగు సర్వేశ్వరుని సృష్టివైచిత్ర్యి మెరుంగ
నెవరికి దరంబు ? మహాత్ములు దేశభక్తులు విద్వాంసులు సమస్తవిద్యాప్రవీ
ణులు పరాక్రమవంతులు సద్గుణసంపన్నులు సర్వజాతులందు జన్మించు
చుందురు. భగవంతుడు సర్వసముడు. భేదరహితుడు. ఆళ్వారాదిమహా
భక్తుల వర్ణము లెల్లరికి విదితమే. ఇటు ఉత్తమవర్ణములలో దుష్ప్రవర్తనులు
కలుషస్వభావులు. దేవాలయంబులలో నంతరాళంబులలో బ్రవేశించినను
భగవత్సాన్నిధ్యమున కర్హులగుదురా ? సద్వర్తనులగు భక్తులకే మోక్షసామ్రా
జ్యము స్థాపింపబడి యున్నది. విద్యాధికులగు జీవితములు కొన్ని ఆడంబర
ములు; కొన్ని నిరాడంబరములు. ఏతద్గ్రంథకర్తయగు వేంకటసుబ్బరాయకవి
సామాన్యకుటుంబములో బహుధాన్యవత్సరమున కొకవత్సర మెచ్చుతగ్గుగా
జన్మించి యుండెను. సరియగు జన్మకాలము వ్రాసియుండలేదు. తండ్రి
బసవయ్య. తల్లి సుబ్బాంబ. ఈ కవియును వీరి సహజన్ములును మాతామహు
డగు కంకిపాటి తాతయ్యగారి గృహంబున వృద్ధిజెందియుండిరి. తాతయ్యశ్రేష్ఠి
కిక్కవి జనని యొక్కతే బిడ్డయగుటచే ఈమె సంతానమును తల్లియగు సుర
మాంబ నతిప్రేమతో సాకియుండెను. కన్నప్రేమకంటె సాకినప్రేమ యధి
కము గదా ! ఐదువత్సరముల ప్రాయంబున విద్యారంభ మొనర్చియుండెను.
ఆ కాలమున విద్యాపద్ధతులు వేరు. విద్యారంభమున గంధపుష్పతాంబూల
వస్త్రాదులచే ఉపాధ్యాయుని పూజించుచుందురు పిమ్మట విద్యాబోధనా
చార్యుడు పంచాక్షరియుతమగు ఓనమాలు ముమ్మారు ఉపదేశించి తదుపరి
సరస్వతీప్రార్థన జేయించి నాటిదినము పాఠశాలకు సెలవొసంగుదురు.
బడిలో బాలురను ఫలాహారములతో సంతృప్తిబరచుటయు కలదు. గురు
శిష్యన్యాయముండి యుండెను. ఏడువత్సరముల ప్రాయమున నఖండమగు
స్ఫోటకము గనుపించి మిగుల నపాయము గలుగుటయేగాక నొక నేత్రము
దృష్టిని గోలుపోయెను. ఉపాధ్యాయుడు తాడేపల్లి జోగిరాజుగారు. నియోగి
బ్రాహ్మణులు. వీరు బాలురను మిక్కిలి ప్రేమతో జూచి విద్య బోధించు
టయేగాక నే కార్యమొచ్చినను బడిలో బాలుర కందరికి భోజనాదుల బెట్టి

సంతృప్తిగావింతురని ఈ జీవితపురుషునివల్లనే వినియుంటిని. అక్షరజ్ఞాన
మొకింత గలుగగనే ఆకాలమున సుమతీశతకము తప్పక కంఠోక్తిజేయించు
దురు. శబ్దములు నోటబట్టుట కలవడగానే బాలరామాయణము వల్లెవేయు
టకు ప్రారంభము జేయింతురు. దీనినే పుస్తకము బట్టించుటయని ఆకాలమున
వాడుచుందురు. ఈ రామాయణోపదేశకాలమున నూతనవస్త్రాదు లొసంగి
ఉపాధ్యాయుల సత్కరించుట కలదు అప్పుడు యెక్కములు గుణకార
భాగహారములు మొదలైనవి అక్షరముల దిద్దుట. ఇవి నేలమీద బూడిదెలో
వ్రాయించుచుండెడిని. సాధారణముగా బడిచదువు వదలువరకు సుమతీ
శతకము, కృష్ణశతకము, గజేంద్రమోక్షము, రుక్మిణీకల్యాణము, సటీకా బాల
రామాయణము, ఆంధ్రనామసంగ్రహము, అమరకోశము కొన్నివర్గములు వచ్చి
యుండెనట.

క్రీ-శ- 1894 ప్రాంతంబున ఉరుదు నభ్యసించుటకు దొడంగి నాలుగు
పరీక్షలువరకు చదివియుండెను. మన్మధనామవత్సరమున వివాహము జరిగి
యుండెనుగాని తలిదండ్రులు ధనాశాపరులై తగిన బాలిక నొడగూర్చక
తెలివిహీనురాలు నంటగట్టుటచే కష్టములపాలు గావలసివచ్చినను విద్య
యందు పట్టు వదలకుండెను "ఆశాశాపరందుఃఖం నిరాశాపరమంసుఖం"
అనినట్లు ఆశకు బోయి తన ధనమునే నష్టపడవలసి వచ్చెను. ఈ కధకుని
మామగారు బెట్టిన సొమ్మునంతయు హరించుటయేగాక ఋణమునుకూడా
దీర్చనివాడయ్యెను అన్నగారినష్టము మన కవిపైననే బడవైచెను.

ఇట్టి చిక్కులలోనుండియు వైశ్యులలో కవు లగుదుగా నున్నారని
చింతించి కవిత్వమునకు బ్రయత్నించి తత్సంప్రదాయకగ్రంథముల నవలోకిం
చుట బూనుకొనెను. నంబూరొక కుగ్రామము. విద్వాంసులు లేకుండుటచే
స్వయముగా తంటాలుబడుచు పండితు లరుదెంచినపుడు వారితో స్నేహ
భావము నెరపుచు లక్షణమొక్కింత గ్రహించి అప్పుడు జంగమకథలగోల
యెక్కువగా నుండియుండుటచే వామనవిజయము, చిరుతొండనంబికథ,
సత్రాజిత్తుకథ, దేవయానిచరిత్రము, రుక్మిణీకల్యాణము, తులసీమాహాత్మ్యము,
సిరియాళచరిత్రము వీటిని జంగము కథారూపముగా వ్రాసియుండుటయేగాక
దసరాలో బాలురు పాడుటకు గిరోత్రయము వ్రాసియుండెను. వీటిలో
నొకటి రెండుదక్క తక్కినవి ముద్రితమై యున్నవి



నంబూరులో రీసర్వేచేయుచున్న కాలమున ఫీల్డుసర్వేయర్లతో స్నేహ మొనరించి
అనతికాలములో గ్రహించి వారికి ప్లానులు మొదలైనవి తయారుజేసిబెట్టి
మన్ననవడసి యుండెను. పిమ్మట విజయనగరమునకు ఫీల్డుసర్వేయరుగా నియ
మింపబడెనుగాని యాదేశముయొక్క స్థితిగాంచి ఉద్యోగమున ప్రవేశించక
మరలి ఇంటికి జేరియుండెను. ఈసమయముననే బ్రాహ్మణులకు వైశ్యులకు
జరుగుచున్న వేదార్హాధికారవివాదమున పాల్గొనుట కారంభించి తదుక్తగ్రం
థముల సేకరించి పరిశోధనజేసి బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహసోమ
యాజిగారి సిద్ధాంతముల కనుగుణ్యుడై నిలచి విఘ్నేశ్వరపూజ మంత్రపుష్ప
ములు మొదలగునవి అభ్యసించెను. వీటినికూడా స్వరయుక్తముగా జెప్పు
వారలులేక స్వయముగా వల్లించియుండుటచే స్వరదోష ముండియుండెను.
(శా-శ- 1819) హేవళంబివత్సరమున బందరుపట్టణంబున బ్రహ్మశ్రీ ఆత్మూరి
లక్ష్మీనరసింహదీక్షితులవారివల్ల గావింపబడిన అగ్నిష్టోమమున కేగియుండెను.
ఇప్పటికీకవి కంఠగా విద్యావ్యాప్తి యుండియుండదు.

ఈ చరిత్రాధిపతికి పదహారువత్సరముల వయస్సుననే దంతలూటి జనించు
టచే దాని నివారణకు పెక్కువైద్యులవద్ద నౌషధముల సేవించి ధనవ్యయము
నొనరించి విసుకుజెంది స్వయముగా వైద్యశాస్త్రముల పారజూడవలయునని
తలంపుగలిగెను మన కవికి ప్రథమమున నుండియు యముద్రితగ్రంథముల
వ్రాసికొనుట కొక యభ్యాసమగుటచే శరభరాజీయ మొక మిత్రునివద్ద లభిం
చుటచే దానిని కొంత వ్రాసికొని యుండెను పిమ్మట దీనిని సంపూర్ణముగా
సంపాదించి శ్రీ ముక్త్యాల రాజావారి కొసంగ వారు స్వకీయ ముద్రణాలయ
మున ముద్రించి యుండిరి. పిమ్మట వైద్యగ్రంథములలో నష్టాంగహృదయము,
మాధవనిదానము, బసవరాజీయము, చింతామణి, శార్ఙ్గధరసంహిత మొద
లగు ననేకగ్రంథముల నార్జించుటయేగాక ననేక యౌషధంబుల సిద్ధ మొన
రించి చికిత్సా కుశలుడయ్యెను. శ్రీబాలవైద్యసుధాబ్ధి, ధన్వంతరివైద్యలహరి
మొదలగు గ్రంథములు పద్యకావ్యములుగా వ్రాసియుండెను. శ్రీబాల
వైద్యసుధాబ్ధి ప్రథమ భాగమున్ను శోఫరోగనివారణి, ధన్వంతరివైద్యలహరి
అనుభవగృహవైద్యము ముద్రింపబడినవి. వైద్యగ్రంథములేగాక ప్రభుభక్తి,
ఆంధ్రమాత, మల్లీశ్వరకీర్తనలు, లక్ష్మీనరసింహసోమయాజి జీవితచరిత్రము
యతిధర్మబోధిని మొదలగునవి అచ్చుపడియుండెను.

ఈ కవి తన గ్రంథములనేగాక ఇతరుల గ్రంథములనుకూడా ప్రచురించుట కాసక్తిగలిగి యుండెను. వామనవిజయనాటకమును ముద్రిత మొనరింపజేసి నందులకు తత్కవిసూనుడగు శ్రీమాన్ ధూపాటి శ్రీనివాసాచార్యులుగారు (.3-3-13) యీ క్రింది పద్యములతో నొక యుత్తరము వ్రాసి యుండెను.

ఉ॥ శ్రీవిలసిల్లు గ్రంథికుల సింధుసుధాకరకీర్తిసాంద్ర నా
నావిధసత్ప్రబంధరచనాలసమాన విశేషశేముషీ
భావితధీరలోక కవి పండిత వేంకటసుబ్బరాయ మే
ధావులరైన మిమ్ము సతతమ్ము శుభంబులునొందు గావుతన్॥

ఉ॥ మీరలు వ్రాసినట్టి లలి మీరెడి జాబు మదీయమానసాం
భోరుహసీమ కెంతయు ప్రబోధ విభావసుబింబమయ్యె యీ
కారియకర్త సాగికుల కల్వలరేడగు సుబ్రమణ్యమే
యారయ మాకు వారు పర మాప్తులు శిష్యులుగారె డెంబుగన్॥

ఉ॥ పెక్కుదినాలనాడు సుకవిత్వ పటుత్వ విశారదత్వముల్
నెక్కొన పెక్కురీతుల ననిందిత వాగమృతార్థధారలన్
జక్కగజూపునట్టి మతి చాతురి వామననాటకాఖ్య పెం
పెక్కు ప్రబంధ మొక్కటి భువిన్ విరచించెను మద్గురుం డొగిన్॥

సీ॥ దాని నచ్చొత్తించ తలపెన్నియోదినంబులనుండి మామది నలరుచుండు
నెన్నియో రోజులా చెన్నపట్టణమందె వసియించియును మాకు పొసగదయ్యె
కార్యనిర్వాహణంబు కాలానుసరణమై, యుండునందురు పెద్ద లొప్పుమీఱ
సుకృతమెవ్వరిసొత్తు సుబ్బరాయాహ్వయ, సుకృదాత్ములే కద సుఖులుభువిని
గీ॥ అప్రయత్నంబుగాదీని నచ్చునొత్త।గడగ నెరవేర్చినట్టి మీ ఘనత మేము
పరిపరివిధంబులను నోట ప్రస్తుతించి।నంతమాత్రంబున నె వచ్చు నదియు గనము॥

గీ॥ శిథిలమైపోవు కబ్బముల్ సేకరించి।యుద్ధరించుట సుజనాళి కిద్ధరిత్రి
సాజమేకద కీర్తివిస్తారులైన। పురుషపుంగవులే భువి పుణ్యతములు॥

గీ॥ సూరిలోకప్రశస్త శ్రీ సుబ్బరాయ।యిట్టి సత్కార్యములు మీగ లింపుమీగ
పెక్కుగావింప గోపాలకృష్ణుడెపుడు।ఆయురారోగ్యసంపదల్ జేయుగాత॥



ఇంతకుముందు పరాభవనామవత్సరమున శ్రీయుత ఆత్మూరి రామమోహన్ రావుగారి సన్నిధిని ఛాయాపటముల (ఫోటోగ్రాఫ్) నెత్తుట నభ్యసించి యుండెను. ఈసమయములోనే శ్రీ మునగాల జమీందారుగారగు రాజా నాయని వెంకట రంగారావుగారు కూడా ఫోటో నెత్తుటకు ప్రారంభించి యుండుటచే శ్రీవారి పరిచయము లభించినది. జమీందారుగారు భాషాభిమానులును శాంతమూర్తులును స్నేహభావముగల వారగుటచే మన కవి సంతతము వారి పేరు సంభావనల పేర్కొనుచుండును. ఈ వత్సరముననే నంబూరిలో విషూచి (కలరా) మిగుల తీవ్రముగా గనుపించెను. గుంటూరులోనే విషూచి నెమ్మదించువరకు నుండుమని తల్లిగారు జెప్పిపుచ్చినను మదిలో నేమాత్రము జంకక స్వగ్రామముజేరి విషూచి హరౌషధముల సిద్ధముజేసి వాడియుండెను. కీలకవత్సర చైత్ర బ ౮ లు (క్రీ- 3-4-1908) అన్నగారు స్వర్గస్థులైనను ఉత్తరక్రియలు సాంగమైనవెంటనే బందరులో జరిగిన వైశ్యమహాసభ కరిగి ఉపన్యాసము లిచ్చి యుండెను. గృహమునకు చేరగనే శోణితవాతము సంభవించి నాలుగు మాసములు మిగుల బాధపడి లేచి యుండెను. వ్యాధి కొంచె ముపశమించుచుండగనే అన్నగారి కుమార్తెయు తోబుట్టువుయొక్క భర్తయు చనిపోవుటయు నాసమయముననే మరల విషూచి (కలరా) జాడ్య మనేకస్నేహితుల నోటవైచికొనుటచే మిగుల వ్యసనము జెందియుండెను. ఈ తరుణముననే గ్రంథి రంగయ్యార్యులు స్వర్గస్థులయి యుండిరి. మన కవి విద్యాభివృద్ధికి వీరే ముఖ్య కారకులు. మన చరిత్ర నాయకు డెప్పుడును బాల్యస్నేహితులను హృదయమునందు దలంచి విచారమందుచుండుట గ్రంథములలో గానవచ్చుచుండును. మరుసటి వత్సరమున (1909) వైశ్యపత్రిక నడుపు భారమువహించి యొకటి రెండు వత్సరములు నడపి యుండెను.

ఈ కవి యొక కుగ్రామమున బుట్టి పెరిగి యుండినను సంఘసంస్కరణల యందును పత్రికల తెప్పించి చదువుటయందును శ్రద్ధవహించెనుగాని మిత్రులతో చీట్లాటలలో కాలముబుచ్చియుండలేదు. బాపట్లలో జరిగిన ప్రథమాంధ్ర సభయందు విధవాకేశఖండన మశాస్త్రీయమనియు దురాచారమనియు యుక్తియుక్తముగా నుపన్యసించి యుండెను. ఈ గ్రంథకర్త కగ్రజుడగు పున్నయ్యశ్రేష్ఠి గ్రామములో పలుకుబడి సంపాదించుటయేగాక వ్యవహార

సమర్థతగాంచుటచే తద్గ్రామకరణము మొదలగువారు సహించలేక వర్తకపన్ను గట్టించుటయేగాక ననేక చిక్కుల బెట్టియుండిరి.

పల్లెటూళ్ళలో ఉద్యోగస్థులు మకాం వేసినపుడు వారికి గావలసిన వస్తువితతుల వంతులప్రకారము సప్లై చేయవలసియుండురు. అంగడులున్నను యుండకపోయినను వైశ్యులీ బాధ ననుభవించవలసి యుండురు. ధనము ముట్టుచెల్లున్నను రశీదులుమాత్రము తమపై నేరము లేకుండుటకు బుచ్చుకొనుచుండురు. కొంచెమెవరైన తల పైకెత్తిన వర్తకపన్ను పైబడుచుండును. ఇదిగాక నిలవరుసగా నర్ధరాత్రివేళవచ్చినను జవానుల కన్నము బెట్టవలసియుండును. ఇంట్లో ఉండినను లేకున్నను బీదలైనను చచ్చినట్లు అప్పునైనా దెచ్చి పెండ్లికొడుకులకు బెట్టినట్లు బెట్టవలయును. ఈవిషయములో మరియొక కష్టము ఉద్యోగస్థులొకయెత్తు వారి వంటవారొకయెత్తు. వారిని దేవతలుగా భావించి కానుక లర్పించవలయును. లేనియెడ దుర్భాసన ఘ్నాతాదులప్రదర్శనముచే కష్టము వాటిల్లుచుండును. ఈ పీడనము వైశ్యులకేగాని క్రయవిక్రయ లన్యవర్ణముల వారుండినను వారికేమియు గలుగనేరదు. ఈ ధీగమానసుని పితామహుడగు స్వర్గీయ కంకిపాటి తాతయ్యగారా కాలమున నెదిరించి బంట్రోతుల కన్నముబెట్టుటకు భత్తా నేర్పాటుజేసిరి. పాపమీ వంటచాకిరి కుమ్మరవారిపై బడియుండెను చిట్లవంతులుమాత్రము వైశ్యులకు తప్పదయ్యెను. ధనవ్రయము కోమటులది; పేరు గ్రామస్థులది. ఈ చిట్లవంతునుగూర్చి మన చారిత్రకుడు చాలా వ్యసనమొంది ధైర్యమవలంబించి యీ అవమానాగౌరవముల బాపుటకు దలంచి యువకులను తోడుబరచుకొని క్రీ- 1910 వత్సరము ఫిబ్రవరిమాసములో దొరతనమువారికి కొన్ని విజ్ఞాపనము లర్పించి విచారణలో కష్టముల నివేదించి దుకాణములున్నవారివద్ద ధన మిచ్చి పదార్థముల గైకొనులాగున యేర్పాటుజేసి వైశ్యులకష్టముల బాపియుండెను. ఈ కష్ట మిప్పటికిని తదితరగ్రామముల బాధించుచునే యున్నది. వైశ్యులు కేవలము విద్యాశూన్యులగుటచే జీతము బత్తెములేని యీ దాస్యవృత్తులకు పాల్పడవలసి వచ్చుచున్నది. క్రీ- 2-11-11 శ్రీ జార్జిప్రభువు హస్తినాపురమున పట్టాభిషిక్తుడైనపుడు ప్రభుభక్తియను గ్రంథమును ప్రచురించి పాఠశాలలో బాలురచే కీర్తనల పాడించియుండెను. మేనగోడలగు నాగరత్నాంబ



వివాహము మన కవి యొనర్చవలసి యుండియు లగ్నము సమీపించినను క్రీ- 1912 వత్సరము గడగ్ కర్నాటక ఆర్యవైశ్యమహాసభ కేగి యచ్చట మిగుల గౌరవింపబడి తాను వ్రాసిన వైశ్యధర్మవిచారమా సభ కర్పించియుండెను. (19-8-12) శ్రీమత్పరీధావివత్సరము యీ ధీరోదారుని గురుతుల్యులగు వంగల వీరభద్రదాసుగారు సమాధిజెందుతరి వ్రాసిన మరణశాసనములో నొక ధర్మకర్తగా నియమించిరిగాని కొందరు తమను ధర్మకర్తలుగా జేర్పలేదని యెదిరించి తజ్ఞాతులచే బాధలు కలిగించుటచే మానుకొని యుండెను. 1916 సం॥ జూన్ నెలలో నంబూరిలో జరిగిన రెడ్డిజనమహాసభకు మిగుల సహాయ మొనర్చి తత్సభకేతెంచిన మ॥రా॥శ్రీ॥ సి. బి. మైనూరు రెడ్డి తిమ్మారెడ్డి, కాటంరెడ్డి, ఆదినారాయణరెడ్డి అగ్రాసనాధిపతి, బొరట్ల కే. కోటిరెడ్డి మొదలగు వారిచే పేర్కొనబడియుండుటయేగాక సభజరుగుటకు గుప్తగారే కారకులని నుడివియుండిరట.

ఈ ధర్మాభిరతుడు వైద్యము ప్రారంభించినది మొదలు ధనాశబూనక బీదసాదల నాదరించి చికిత్సలు జేయుచు వచ్చెను. (10-11-24) పల్నాడు తాలూకా రెంటచింతల గ్రామమున జరుపబడిన గుంటూరుమండల ప్రథమ వైశ్య మహాసభకు ముఖ్యకారకుడు మన కథానాయకుడనియే పలువురు జెప్పియుండిరి. ఈ కవి కృత గ్రంథములు.

| అముద్రిత గ్రంథములు. | ముద్రిత గ్రంథములు. |
| --- | --- |
| శ్రీ బాలవైద్యసుధాబ్ధి (2-వ భా) | ధన్వంతరి వైద్యలహరి. |
| సంపూర్ణ భాగవత నాటకము. | శ్రీ బాలవైద్యసుధాబ్ధి (1-వ భా) |
| భాగవతార్థబోధిని. | ఆంధ్రమాత (నాటకము) |
| యథార్థకథాకుసుమవల్లి. | లక్ష్మీనరసింహసోమయాజి చరిత్ర. |
| వస్తుగుణప్రకాశిక | శోఫరోగనివారిణి. |
| గురుత్రయనాటకము. | అనుభవగృహవైద్యము |
| | యతిధర్మబోధిని. |
| | భాస్కరాభిప్రాయఖండనము. |

ఈ కవి రచించిన పద్యము లిప్పటికి మూడువేలుపైగా నుండియుండెను.

కొంచెము చిత్రలేఖనము, ఫోటోగ్రాఫు, వైద్యము, కొద్దిగా కవిత్వము, సర్వో-
దారు చిత్రితము (మృదంగము) మొదలగువానియందు ప్రవేశముండి యున్నట్లు
జీవితచరిత్రమందే పాఠకులకు బోధపడియుండును. చూచినదానిని గ్రహించు
శక్తి బాల్యమునుండి యుండెను. ఈ కులాభిమానికి ఇప్పటికి ఒక కుమా-
రుడును ఇద్దరు కుమారికలును గలరు.

| | | |
|---|---|---|
| సాంబశివగుప్త | విశ్వావసువత్సరం (క్రీ | 1905) |
| రుక్మిణీసత్యాదేవమ్మ | సౌమ్యవత్సరం | 1910 |
| సత్యవతి | ప్రమాదీచవత్సరం | 1913 |

బిడ్డల జన్మనక్షత్రము పేర్లలోనే వచ్చునటుల యభిఖ్యలు పెట్టబడెను. ప్రశస్తవైశ్య జీవితధర్మములను పుస్తకమొకటి కొందలిడి వ్రాయుచున్నాడు గాని సామాన్యముగా నిర్వహింపబడుపనిగాదు. ఇవిగాక కులమునకు కులము తెలుపు నీతికి పాటితెగులనికట్లు వైశ్యులు వైశ్యాదివిఖ్యాతగ్రంథములు వెలువడించి భాషాభివృద్ధికి సహాయపడుటలేదు. వ్యక్తిస్వాతంత్ర్యమునకై యాధాగ పడక యొకరియొక్క ప్రోత్సాహమునైనను అభాగపడ [illegible] చింపక దుర్వ్యయము మొనర్చుచుండుదురు నమస్కులాగా! [illegible] మిగుల శక్తిగలవాడు గానున్నను ఒక సర్లెటొబట్టి శక్తికొలది విద్యాభ్యాసము చుట ప్రశంసనీయము. వీరి జీవితచరిత్రలో గనము గ్రహింపవలసినవి పెక్కుములు సెక్కు లుంపియున్నవి. ఈ విగాడించి జీవితుని కుటుంబమునకు భగవంతుడు శుభము లొసంగి వృద్ధినొందించుగాక.

శ్లో॥ సాయాత్స్వదాపతిత మానవమోక్షదాతా
గంగా యమూ జలజక్షేత్రయాతి క్షిపత్తం
తత్సాంప్రదాయా నితం కవితానురాగం
గ్రంథవిలిఖితకీర్తిగణం సుబ్రాయనామం॥

శ్లో॥ వైశ్యాన్వయే కలివశా త్యాధికాల్పసంఖ్యే
జాతోపి తత్ర ధనహీన ఇత్యాగతోపి
విద్యార్థమేవ కృషియిచ్చని సుబ్బరాయ
శ్రేయాంసితే దళతు రామనవంశవాణి॥

జనమంచి వసుస్వత్వాయు., గు తాగా గు.







# ఆర్యహితానంద గ్రంథమాలకు సహాయముచేసినవారు.

## ప్ర ధా న స హా యు లు.

శ్రీయుత కుర్చేటి కేశవరావుగారు, బందరు.
,, ఉప్పుటూరు వేంకట పున్నయ్యగారు, గుంటూరు.
,, నేరెళ్ళ వేంకట సుబ్బారావుగారు, గుంటూరు.
,, తాతా నాగయ్య శ్రేష్ఠిగారు, చెన్నపురి.
రావుబహద్దరు పొత్తూరి అయ్యన్న శ్రేష్ఠిగారు, చెన్నపురి.
శ్రీయుత బచ్చు వేంకట సుబ్బయ్య శ్రేష్ఠిగారు, చెన్నపురి.
,, ఊటుకూరు వేంకట సుబ్బారావుగారు, వేటపాలెం.
,, పెండేల చక్రపాణి సోదరులు, కన్యకాముద్రణాలయాధికార్లు,
గుంటూరు.

## స హా యు లు.

శ్రీయుత కొమ్మూరు హనుమంతరావుగారు, తెనాలి.
,, విస్సంశెట్టి వేంకటరత్నంగారు, బెజవాడ.
,, నూనె సానకాలు, రంగనాయకులుగార్లు, గుంటూరు.
,, గ్రంధి చెంచయ్యగారు, పొన్నెకల్లు.
,, తూము రంగయ్యగారు, వకీలు, వరంగల్లు.
,, చీకోటి వీరన్నగారు, శికింద్రాబాదు.
,, మాజేటి సానకాలుగారు, గుంటూరు.
,, సామి వెంకటాచలంశెట్టిగారు, కార్పొరేషన్ ప్రెసిడెంటు, [మద్రాసు.
,, మిట్టపల్లి ఆదినారాయణగారు, గుంటూరు.
,, కొమిరవల్లి కాశయ్యగారు, ఓరుగల్లు
,, గుంటూరు సుబ్రహ్మణ్యంగారు, గుంటూరు.

## పో ష కు లు.

శ్రీయుత వేముల నరసింహంగారు, భట్టిప్రోలు.
,, సుగ్గుల అత్తయలింగంగారి వేంకట నాగలింగంగారు,
ఖమ్మంమెట్టు.
,, నడింపల్లి వేంకట లక్ష్మీనరసింహారావుగారు,
పురపాలక సంఘాధ్యక్షుడు, గుంటూరు.

శ్రీయుత ఆకుల విశ్వనాథంగారు, ఖమ్మంమెట్టు.
,, శ్రీవీరలేశ్వర రైస్ మిల్లువారు, భట్టిప్రోలు.
,, దాచేపల్లి జేజయ్యగారు, ఖమ్మంమెట్టు.
,, బెల్లంకొండ విశ్వనాథంగారు, ఖమ్మంమెట్టు.
,, బచ్చు రామారావుగారు, గుంటూరు.
,, బచ్చు వీరన్నగారు, శికింద్రాబాదు.
,, దండు ఆగయ్యగారు, శికింద్రాబాదు.
,, సిద్దంశెట్టి చంద్రయ్యగారు, శికింద్రాబాదు.
,, ముచ్చర్ల కాయన్నగారు, శికింద్రాబాదు.
,, చిదురా దుర్వాసులుగారు, శికింద్రాబాదు.
,, నంబూరు కృష్ణమూర్తిగారు, శికింద్రాబాదు.
,, మంచికంటి వెంకయ్యగారు, శికింద్రాబాదు.
,, దుండిగల్ కేశవులుగారు, శికింద్రాబాదు.
,, పిడియాల వీరన్నగారు, శికింద్రాబాదు.
,, ప్రొద్దుటూరు వీరన్నగారు, శికింద్రాబాదు.
,, గొల్ల గంగాధరంగారు, గుంటూరు.
,, తూనుగుంట్ల నాగరత్నంగారు, గుంటూరు.
,, గుడివాడ జగన్నాథంగారు, గుంటూరు.
,, గ్రంధి అప్పయ్యగారు, పొన్నెకల్లు.
,, కోపూరి సీతారామయ్యగారు, చినరావూరు.
,, అద్దేపల్లి వేంకటగురునాథ రామశేషయ్యగారు, బెజవాడ
,, నంబూరు వేణుగోపాలరావుగారు, బెజవాడ.
,, సూరంపల్లి సూర్యనారాయణగారు, చెన్నపురి.
,, తాడికొండ రామచంద్రరావుగారు, చెన్నపురి.
,, బి. పి. నరసింహులు శ్రేష్ఠిగారు, ,,
,, వి. ఆర్. వి. నారాయణశ్రేష్ఠిగారు, ,,
,, గోనుగుంట్ల వేంకట సుబ్రహ్మణ్యంగారు, చెన్నపురి.
,, వాసా వరదయ్యగారు, చెన్నపురి.

---

## ప్రశస్త వైశ్యులు.

సీ॥ విద్వాంసుడౌ గ్రంధి వేంకటగోపాల
గుప్త మద్గోత్రు స ద్గురు నుతించి
నేత్రావధానము నేర్పున గావించు
బుచ్చికామ కవిని బాగడి బాగడి
ప్రాణశతాష్టావధాని ధీనిధి దోమ
వేంకట స్వామిని వినుతి జేసి
చిత్రలేఖనుడై ప్రసిద్ధికెక్కిన రామ
మోహనరాయుని యూహనెంచి

గీ॥ ఉర్దు నాంగ్లాంధ్ర భాషల నొప్పి వీణ
గాన మందున నేర్పును గన్న లింగ
మల్లు సుందర వరదుని మానధనుని
న్యాయవాదిని దలతు ధన్యత్వ మొంద॥

గుంటూరు శ్రీ కన్యకా పరమేశ్వరీ జాతీయపాఠశాలనుగూర్చి.

ప్రకటిత జాతివిద్యలను బాలకులెల్లరు దేలి దేశసే
వకులయి పూర్వపుస్థితులవర్థిల మిక్కిలి భారతంబు క
న్యకపరమేశ్వరీ గని దయామతి నీడగు పాఠశాల స
ర్వకళలమించిభాగ్యములవాసినిగాంచనొనర్ప వేదయు॥

## కవిత్వారంభమున వ్రాసిన వినాయక ప్రార్థనపద్యములు.

క॥ శ్వేతాంబరధరు విష్ణుని । చాతుర్భుజు చంద్రవర్ణు సామజవదనున్
బ్రీతిదలంచెద మనమున । భూతలమున విఘ్నశాంతి బొందుటకొఱకున్॥

క॥ పాదుగను విశ్వకారణు । డాదిమ పురుషుండటంచు నటుబ్రహ్మముగా
వేదాంత సాంఖ్యపుంగవు । లేదేవునుతింతు రల గణేశుదలంతున్॥

క॥ వింతగ నొకదంతముగల । సంతప్త సుశాతకుంభ సన్నిభ కాంతున్
సంతత మాబొజ్జయ్యను । తింతును ఘననయన దేవు నిలగణనాథున్॥

క॥ హరిణాజిన వరమౌంజీ । ధరు పామును జన్నిదంబు దాల్చినవానిన్
శిరమున నెలవెన్నెలతో । బరగెడు గణనాథుగొల్తు భక్తివెలుంగన్॥

క॥ చిత్రసుమమాల భూషణు । చిత్రమణి విచిత్రదేవు సేవించెద నే
స్తోత్రమొనర్చుచు మిక్కిలి । ధాత్రిని కామస్వరూపధారిని వేడ్కన్॥

క॥ చామరకర్ణవిభూషణు । సామజవర వదనుదేవ సంఘోత్తమునిన్
భీమాంకుశ పాశంబుల । వేమరు ధరియించువాని వినుతింతుమదిన్॥

క॥ ప్రకటసురాసుర యని మూ । షక వాహనమెక్కి రణముసల్పగ నతియో
షిక బూనినవీర్యు వినా । యకునికి దండంబులిడుదు నాత్మజలంగన్॥

క॥ నిరతము కిన్నిరవిద్యా । ధరపుంగవ యక్షసిద్ధతతి వినతునరున్
వరభుజములుగల లంబో । దరునకు సద్భక్తిమీర దండములిడుదున్॥

క॥ గిరిజాహృత్పరితోషుని । పరివేష్టిత మాతృనమల భక్తేష్టుని నేన్
నిరతానందము చేతను । గరిమను సంతృప్తిజెందు గణపతి నెంతున్॥

క॥ విఘ్నకరుడైన దేవుని । విఘ్నవివర్జితుని దేవ వినతపదాబ్జున్
విఘ్నేశుని సిద్ధిప్రదు । విఘ్నంబుల బాపనెంతు వేడుక మీరన్॥

క॥ పుణ్యగణాష్టకమిది స । ద్గణ్యత పఠియించిరేని ధనికుండౌనా
ధన్యుడు విద్వాంసుండై । మాన్యుండై కార్యసిద్ధి మహిలోగాంచున్॥

ఉ॥ వామనరూపు దివ్యయఖు వాహను, మోదకహస్తుశూలి స
త్ప్రేమకుమార విఘ్నపతి బేర్మివిలంబితసూత్రు జిష్ణునిన్
చామరకర్ణు సత్సమద చారుపదంబులకే నమస్కృతుల్
నీమహిఁజేతుభక్తిమది నీప్సితముల్ఫలియించి మించగన్॥

ఉ॥ భూతగణాధిసేవితుని భూరివిలాప వినాశకారణుం
నాతి హిమాద్రి పుత్రివర నందనుసామజ సన్ముఖోత్తమున్
జాతకపిద్ధజంబుఫల సారనుభోజను విఘ్ననాయకున్
బ్రీతిబఠింతు డెందమున వృద్ధినిబొందగ విద్యలన్నిటన్॥

క॥ సారసపత్రవిలోచని। సారసకింజల్కవర్ణి సారసగేహిన్
సారస్వతి నెల్లప్పుడు। కోరిభజించెదను మదిని కోర్కులుదీరన్॥

క॥ వనరాసి ధేనుపదముగ। దనుజుల దోమలగనెంచు ధన్యుని రామా
యణ మాలారత్నంబగు। యనిలాత్మజుకేనొనర్తు నవనిదండముల్॥

క॥ అంజనదేవీ నందను। భంజిత యక్షయకుమారు ప్లవగాధిపునిన్
రంజిలు లంకాభీకరు। నిం జానకి శోకనాశునిం గొల్తు మదిన్॥

క॥ రామకథామృతసాగర। మేమహితాత్ముండు గ్రోలి యెలుగడో తృప్తిన్
నాముని ప్రాచేతస్సుతు। నేమది యనఘాత్ముడనుచు నెంతు వేడుకన్॥



ఓమ్.

# గుప్తభావప్రదీపిక.

శ్రీకర భక్తమానసవశీకర సాధుశరణ్యా దివ్యసు
శ్లోక పరాత్పరా హృదయ శోభిత సత్యవినిర్మలాత్మ ము
ల్లోకపవిత్ర మానిజన లోల నిరామయ వేదవేద్య నా
వ్యాకులమంత దీర్చియు భవంబులభీతిని బాపు మో ప్రభూ!

## ప్రణవము.

వారధులందు ఘూటలను బాగుగ నాదమునేది దెల్పు నా
ధారముగా జెలంగు శ్రుతి ధర్మములాగమరాసికేది స
త్సార త్రివర్ణముల్గలిగి సర్వముకెయ్యది కారణంబు యోం
కారమె నీవటంచు సరిగా ప్రణవంబుజపింతునో ప్రభూ॥

## పంచభూతములు.

కలసిననేవి చిత్రమగు కాయములేర్పడి సంచరించునో
కలసిన దేనిలోనదియు కాలముదీరుచు గాంచునో మృతిం
కలయకనున్న సృష్టిగతి గాంచకయుండునో సర్వమందు నా
జెలువగు పంచభూతముల చేర్చెడివాడవు నీవెసూ? ప్రభూ॥

సలలిత పంచలోహముల షడ్రసముల్దగ నోషధీతతిన్
వలువలగట్ట ప్రత్తియును వంటకు బుల్లల రత్నరాసులన్
తిలలును దీపతైలముకు దివ్యఫలంబుల ధాన్యరాసులన్
గలుగగ జేయునా పృధివి గాంతునుతల్లిగ భక్తినో ప్రభూ॥

ప్రాణుల కెల్ల సంతత పిపాసను బాపి బలంబొసంగఁగన్
స్నానము జేయుచుఁ ద్విజులు సంధ్యల సూర్యుని కర్ఘ్య
[మివ్వఁగన్
దానసుధారసస్యముల దన్పఁగ జెల్లునె నట్టి యప్పు లే
త్రాణనొసంగి లోవెలిని తప్పక శుద్ధినొనర్చెడి న్ప్రభూ॥

ఆహుతులందు చున్ముఖము లందు వెలుంగుచుకుండలంబులన్
వాహనమౌచు హవ్యముల వారితలీల సురాళికిచ్చి సం
దేహముదీర పాకముల దీర్చ సహాయము జేయుచుండు నా
లోహితనేత్రు నంతర వెలుంగు నుతింతు సనాతనప్రభూ॥

జీవుల కెల్ల జీవమయి జీతము భత్తెము లేక సర్వదా
సేవ నొనర్చుచున్ సకల సీమల లోకములెల్ల వ్యాప్తమై
తావుల జల్లుచున్ సుమవితానముల న్ధరరాల్చి పుష్పాళుల్
దీవుల కంపునా యనిల దేవుడు వీచును చల్లగా ప్రభూ॥

వెలయుచు నంబరంబనగ విష్ణుపదంబు నభంబు పేర్మిచే
జలధరపఙ్క్తికందకను సారసమిత్ర మృగాంకమండలం
బుల కతిదూరమై వెదుక బూనిన శూన్యముగా బరంగు నెం
దులనలమిన్నున న్గలవు దుర్మదభేదన శాశ్వత ప్రభూ॥

కేశవాది చతుర్వింశతి నామస్తోత్రము.

ఈశ యఖండతేజ పరమేశ చిదాత్మనిరామయార్కసం
కాశ పురాణపూరుష వికారవిదూర దయాబ్ధిదివ్యసం



దేశ గురూత్తమా నిరవధికసుఖంబు వహించు నాత్మగా
కేశవ నేగ్రహించితిని కిల్బిషకానన పావక ప్రభూ॥

"కేశం సుఖ శ్రేష్ఠం వహాతీతి" మ. పు. ౪
నిరవధిక సుఖమును వహించునట్టి పరమాత్మ.

కరుణాపాంగనిరంజనా పరమభక్తశ్రేణి సంరక్షణా
నిరహంకార నిరామయా భవహరా నిర్మోహనిష్కామస
ద్వరదా నైగమవేద్య జీవములకాధారంబనే యాత్మగా
ధర నారాయణనీదునామము సదా ధ్యానింతునో సత్ప్రభూ॥

"నరాణాం నిత్యానామ యనమితి" నారాయణపదం అష్టశ్లోకి పు. ౧౪
జీవుల కాధారమగు పరమాత్మ.

భాను సహస్రతేజ జన పావనశీల నిరామయాక్షరా
దీనజనావనా పరమ ధీనిధి నిర్మల నిర్వికల్ప వి
జ్ఞానముకెల్ల సత్ప్రభువుగా పరమాత్మగ మూడు వేళలన్
మానసమందు నెంచెదను మాధవయంచు సభక్తినో ప్రభూ॥

"మాయాః జ్ఞానస్యపతిర్ధవః॥ మ. పు. ౪ జ్ఞానమునకు ప్రభువగు పరమాత్మ.

కలుషారణ్యకుఠారకర్మరహితా కారుణ్యపాథోధి ని
ర్మల నిష్కామనిరామయా సుగుణధామా భక్తసత్పోషవా
క్కులచే సన్నుతి గాంచు యాత్మవని సంకోచింప కన్నీదు సే
వల గోవింద యొనర్తు విశ్వమయ విశ్వాతీత ముక్తి ప్రభూ॥

"గోవింద ఇతితే నాహం దేవైర్వాగ్భి
రభిష్టుత ఇతి మోక్షధర్మవచనాత్ శం. పు. ౨౬

పరమాత్మా పరమేశ శాశ్వతహరా బాహ్యాంతరవ్యాపకా
కరుణా సాగర విశ్వరూప త్రిజగత్కల్యాణమోక్షప్రదా

క్షర విశ్వాత్మ నిరామయా సకలలోకవ్యాప్తమా నాత్మగా
నిరతంబు స్ఫురియింతు విష్ణువనుచు న్నిర్వ్యాజ విశ్వప్రభూ॥
వేవేష్టి వ్యాప్నోతీతి" శం.పు. ౧౭ సర్వజగద్వ్యాపకమగు పరమాత్మ.

విమలాత్మాఖిల సజ్జనావన జగద్వీరా పరంధామ యు
త్తమచారిత్ర యనాథరక్షకగుణా ద్యత్యాస దాజ్ఞాన దా
నముచే భక్తుల కర్మకాంక్షిత ఫలా న్నత్యంబు పోగొట్టు నా
త్మమహీశా సూ ? మధుసూదనాయనుచు నామం బెంతునో
[ సత్ప్రభూ॥

" మధుజీవనానాం శుభా శుభకర్మ
జ్ఞాన దానేన సూదయతి" తారానాథవాచస్పత్యము

సమభావాంచిత కల్పితాఖిల జగత్సర్వాత్మ సర్వేశనై
గమవంద్యా ఘనశీల కల్మషహరా కారుణ్యసింధూ త్రిలో
కములన్నిండిన యాత్మవంచు నెదలో గాంతున్సదా శ్రీత్రివి
క్రమనైష్కర్మ్య చరాచరాత్మకజన త్రాణా చిదాత్మ ప్రభూ॥ ౧౫
" త్రయో విక్రమాస్త్రిషులోకేషు క్రాన్తా యస్యసః " శం. పు ౮౬

ఘన విశ్వాత్మ భవాబ్ధిసంతరణయోం కారస్వరూపా తపో
ధన సంరక్షనిరామయాఖిలజగ ద్రక్షా గుణాతీత శో
భనరూపంబులచే ప్రకాశమగు సంపూర్ణాత్మగా నెంతు వా
మన హృత్కంజమునందు చారుగుణధామా చిత్ప్రకాశ ప్రభూ॥
" వామైర్మంగళ రూపైర్నయతీతి "
మంగళాకారములచే ప్రకాశించు పరమాత్మ.

చారుగుణార్ణవా నిగమ సారయుతేంద్రియ సర్వసజ్జనా
ధార పరాత్పరా విహిత ధామ నిరంజన దివ్యభక్తమం



దార సుసర్వసంపదల ధారణజేసెడి యాత్మవంచు నే
సారెకు శ్రీధరా దలతు సర్వజగత్పరిపాలనా ప్రభూ॥ ౧౭
"శ్రియంధరతీతి శ్రీధరః మ.పు. ౫ సర్వసంపత్తును ధరించునట్టి పరమాత్మ.

ఈశ పరాత్పరా త్రిజగదీశ దివాకరకోటి దివ్య సం
కాశ నిరామయా దురిత కానన పావక నిష్కళంక స
ర్వేశ భవాబ్ధిపోత సకలేంద్రియనాథ మహాత్మగా హృషీ
కేశ హృదాబ్జమం దెపుడు దృష్టిగ నెంతు సనాతన ప్రభూ॥
" హృషీకాణి ఇంద్రియాణ్యాహుః తేషామీశో యతో భవాన్"

భూరిదయాకరా పరమ పూరుషచేతన రక్షకాక్షరా
చారు సుశీల విశ్వమయ శాశ్వత నైగమవేద్య సజ్జగ
త్కారణ శక్తిసంపదకు కర్తగు నాత్మగ చిత్తమందు నే
సారెకు పద్మనాభ నిను సన్నుతిజేయుచు నుంటినో ప్రభూ॥ ౧౯
" సర్వజగత్కారణం పద్మం నాభౌ యస్యసః"

ఖేదవిదూర భక్తహిత కిల్బిషనాశన విశ్వనాథ ని
ర్వాద చిదాత్మ మానిజన వందిత చిన్మయ నిర్వికల్ప ని
ర్భేద సమస్తలోకముల వేగల సత్పరమాత్మవంచు దా
మోదర నిన్ను వేడెదను మోక్షముకై కరుణాకర ప్రభూ॥ ౨౦
" దామానిలోకనామాని తానియస్యోదరాంతరే తేనదామోదరో దేవః.

హర్ష విలాస సర్వనిగమాగమవందిత దివ్యతేజ యా
కర్షణ సర్వజీవులను గాంచియొనర్చెడి యాత్మవంచు సం

కర్షణా మానసాబ్జమున కల్మషముల్ హరియించ నెంచెదర్
పుర్ష వరేణ్యా మానిజన పోషణ దీనజనావనప్రభూ॥ ౨౧

" సంహార సమయే యుగ ప్రజాస్సం
కర్షతీతి" సర్వ జీవులను ఆకర్షించు పరమాత్మ.

చేతనరక్షకాసుజన సేవిత విశ్వవిభో నిరామయా
పూతచరిత్ర వేదహిత పుణ్యవిచారణ దీనరక్షకా
భూతములన్ని యున్నిమడి భూతములందువసించు నాత్మగా
బ్రీతిత్రా వాసుదేవ నిను వేడెద మోక్షమొసంగనో ప్రభూ॥

వసంతి భూతాని తత్రతేషు వావసతీతి" శం పు.

వరదానంత శుభాకరా సకల సద్భక్తౌఘసంపోషణా
యరిదూరా శ్రుతినైగమాదినుత యత్యంతప్రకాశాత్మ దు
ర్భరసంపన్నుడ వీవెయంచు మదిలో ప్రద్యుమ్న సేవించెదర్
పరమానంద నిరామయా భవహరా భావజ్ఞదేవా ప్రభూ॥

" ప్రకృష్టో ద్యోద్యుమ్నః ప్రకాశో
యస్యేతి " అత్యంత ప్రకాశమగు పరమాత్మ.

కలుషవనాగ్ని విశ్వమయ కల్పిత సర్వజగత్ప్రకాశ ని
ర్మలభవదూర శక్తియుత రమ్యచరిత్ర భవాబ్ధిపోత భ
క్తులవలన గ్రహింపబడు కూరిమినాత్మవటంచు నెంతయున్
వలగొని మ్రొక్కుచుందు భగవంతుడ వంచనిరుద్ధ సత్ప్రభూ

" అనిభిర్భక్తైః ప్రాణిభిః రుధ్యత ఇతి భక్తులచేత గ్రహింపబడు పరమాత్మ.

పరమేశావ్యయ ఛండశాసనగురో భావజ్ఞచిద్రూప స
ద్వరదా పావనశీల కల్మషహరా వర్ధిష్ణుదేవా క్షరా



క్షర తత్వంబులకంటె శ్రేష్ఠమగు సత్సర్వాత్మగా నెంచెదర్
నిరతంబున్పురుషోత్తమా బుధనుతా నిర్మోహసత్య ప్రభూ॥

" పురుషాభ్యాం క్షరాక్షరాభ్యా ముత్తమః మ. పు. గీ

భయహరవిశ్వనాధ నిరుపద్రవ రమ్యగుణాకరా నిరా
మయ జగదాత్మ సాధుహిత మానసగోచర స్వప్రకాశ యిం
ద్రియములచే గ్రహింపబడు దివ్యతరంబగు నాత్మగాను య
వ్యయ వరదా యధోక్షజ ధృవంబుగ నమ్మితి కారణప్రభో॥

" అధోభూతే ప్రత్యక్ప్రవాహితే అక్షగణే జాయత. ఇతి.

శ్రీపరమేశలోకహిత చేతనరక్షక సత్యసార్థనా
దీపిత తత్వవేత్తలకు దివ్యతరంబగు మోక్షమిచ్చుచున్
పాపులబట్టి శిక్షల నపారముగా విధియించు నాత్మగా
రూపిత ? నారసింహ సకలోన్నతిబొందగ నెంతునో ప్రభూ॥

"నరీయ్యత ఇతినరః హిన స్తీతి సింహః నరశ్చాసౌ సింహశ్చేతి నారసింహః

దినకరకోటితేజ హర దీనజనావన దేవభక్తచం
దన జగదీశ మానివరదా పరమేశ యనాధరక్ష నా
శనరహితాత్మవంచు నెద సర్వవిధంబుల నెంతుభక్తిచే
తనహిత యచ్యుతా కలుష దండన శాసనసిద్ధిత ప్రభో! ౨౮

అచ్యుతో వినాశ రహిత ఇత్యర్థః

పాతకదూర భక్తజన పాలన రాజిత సద్గుణార్ణవా
చేతనరక్షకా జనుల చే పురుషార్థములెల్ల యాచనం

చేతరిచేయగాబడుమ హిన్పరమాత్మగ నోజనార్దనా
ప్రీతితో సంధ్యలందునిను వేడ్కనుతించుచునుందునో ప్రభూ॥

జనైః పురుషార్థం అభ్యుదయని శ్రేయసలక్షణం యాచ్యత ఇతి.

నిరపాయాంతర యామిభక్తవిహితా నిర్వ్యాజ నైష్కర్మమే
దురకారుణ్యా నిరంజనాఖిలగుణా దోషాబ్ధి సంశోషణా
పరమైశ్వర్య సమేతమైబరగు సం పన్నాత్మగా నెంతు సు
స్థిరమౌభక్తి యుపేంద్ర రమ్యచరితా దీనావనా యోప్రభూ॥

ఉపాధికేతి సూత్రాత్ ఉపఅధిక సన్నిధిః పరమైశ్వర్యవాన్

నిరుపమశీల విశ్వహిత నిత్యనిరామయ వేదవేద్య భా
స్కర శతకోటి తేజ గురు సత్వగుణార్ణవ సత్యవర్ధనా
పరమ చిదాత్మ భక్తజన పాపములెల్ల హరించు యాత్మగా
హరి భవదీయనామము హృదాబ్జమునన్భజియింతునో ప్రభూ॥

భక్తానాం పాపం హరతీతి మ. పు. ౯

కరుణాపాంగయనాథరక్షక జగత్కర్తా పరంధామ సా
గరగంభీర చరాచరాత్మ శుభదా కాలప్రమాణాఖిలా
హరవిశ్వాక్ష యనంతశక్తియుతనిత్యానందరూపాత్మగా
ధర శ్రీకృష్ణదలంతనిన్ ప్రణవనాదా బిందురూపప్రభూ॥ ౩౨

“ కృషిర్భూవాచకశ్శబ్దో నశ్చ నిర్వృతివాచకః”
నిత్యానంద స్వరూపుడగు పరమాత్మ.

వచ్చిన యర్థమే మరల బద్యములందున గానుపించినన్
ముచ్చిలినట్టి శబ్దముల మోఘములై గనుపట్ట గ్రంథముల్



ద్రచ్చిన సారమేమియు నెదం రుచిజూపక నుండవచ్చునా
ముచ్చటలందులోపముల పూర్ణతరంబుగ దిద్దనౌ ప్రభూ! ౩౩

వెలుతురుకై దివాకరుని వెన్నెల గాయగ రాత్రిచందురున్
పలువిధ ధాన్యపుంజముల భక్షణకై రసషట్కమున్సదా
వలువలు గట్ట ప్రత్తియును వర్షము పైరుల బెంచనెంతయున్
గలుగగజేసి ప్రాణులను గాచెడివాడవు నీవెగా ప్రభూ॥ ౩౪

సతతము భారతాంబపద సారసముల్భజియించ కెప్పుడున్
గతులనుగాంచి సోదరుల కాటకబాధలదీర్చకుండినన్
మితమును దప్పి పాకముల మెక్కుచు నేరికి బెట్టకున్నచో
బ్రతికినజచ్చినన్ యొకటె పాలనకై యముడుండడే ప్రభూ॥ ౩౫

గలరు యతీంద్రబీరకులు గాని మతంబును వృద్ధిజేయరో
వలజరియించ రెవ్వరును బాధలబెట్టుచు సుంకముల్గొనన్
పలువిధరా బడుల్గలిగి పల్లెలుపట్టణముల్ జరింత్రు బా
ధలుమరిబెట్టి గుంజుదురు ద్రవ్యమునాశ్రమ ధర్మమా ప్రభూ॥

చంద్రసూర్యులు.

వెలుగునొసంగి సస్యముల వృక్షలతాదులనెల్ల బెంచుచున్
నిలనయనద్వయంబుగతు లేర్పడకాలము నా ఋతుత్రయం
బుల నలయాహ్నికత్రయ సమూహవిభక్తము జేయుచుండు కే
వలమునునట్టి సూర్యభగవాను నుతింతునుచేతన ప్రభూ॥ ౩౬

పరగ మయూఖపుంజము లపారముగాను సుధాహిమంబులన్
బరపుచు సస్యజాలముల పాదప పుష్ప లతాదులన్ధరన్

పెరగుచు తగ్గుచున్కళలు బింబమునన్ ద్వయపక్షసంగతుల్
బరగి జరించురాత్రులను భక్తితొ నాశశినెంతునో ప్రభూ॥ ౩౮

జన్మములెత్తినందులకు సాధనజేయక యోగమార్గముల్
మన్మథమాయలోదగిలి మంకుతనంబున సంచరించుచున్
చిన్మయనీదుసేవలను జేయక దాటు భవాబ్ధినెట్టులన్
సన్మునివందితానిగమ సారవిచార పరాత్పరా ప్రభూ॥ ౩౯

మతముల బోధలన్నవిన మార్గము లొక్కటె నిన్ను జేరుప
ద్ధతులను సక్రమంబులగు ధర్మములన్దగు నీతులట్ల స
ద్గతులను గాంచె మానవులు కర్తలు గూర్చిరి పుస్తకంబులన్
సతతము వారిపాదముల సంస్తుతి జేసెద భక్తినో ప్రభూ॥ ౪౦

వచ్చి చలిజ్వరంబునను వాసమునందున గూర్చివేచ నీ
వెచ్చట దాగినావు పరమేశ్వర నాదగు యార్తనాదము
ల్మెచ్చటలయ్యెనా? వినగ బుద్ధిగలంగదొ నిద్రమున్గితో
యిచ్చక మంచు నెంచితివొ యిట్టులొనర్పగనేలనో ప్రభూ॥

చిన్నతనంబునన్దలర క్షేమము గూరిచి సౌఖ్యమిచ్చిబల్
వన్నెగలంగజేసి సరి వారలలో యశముఘటించుచున్
సున్నలుజేసి యన్నియును చూడదరిద్ర మొసంగినావు యే
తెన్నునుగానకుంటి గడ తేర్పుము భక్తజనావన ప్రభూ॥ ౪౨

క్రోధముబూనినావొ మది కొంపలగోడులబాపి యిట్టులన్
బాధలబెట్టి కష్టముల పాలొనరించగనేల నాత్మ నీ



బోధవినంగలేదొ పరిపూర్ణముగా భవదోషనాశ స
త్సాధుసుపోష నిర్మల లసద్గురుభావ విశేషయో ప్రభూ॥ ౪౩

మాడ్చిన నన్ను క్రూరుడని; మానసమందున గట్టివైచెదన్
పూడ్చిన గుంటలో నిడుచు పూర్ణముగా నినుదల్చుకుందునే
వాడ్చిన లేమి గూర్చుచును వర్ణన సేయనె నీదు మూర్తినే
నేడ్చిన నీదు కీర్తిని సహేతుగతిన్దలనుంతునో ప్రభూ॥ ౪౪

నేర్చితి తెల్విమీరగ వినిర్మలమానసమందు నిల్పి ని
న్నర్చనజేయు టెంతయు మహాపదలందు భయంబుబాసితిన్
గూర్చిన కష్టముల్ సుఖము గోర; పరంబున జెందకుందునే
దీర్చుము కోర్కె భక్తినిడి దీనజనావన యవ్యయ ప్రభూ॥ ౪౫

ఆపదలందు దూరితిన హాయవిమానసమందు నుంచకన్
ప్రాపునుజేర్చి దీనతను బాపియఘంబు లడంచి ప్రేమతో
నీ పదభక్తినివ్వ గుణనీరధి మానిహృదాబ్జవాస ని
ర్లోప భవాబ్ధిపోత రిపు లుబ్ధవిదూర నిరంజన ప్రభూ॥ ౪౬

నిర్గుణ ముక్తినాయక వినీతిచరిత్రరవి ప్రకాశయే
వర్గమునందుజేర్తువిల వైరముబూనక నిన్నుజేరగన్
దుర్గతులెల్లబాసి భవదూరుడనై విలసిల్ల; దేవనే
స్వర్గమునైన గోరనిక సర్వమునీవని యంటినో ప్రభూ॥ ౪౭

సహపాఠియులు కొందరేగిరి గనన్ స్వర్గంబునన్ వెన్కనే
గృహమేధుల్పనె కండ్లముందటనె సద్గేహంబులన్దాటుచున్

గహనంబందు తపంబునల్పు ఘనులే కాయంబులన్బాసె నీ
మహిలోశాశ్విత మేరికిన్గలదు సామాన్యంబుగానోప్రభూ॥౪౮

పుత్రిక పుత్రులన్బొసగి పోషణభారమొసంగకుండుటల్
శత్రుడగాను నీస్మరణ శక్తికొలందిని జేయువాడనే
పాత్రుడ నీదయన్బడయ పామరుడంచు దలంచబోకు మా
యాత్రలకేగ ద్రవ్యమిసు మంతయులేదు భరింప నోప్రభూ॥

కాలము కర్మముల్గలసి కష్టము గూర్చునటంచు బల్కుటల్
కాలముకర్మముల్దెలియ కారణభూతుడెవండు గాంచగన్
మేలునుకీడులెవ్వరిల మీరగలారురుశక్తిమించి నీ
లీలలెరుంగశక్యమె నిలింపులకున్ శ్రుతివందిత ప్రభూ॥ ౫౦

కుటిలతనంబునన్ధనము గూర్చుచు బీదలమాడ్చువారికె
వ్వటికిని మోక్షమబ్బదని భావమునన్దరిగుండియున్సదా
కటకవిభూషణాదులను గాంచిన యాశజనించు మాయలం
పట బడకుండగావుమిక పాపవిదూరపరేశ సత్ప్రభూ॥ ౫౧

ఒద్దికజేసి మానస మయో స్మరియింపదు నీదునామముల్
మొద్దుతనంబునన్ సురతి మోహముదుంగక సంచరించుచున్
గుద్దులకైన నోర్చు మరి క్రూరులచెంత వసించుచుండు నే
సుద్దులజెప్పినన్వినదు శోభిలసద్గుణ ధీనిధి ప్రభూ॥ ౫౨

గర్వముజెంది చేతికొక కాసులభించ నహంబుజెందుచున్
దుర్వహులౌచుమెక్కి పరదోషములెంచుచు బుద్ధిహీనులై



పర్వడులైనబీదజన పాళికిబెట్టక నున్నవారికే
సర్వమొసంగి బ్రోతువట సల్పగభావ్యమె పావనప్రభూ॥

కొంచపువారినిన్ననక గొప్పగనెంతురుద్రవ్యవంతులన్
కొంచముగొప్పయై నెగడుగొప్పయొకప్పుడుకొంచమౌనుయో
చించగ కొంచమే పరమశ్రేష్ఠము దెల్పు నధర్మధర్మముల్
గాంచును నీదుసేవల నఘంబులడంగగ నిర్మల ... ౫౪

దీర్చుము నాదు కష్టముల దీనజనావన భక్తపాలనా
యార్చుము కిల్బిషాగ్ని కరుణాబ్ధిహరీ నను గాల్చకుండగన్
మార్చుశనిగ్రహంబునిక మందిరమందున నిల్వకుండగన్
జేర్చుము నీదు సన్నిధికి శీఘ్రమె దేవమహేశ్వర ... ౫౫

శుభములొసంగిబ్రోచుచును జూచెద చల్లనిచూపులంచునా
కభయ మొసంగ నీకుమరి యాదకు భంగమ? గాకయున్న నే
నిభయము పాపనాశనయమేయ ఘృణామయ నిర్వికారయో
త్రిభువనరక్ష నన్ను కడతేర్చుదరిద్రము నుండి సత్ప్రభూ ౫౬

వదలను నిన్ను కష్టముల బాపిన సత్వర బాపకుండినన్
పదముల మానసంబునను బంధన జేసెదచూడుమింక నే
మృదుమధురంబులై వెలయు మేలగుగీతము లాత్మబాడెదన్
సదమలరూప యోనిగమ సార ముదంబును జెందుమో...౫౭

గనునే పుణ్యము కాకులన్బడచి గద్దల్మెక్కగా బెట్టినన్
ధనముల్వడ్డి కొసంగి బీదలకు నద్దానిన్గడున్ బెంచుచున్
వనముల్బావుల హేమముల్ సురభులన్ వాసంబులన్దీయుచున్
ఘనులై ధర్మమొనర్చ బొందుదురెసన్వర్గంబున్ త్రిలోక...౫౮

కూడిన ద్రవ్యమున్నిదనక కోటులగూర్చగ నాశబెట్టుకన్
జాడలెరింగి వర్తకము సల్పుచు నోడలపైన వస్తువుల్
వాడలకంపుచున్ చివరవార్త దివాలిది క్రొత్తగాదు నీ
వాడనొనర్చ వద్దటుల వాశిని గాంచగ జేయుమో ... ౯

నాదగు దుంపదెంప గన నారతమున్ చలిబట్టియాడ్పెనిః
ఖేదముతోడ నిన్నుమది కేవలమున్భజియించి శాసితిన్
భేదములేదు భక్తులెడ బిడ్డలభంగిని జూతువెంతయున్
పాదములాశ్రయించితిని బాధలబాపియు బ్రోవవే ... ౧౦

జేరినవెన్క యాంగ్లులు విశేషముపన్నుల బాధమించి యీ
భారతభూమికే కఱవు ప్రాపితమాయెను కూడుగుడ్డయున్
కూరలులేక నాకలికి గూలుచునుండిరి బీదలెంతయున్
పారమెనాకు నీవు పరిపాలనజేసిన దీరునో ... ౧౧

కుటిలముబూని శోణితము గ్రోలుచు దుర్బలుజేసి దీర్ఘ సం
కటముల పాలొనర్చుచును కాలముబుచ్చుటకన్నమేలు జం
పుట తృటికాలమందు బుధపోష సనాతన వాసుదేవ సం
ఘటన మొనర్చినన్ భయము గాంచసుమా కరుణాకర...౧౨

సందియమెల్లదీర గుణ సత్వమెరుంగగ భక్తకోటిని
బ్బందులబెట్టిబెట్టి నిర పాయముతోడను మాడ్చువాని కా
నందముజెందియోర్చుచు మనంబున నిన్ స్మరియించు వానినీ
మందిరమందుజేర్తువట మాధవ దీనజనావన ... ౧౩



దబ్బరలాడకుండెడి ని దానము సత్వగుణప్రధానమున్
కబ్బములల్లనీపయిన గాఢతరంబగుభక్తి ధారణల్
యబ్బగజేసి భక్తివిన యంబులొసంగుచు మానసంబునన్
నిబ్బరమందజేసిగను నిత్యశుభంకరలీల నో ... ౧౪

కాలముజూడగన్వేతల గాంచుటెగాని మరేమిలేదు పాం
చాలమునందు సోదరుల సాహసమొప్పగడయ్యరెంతయున్
గాలిచె నిట్టిదుష్క్రియల గన్గెనుకష్టముసంభవించె నే
మూలనుగాంచినన్ భరత భూమి దరిద్రత నుండెనో... ౧౫

బలికియబద్ధముల్ధనము బంచకసోదరపాళికిన్దయన్
సలుపక జీవనంబనుజ సంఘముకంతకు బొట్టనిండగన్
గులుకుచుమెక్కి త్రేపగనె కూనలు దానునుకర్వుదీరునే
పలువురతోడ జచ్చుటయె బాగగుపెండ్లిసమానమా ... ౧౬

బ్రతికిననేమి బీదజన పాలిటిద్రవ్యముమెక్కి బొట్టకున్
మృతిగను శ్రేప్రసిద్ధమగు మేలు సమత్వము బూనగావలెన్
సుతునికిబెత్తనంబిడిన సోదరులందరి జూడకున్నచో
మతిగని దానికిన్దగు కుమారునినిల్పడెత తండ్రియో ...౧౭

వారకమట్టిబట్టినను వన్నెలదీరుచు దృప్తినిచ్చు బం
గారముగాదెసద్దశను గండములన్నియుదాటి యెట్టులో
చేరముజేయ దుర్దశల భించెడి నష్టమెగాక మంచి బం
గారముబట్ట మట్టియగు కాలయుగంబుల ధర్మమౌ ... ౧౮

ముందటిభాగ్యవంతులు సమూలముతో తలక్రిందులౌచుమే
లందున కన్నుమిన్నుగన కాత్మలోకిడాకరవ్వ గల్గినన్
కుందుచునెందరోచనుట గోల? ధనీకులజూచి సిగ్గునన్
బొందరు వడ్డిబెంచుచును పోషణజేతురు కోట్లకో... ౭౯

సరిగా సంధ్య నొనర్చు బాపలిల సాక్షాత్కారమున్నారు నా
కరులజ్ఞేయగ నాంగ్లమే శుభ్రితులుగా గాంక్షించి పల్లింత్రు ఛీ
పరువా? లేక ప్రతిష్ఠయా? గనుడికన్ పైపైన వేలైనని
ధ్ధరకూలిగ్గన దాస్యవృత్తియెకదా వేదాంత వేద్య... ౮౦

తురకలు జేరిసద్ధనము దోచిన కొందరు పాదుషాలునే
ర్పరులయి రత్నహేమములు బట్టుకపోరిటు లాంగ్లులట్టులన్
ధరలను బెంచి పన్నులమితంబుగ వేయుచు మాడ్చుచుండె నీ
భరతము భూరికష్టముల పాలయిగుందగ నేలనో... ౮౧

కులములు మార్గదర్శకుల గోరుచు విప్రులకివ్వమీరుచున్
మెలగక సత్యధర్మముల మిత్రుల శత్రులజేయుచున్ నవా
బుల దరిజేరి నౌకరుల బొంది స్వరాజులకేమి సాయమున్
సలుపక బోయెనెందుల విచారము బుద్ధివిశేషమో... ౮౨

అమితప్రేమను సర్వకాలముల స, ర్వావస్థలందున్ హృదా
బ్జమునగ్గాంచి కొరంతదీర్చుచు విలాపంబుం దొలంగంగనే
యమగావించెనొ దేశపర్యటన సా, హాయంబునన్ప్రీతినా
భ్రమరాంబాబ్జముఖేందుబింబ గనుమా భద్రంబుగానో...



గీతలు వేదభాష్యముల గీముల క్షత్రియ వైశ్యశూద్రులున్
బ్రీతి బఠించరాదనుచు విప్రులు కొందరు బల్కుచుందురా
పాతకపుణ్యముల్దెలియ పాఠకు లేమరి గర్తలౌనుయో
చేతనరక్షకా యభవ చిన్మయ నిత్యనిరామయ... ౮౪

భరతముజేరి వర్తకనెపంబున మెల్లగ నాంగ్లవర్తకుల్
తరుణము జూచి వైరముల తక్కిరిబిక్కిరిజేసి రాజులన్
నిరుపమదేశమంతయును నేర్పరులై దగనాక్రమించుచున్
తిరిపము నెత్తగా ప్రజల దీసె పరిశ్రమలన్నియో...

మాయలజేసి కొందరిని మంత్రులగట్టుక కొందరి న్ధనా
దాయముజూపి కొందరిని తప్పులబట్టియు శిక్షజేసి య
న్యాయముగాను కొందరిని యాంగ్లులుదోలిరి రాజ్యకాంక్షచే
జేయము నేరమేమియిటు జేయుటమమ్ముల ధర్మమే... ౮౬

దగ విక్టోరియరాణి తొల్లి కలకత్తాయందునన్ ప్రేమమీ
రగ వాగ్దత్తములన్ యథార్థసరణిన్ రాజిల్లగాజేసె నే
ర్వగ నెడ్వర్డును జార్జిభూధవులు ధా రాళంబుగా బల్కినా
దిగువన్నా! క్రియ శూన్యమింతవరకున్ దేవాది దేవ... ౮౭

మీరక భారతీయజన మేటులు మాదగు రాజ్యపాలనా
భారము మోతుమంచుగురుప్రార్థన పూర్వకమొప్ప రాణినిన్
గోరిన నప్పుడట్టులొన గూర్చుచు నాదును ధన్యరాలగా
వేరుగజూడ మిమ్ముల సుమీ? యనిబల్కెను వేడ్కనో...

పడిమాన్యంబుల నేరికిచ్చె గనుడీ మార్గంబు దేశంబునన్
గడుసున్ జూపుచు వృత్తిపన్నులచుకు గ్రామంబులన్ లాగిరా
బడిజూపించిన తెల్లవారు దిన గో మాంసంబు బెట్టించిరన్
గడియన్ రాయబహద్దరాదులను వే గైకొందురో సత్ప్రభూ॥

స్వల్పపుకాగితంబులను చక్కగవ్రాసియొసంగు గానిచో
కల్పితరాష్ట్యనాణ్యముల గౌరవమంచునొసంగునాపయిం
నల్పులటంచు భారతుల హాస్యముజేయుచు నెక్కిరింత్రు వే
నల్పనిబీదవారలని! నక్కిలిజూడరు సర్వదా ... ౮౦

క్రొత్తవిపన్నులెన్నొయొన గూర్చుచు నీళెల కత్తికట్లన్
కత్తులదెమ్మనన్ యొసగి కాళ్ళనుజాచిరి రానురాను మ
మ్మత్తరిజేసె బేలలుగ నేర్పరుపెద్దలు ముందుయోచనల్
సత్తువదీసి భారతము సర్వము నాంగ్లులుబీల్చె నో ... ౮౧

యూరపుయుద్ధమందచట యోధులలక్ష్యము జేయ కెంతయున్
భారతవీరవర్గము ల పారబలంబును విక్రమంబునన్
బోరి జయంబుగూర్చ వర ముల్దయచేయుచు సున్నజుట్టెగా
నేరముగాద! నాంగులది నిత్యనిరామయ ధీనిధి ... ౮౨

రక్తముధారబోసి రణ రంగమునందు జయంబుగూర్పగా
యుక్తినిబన్ని మున్నుభర తోర్వికొసంగిన సద్వరంబులన్
రక్తిదొలంగజేసి మరి రౌలటుమార్షలు శాసనంబులా
సక్తినొసంగక్రూరముగ సత్యమదెక్కడనో గురు ... ౮౩



జడియకయుద్ధమందు నల చావునుగాంచకగూర్చగెల్పు న
ప్పుడుగని భారతీయులకు పూర్తిగ హక్కులనిత్తుమంచు సా
పడ కుడిచేతిలో నిడుచు భండనమాగిన ధైర్యమూనుచున్
నెడమనులాగివైచె నిది యేమిటి కారకుడెవ్వడో ... ౮౪

జెప్పిన లాగునన్వెనుక చేతులతాళము వేయు వారికే
గొప్పకితాబులందుటకు కోరిననౌకరులెల్ల బొందగన్
మెప్పును గాంచపెద్దలుగ మిత్రులుగా మనుగౌర్నమెంటుచే
జెప్పిన ముందుహెవ్యములు జేర్తురు జైలుకువేగమో...

భేదముగూర్చివైరమును బెంచుచు జాతుల కొంతకాలమున్
వాదముల న్మతంబులను వర్ధిలజేయుచు వత్సరంబులన్
ఖేదము గూర్చికొందరిని గెల్పునుబొందగజేసి పల్వురన్
మోదముబాపి యాంగ్లులిటు భూమినినేలుచునుండెనో... ౮౬

ఉత్తరయుర్మినప్పుడిల నూరకెతాచులు దర్శిబీకిరన్
బొత్తిగధర్మమార్గముల బూనకరాజులు మేరదప్పిరన్
మిత్తియటంచుబల్కు నల బెద్దలవాక్యము లాలకించగా
క్రొత్తలుగావు చిద్ఘనయ రూపచరాచర నాయక ... ౮౭

ప్రత్యేకంబుగ హంట రాఖ్యసమితిన్ పంజాబుకున్పంప సాం
గత్యంబొప్పగజేరి పెద్దలమతుల్గారించి తెల్లంబుగా
సత్యాసత్యములెల్ల దెల్పుమనుచున్ సర్కారుబల్కంగనా
చిత్యంబంతయు తెల్లవారిదని బంచేన్ వార్తనో సత్ప్రభూ॥

బంప నివేదికంబుగని పార్లమెంటున జూచిన్యాయ మే
చంపకొ ద్రోసి దేశమున జాటెను దీనినిమర్వుడంచు త
ల్వంపుగనెంచి గాంధినిర పాయసహాయనిరాకరంబు మ
న్నింపక బోధజేసె జనులెల్ల గ్రహించిరి దానినో ... ౮౯

నలుపే గిట్టదు తెల్లవారి కెటడా నన్జేసి పంచాయతు
ల్సలుపన్మాబనిన వారలెక్కువగుటన్ సత్యం బసత్యంబుగా
గెలుచున్నాదని శాసనంబుగను సా గించున్నదానిచ్చటన్
తొలిపాపంబుల కీయవస్థబడ సంతోషించితే సత్ప్రభూ॥ ౯౦

పాపస్వేమియు జేయలేదు మరి యే పంతంబును న్సల్పరే
ప్రాపుల్ జేర్చగ దేశభక్తుల సభల్ భావంబులన్దెల్పగా
కోపంబేమొ యెరుంగ మాడయరుయా క్రోశించగానెల్లరున్
రూపంబుల్జెడ మాడ్చె యంత్రమున మొత్తోయంచు నేడ్వన్

పేలిచె క్రూరులా జనుల బెద్దలనందర భీతిదీర్చె పాం
చాలమునందు డయ్యరని సంతసమందుచు నాంగ్లభక్తులే
జాలము సేయకన్సభల సల్పుచు గొప్పబహూకరంబులన్
మేలనె పార్లమెంటుసభ మిత్రులు సత్యము గాంచుమో...

బట్టుక నాంగ్లసుందరిని బాదెనటంచు నెపంబు నెక్కటిన్
బెట్టుచు నడ్వకుండ నల వీధినిగావలి నిల్పి కొందరిన్
బొట్టల ప్రాకజేసిరట బోయిన! కండ్లకు మానవోత్తముల్
గుట్టలనున్నపాములటు గోచరమయ్యెన సేవక ... ౯౩



మేలునుజూచి యోర్వకతమిన్నకురునాథుడుక్రూరుడౌచుపాం
చాలిపరాభవంబు సభ హాయన సల్పెను బూనివైరమున్
పేలిచి కొల్వునన్గలుగు బెద్దలబిన్నల డయ్యరెన్న పాం
చాలపరాభవంబిపుడు సల్పెను వైరములేకనే ... ౯౪

పడతుల చెంతనుంచి మగ వాండ్రను గొట్టెను బిడ్డలందునన్
పడతుల మానభంగముల బట్టియొనర్చిరి కొన్నితావులన్
పడతులుగారె యిట్టినగు బాటులొనర్చినవారు జూడగన్
బుడతల బట్టి నిర్దయను మోదిరి యేడ్చినకొద్దియో ... ౯౫

బడిలో బాలుర మోకునట్టి యిసుక స్వర్వోత్తగా జేయుచున్
నిడుముల్బెట్టెను కాళ్లబొబ్బలగుచు న్నేడ్వంగనో దార్చకన్
బడవైచెన్ నెకపెండ్లి వారిపైన న్బాంబుల్విమానంబునన్
గుడగుండ్లాడగరాదు యేవురెట సంకోచంబటాయో... ౯౬

మేలును గూర్చెయుద్ధముల మిక్కిలి శౌర్యముజూపి వీరపాం
చాలురు యాంగ్లవర్గముకు సంకుచితంబును లేకనెంతయున్
మేలుకు కీడొనర్చుటయె మిన్నవిధానమటంచు బూనిపాం
చాలురగాల్చెనాంగ్లులెద సంకుచితంబున నూరకే ... ౯౭

సర్వజనంబులందరికి సర్వతపోధనపాళికంతకున్
సర్వమతస్థులందరికి సర్వచరాచర భూతరాసికిన్
సర్వమయుండు చిన్మయుడు సర్వహృదాంతరవాసితండ్రిగా
నుర్విని గాంచునెల్లరు సహోదరు లే; గతి గాంచరో... ౯౮

మానక నైన పూటల న మాజునొనర్చుచు మానవృత్తిచే
జ్ఞానము గల్గి కొందరు ని జంబగు భక్తి ఖురానుపన్నముల్
బూనిపఠించి యీశ్వరుని బోదుకు నిద్దుర సత్యసంధులై
దాన మొనర్తుపండుగల దల్పమహమ్మదుజాతియో... ౯౯

అరణంబుల్బడిపోయి సంద్రమున కన్యావిక్రయాదుల్బలే
బరికింపన్నవి కొంతదగ్గగనె సం ప్రాప్తించె వేరొండిటుల్
వరకట్నంబులు? వైశ్యులందిది మహా భారంబుగావించెడిన్
సరణిన్ శాస్త్రములందుజూడగ దురాచారంబులే సత్ప్రభూ॥

నూటపదార్లొసంగిన జ నుల్గొనియాడుచునుండెమున్నయా
నూటపదార్లపై మొదట నొక్కటిజేర్చిన పర్వదానినిన్
దాటిమరొక్కటిన్నిలుప దప్పకవచ్చెను కట్నములన్
బూటకమేమిలేదుగన బుట్టెను కోమటియిండ్లనో... ౧౦౧

ఇంటను భార్యకున్ రజిత హేమసమంచిత రత్నహారముల్
జంటల కాసులన్గళము సర్వమునిండగవేసి త్రిప్పుచున్
వంటకుబెట్టి యొక్కరిని వర్తకమెంతయొ జేసి యప్పులా
వెంటదివాల దీయుచును వీలగుసొమ్ముల దాచునో ... ౧౦౨

దెలియన్నాంగ్లుల యుక్తులన్నిటిని సందేహంబులేముందునో
బలుకన్దీరుపు ముప్వురన్దెలుపునా పై భారతీయద్వయం(శ్వేత)
బిలనేర్పాటొనరించు చుందురధికం బెవ్వారికిన్గల్గునో
దెలుపు న్మువ్వర భేదముండదకటా దేశీయులేమా ... ౧౦౩



సతతము వేదశాస్త్రముల సారముజూడక వ్యర్థులై సదా
మతకలహంబులన్దగుచు మాటికి చీటికి కోర్టులెక్కుచున్
వెతలను బొంది శిక్షలను వేబడిద్రవ్యము పాడొనర్చి స
మ్మతి బడకుండ వర్తిలుట మంచిదిగాదెటుజూడనో ... ౧౦౪

మహమ్మదీయులను గూర్చి.

పీర్లనునిల్పుటెట్టులనొ బిన్నలసహ్యపువేషధారులై
పీర్లను నిల్పి వేడుకతొ వేటల గోయుట గూడనల్లె వే
సార్లు సులోచనంబులిడి శాస్త్రములన్వెదుకంగ సున్న స
ద్ధార్లిటు సల్ప రెవ్వరును దండన జేయవె కొంటెలన్ప్రభూ॥

గాంచ ఖురాను వేదముల గన్పడవెందులనీతి భేదముల్
వంచనబూని యవ్వనులు వద్దను హైందవ మేళతాళముల్
కొంచము బన్కి రావనుచు గోరుమహమ్మదు వాద్యశబ్దముల్
దించును దెబ్బలాటలకు దిక్కుదెసన్గనకుండనో ... ౧౦౬

వినునా విగ్రహముల్పి నాదముల సద్వీనుల్కన్నులున్ గల్గి గ్ర
న్థనవాద్యంబుల నెట్లు పీర్లువిను కర్ణంబుల్దగన్ లేకనే
దనరన్ బీర్లకు శక్తి బొమ్మలకు యుద్ధం బవ్విధయే సల్పెడిన్
మనబోరాటము లేల జూడుడెదమ ర్మంబేలనో సత్ప్రభూ॥

మాంసాహారులటంచు జూచిన ము సల్మానుల్దరన్నిందులా
మాంసాహారులుగారె భారతులు సా మాన్యంబుగా నోర్ధ్వ వి
ద్వాంసుల్బ్రాహ్మణజాతిమీనచయముల్ భక్షింత్రుపంచత్వగో
మాంసాదుల్మదసూకరంబులను ప్రేమన్మెక్కు నీముల్ప్రభో॥

భారత మాతకున్ముసల మానులు హైందవు లిర్వురొక్కటే
కోరిక చంద్ర సూర్యులను గొల్చుచునుందురు భక్తిమీరఁగన్
వారలఁగాంచ రే దివస భర్తలు? పూజ్యులు భేదమెద్దియో
దీరును యోచనంబులను దిద్దఁదగున్ వైరంబునో ... ౧౦౯

కోట్లనలంకరించి తల గుడ్డలతో నధికారు లొచ్చినన్
చీట్లను వ్రాసిరూకలను చేతికొసంగక గ్రామరెడ్లు కో
మట్లను కష్టబెట్టుదురు మన్ననజేయరు డబ్బుగోర తా
కట్లనుబెట్టివేచెదరు గట్టిన పన్నులబెంచుచున్ ... ౧౧౦

అధికారంబు వహించినంతటనె యార్యావర్తము న్దాటుచున్
బధిరవ్యాధినిబొంది సోదరుల సమ్యగ్వాక్కు లాలించకన్
విధిధర్మంబిలగాను దాస్యమని దా వీక్షించడా నౌకరీ
కధలున్వ్రాల్కను నాంగ్లపక్షముననే కాలంబునన్ యో ...

కోమలవృక్ష సంతతుల గుల్మలతాదుల పుష్పజాతులన్
జీమల తెల్వి తేటలను చేపలచూపులు సంద్రమందునన్
సామజరూప మోష్ట్రముల సర్పకులంబుల శైల పక్షులన్
నీమహిఁగాంచ నీమహిమ తేర్పడజూపును శాశ్వత ... ౧౧౨

మ్రింగును క్షుద్రజంతువులు బిడ్డలనైనను గల్గ నాకలిన్
మ్రింగును చిన్నచేపలను మీనులు పెద్దవి నీరమందునన్
మ్రింగినదానివేరొకటి మ్రింగునుదానిని మెక్కునొక్కటిన్
మ్రింగుచునుండెసర్వమును మించిధనాఢ్యులు బీదలన్ ...



గనినన్ యింద్రశరాసనంబునల శృంగారంపు మేల్వన్నెలన్
గనినన్ పక్షులవర్ణపల్కులు మహా కాంతార వాసంబునన్
గనినన్ కేకిసుపింఛముల్ శుకతతిన్ గంధేభరత్నంబులన్
గనినన్ సుందరపుష్పముల్ మహిమలే గాన్పించుశక్తి ...

పాలుకువేలువచ్చినను సంతస మందక గాయలమ్మియూ
పోలినిబిల్చిడబ్బునకు బుట్టెడుపండ్లను బోయుమంచునే
జాలినిలేక గుంజుదురు స్వల్పపులాభము తట్టమోయుగా
జాలదు పాపమంచు దయ సాయముజేయ రదేలకో... ౧౧౫

కూలికి బోకపర్వునకు కూరలు గాయల తట్టబూనుకన్
వేళకువచ్చి కేకలిడి వీధులదిర్గుచు నున్నజీరుచున్
సోలెడు పొట్టుగింజలిడి చూరగొనున్ధన గర్వబల్మిచే
వీలుగనున్న మ్రింగుదురు బీదల బుట్టలపండ్లనో ... ౧౧౬

లాభమదెంతవచ్చినను లక్షలమీరుచు యాశదీరదా
లోభులకెప్పుడున్ ప్రజల లో నవమానము బొందుచుంద్రునా
ప్రాభవమేలకో నతని పాలిటిజేరుచు నీచమందెన
య్యా? భవదూరనీకెరుకెయా త్రివిదూర గుణార్ణవ... ౧౧౭

బ్రతికిన నాల్గురోజులిల భక్తితో నీశ్వరు నెంచగావలెన్
వితరణగల్గి దీనులకు బెట్టుచు ప్రేమను జూడధర్మమా
నతిథుల పూజలన్దనిపి యన్నము మానముగా భుజింపుచున్
సతతము సాధుసేవలను సల్పిన పుణ్యముగల్గునో ... ౧౧౮

అబ్బినసేమి సార్థక మహాద్రవిణంబిల లోభివానికిం
దిబ్బలనైన వైచు నెట దీయడు కాసును ధర్మమన్నమా
సుబ్బని వద్దకేగుమని జూపును నిల్చినదాగు; కోతికిం
గొబ్బరికాయ గల్గినటు కూడును మెక్కడుబొట్టకో ... ౧౧౯

నిండి సమస్తలోకముల నిత్యనిరామయ యండపిండబ్ర
హ్మాండము లెల్లపూర్ణగతి నబ్జవిభాకర మృక్షకోటికిం
ఖండతరాజ్ఞలన్నొసగి చారుతరంబుగ సంచరించభూ
మండలమెల్లజేయ వె తమస్సును బాపగనక్షర ... ౧౨౦

ఓఘన దివ్యతేజ కరుణోదధి చిన్మయ సత్యకామ స
ర్వాఘ విభేదనా ? మునిజ నావన స్థూలవిసూక్ష్మకారణా
మేఘుని గర్జనంబులను మించుల నింద్రధనస్సు గాంచ నీ
లాఘవ మెల్లగన్పడు, నిలం పరమేశ్వర పావన ... ౧౨౧

శుష్కప్రగల్భ్యములవ్వలికి శుద్ధయబద్ధము లాడువారలే
పుష్కల మొప్పబిడ్డలను బోషణ జేయుచుహాయినుంద్రు వే
నిష్కరషంబుగా వలికి నిత్యముసత్యముతో జరించగం
ముష్కరురీతిజూచెదరు మూర్ఖులు నైగమవందిత ... ౧౨౨

వెంటను మెక్కుపందులను బెంచెడి వారలు బావినీరముల్
నంటగ వచ్చుధేనువల లాశను లంచును పంచమాదులం
గెంటుదు రేమొ దూరముగ గీములజేరిన దిట్టిబోయుచుం
నంతట వారుమానవు ల టంచు నెరుంగరె యక్షర ... ౧౨౩



గర్వము బొందియెక్కువని గాల్చుకదిందురు పంచమాదులం
తెర్వుల నడ్డపెట్టెదరు తేలరుకూలికి వారులేనిచో
సర్వసమత్వమెక్కడనొ సన్నగిలెం బ్రేమాను బంధముల్
స్వరము నీవెరుంగుదువు సర్వమయా జగదాత్మక ... ౧౨౪

పస్తుపరుండి గట్టగను పంచలు (వల్వాలు) లేకను పంచజేరనే
రస్తులజేసి దెప్పిపసరంబులభాతిని జూచుచుంటచే
క్రీస్తుమతంబు నన్గలసె గిట్టుచునుండిరి దాకనిప్డు లో
కస్తుతి శాస్త్రవేత్తలెటు గాంచిరొ ధర్మము జూడుమా... ౧౨౫

సోదరులంచు మాలలను జూడ దగున్మరి యాదిమాంధ్రులం
వాదనలొద్దు సేవ్యమెటు వారలు లేనిది సాగు జూడుడీ
భేదములేదు దేవునకు బిడ్డలె సర్వకులస్థు లందరుం
సాదమొసంగి దీనులను సాకగబుద్ధి నొసంగుమో ... ౧౨౬

పుత్రులరీతి గేహముల మాలలనెల్లను సంచరించుచుం
క్షేత్రములందు కష్టపడి సేద్యమొనర్చుచు పంటపండగం
గాత్రము లెండ బెట్టుచును గైకొనిసర్వము రైతులెంతయుం
శత్రులగాను జూచెదరు శాశ్వితమే యవి మెక్కనో...౧౨౭

ఎక్కువ జాతివల్ల గననెంతురు రాదటు సత్యసంధులై
జిక్కక వైరిషట్కముకు సేవనొనర్తురొ దేశమాతకుం
స్రుక్కక వారిపెద్దలని శ్రేష్ఠులటంచు మహాత్ములంచు న
ల్దిక్కుల సాటవచ్చుగద ధీనిధి భక్తవశీకర ... ౧౨౮

భారతదేశ మింకెపుడు భాగ్యసమన్విత మొప్పజేసెదో
కోరిక లన్నెలంగగను కూలిజనంబుల బుద్ధిదీప్తివో
కూరిమిగల్గి వర్ణములు గ్రుమ్మరి విద్యలదేల జేతువో
సారెకు నీపదాబ్జముల సన్నుతి జేయగనిచ్చల ... ॥౨౯

కలసిధనంబు జేరునెడ కారులు మల్లులుసిల్కువస్త్రముల్
జలములుద్రావ వంటకము సల్ప విదేశపుపాత్రలెన్నియో
వెలయగ సార్టు సైకిలులు వెల్తురుకే యెడగ్లాసులైట్లు కే
వలము గృహంబునిండగ ధృవంబుగగార్తురు సంచులో ...

ప్రజలన్గావప్రభుత్వ మేర్పడెనలా భంబా ప్రభుత్వంబుకై
ప్రజలే బుట్టిరె? గాంచమానసమునన్ బండారమున్దేలు స
ద్భుజబల్మిన్ బెదరించి పన్నులసదాపూర్ణంబుగా బెంచుచున్
భుజియింపన్మధుమాంసవస్తుచయము ల్పుణ్యాంబొకో సత్ప్రభూ॥

భరతము పాడియావుదగ వత్సములన్నిటి గట్టిమూతులన్
తిరముగ తెల్లవారగని దీయుచు బాలనుగాచి గ్రోలి దు
ర్భరమగు పెక్కులన్ స్మృతుల వ్రాయుచు సారమునంత
[గుంజుచున్
పరిపరి దుఃఖముల్గలుగ భారతమాతకు జేతురో ... ॥౩౨

పశువులచర్మమున్ డులిచి పక్వమొనర్చుచుమాంసమెంతయున్
యశనముగా భుజింతురని యంటును పంచములందు జాతురే
పశువుల చర్మమున్గొనక పాదములెట్టులగాచుకొందురో
విశదము జేయరే బుధులు వీసముధర్మముబూని సత్ప్రభూ॥



ఫలముల్భక్షణజేసి కొన్నిదిరుగన్ పక్షుల్మృగంబుల్ధరన్
పలలంబుల్దిని సంచరించు మృగముల్పక్కుల్గనం గొన్నిటన్
వెలయున్నట్టులె శాకమాంసములభా వింపన్నరాళిన్దయా
జలధీ సర్వమయాదిమూర్తి వరదా సర్వాంతరాత్మా ... ॥౩౪

వేచిజనంబు లందరిని వేలను గూరిచి కల్లలాడుచున్
దాచి కుమారవర్గముకు తండ్రులొసంగుట మర్త్యులందెసూ?
పాచిధనంబు పక్షిమృగ పంక్తికి బెట్టవు చూడగానికన్
దోచుటలేదు మంచిదగు త్రోవనెరుంగగ దెల్పవే ... ॥౩౫

వెలయన్ సంస్కరణంబు లన్గరపెమోర్లేమింటోధిశాలులా
వల మాంసేగు చలమ్ముస్పర్ధలవిసం భావించి తీవ్రంబుగా
బలికైన్మార్షలు రాలటాదు లెలమిన్ బంధించుచు స్సర్వస్వే
చ్ఛలధర్మంబుల బల్క తొల్లి ఋషులా సత్యంబులేదా ...

గ్రుక్కెడు జావద్రాగుచును కూటికిలేకను బాల్యమందునన్
సృక్కుచు భాగ్యమబ్బగనె శ్రేష్ఠులమంచు తరంబులన్నిటన్
నిక్కుచు పూర్వపున్స్థితుల నిక్కమెరుంగక పైన మబ్బుకున్
చుక్కలు బెట్టి నామనుచు చూడ బడాయిబుగొట్టునో ...

పుక్కిటబెట్టుకన్విషము పుణ్యులమంచని పైకి జెప్పుచున్
రొక్కములిచ్చి ధర్మమని రూఢిగబల్కుచు మాయజేసి చే
జిక్కినవేయుచున్నటక చేతులు వట్టివిజూపు మెల్లగా
కక్కినకూటికాశపడ గాంధునకీర్తి మహేశ్వర ... ॥౩౮

క్షత్రియుడింగి నష్టపడి సర్వధనంబులు కృంగిపోయి వి
ధ్యుక్తపు కర్మలన్విడక నుత్తమమార్గమునన్ జరించుచున్
భుక్తికి లేకపోయినను బూనక కల్లలు సంచరించగా
ముక్తి లభించుగాదె పరిపూర్ణదయాకర పూజిత ... ౧౩౯

తద్దినమన్న బాపనికి దమ్మిడిచేతిలొబెట్టి బంపుచున్
ముద్దనుబెట్ట కెవ్వరికి మూడగుపిండములైన వేయకన్
రద్దును లేక ద్రవ్యము నిరంతరమున్ దగ్రపోవుజేయ నీ
వద్దికిజేర నెట్లగును భక్తజనావన పావన ... ౧౪౦

అరయగ నాంగ్లవిద్యపఠనాలయధర్మములన్ని గాంచినన్
కరుణతొ శిష్యవర్గముల గాంచరు వృద్ధినిగోరి చక్కగా
పరమమనీషులొటకును పాఠము లివ్వరు ప్రేమజూపరా
గురువుకు పంగనామముల గూర్తురు శిష్యులు చూడనో ...

పక్షుల వర్తనంబుగన బాగుగనున్నది దేనగాంచినన్
కక్షలు లేవు స్వేచ్ఛగను కాలముబుచ్చును తప్పులేమియున్
శిక్షలునున్న పొట్టకయి జేరిచిదాచుటలేదు తృప్తిగా
కుక్షులనింపిజేరి జత గూటిలొ గూడుచునుందునో ... ౧౪౨

నెలనెలకైదువేలగొని నిండకబొట్ట ధనంబు గూర్చుచున్
దెలుపుము బీదసాదలను తెన్నుగనుంగొనియుంచు పాలకుల్
బలికిన వెంటకాటకపు బాధలెరుంగరు సర్వమానవుల్
వెలలకు భీతినందరని వేడుకదెల్పెను జూడుమో ... ౧౪౩



కాలము వెంట వర్షములు గాంచక పైరులు మాడిపోయి యే
కూలియు నాలిలేక మరి కూటికిమాడుచు కొన్నితావులన్
గూలుచు మెక్కుచున్ తవుడు కొందరు నిర్జరదారుపత్రముల్
గోరులుచు నీరముల్ బ్రతికె గోడెరుగన్ ప్రభులెవ్వరో ...

మార్గము జూపకన్ ప్రజకు మాటల తేటగ ప్రేమజూపకన్
స్వర్గమునుండి వచ్చినటు సర్వమెరింగినభంగి బొంగుచున్
దుర్గమ కాననంబులను దోచెడివారలమించి గాంచ నే
వర్గమునందుజేరకను వర్తిలు కల్మషచిత్తులో ... ౧౪౫

పాకము లెన్నియో గొనుచు భక్షణజేయుచు బొట్టనిండగా
సూకరమట్లు! సౌఖ్యముల జూచుక గర్వము జెంద లాభమే
లోకులకష్టముల్దగవి లోకనజేయుచు నాదరించకే
చేకొను స్వర్గమెట్టుల వశీకరభూత చరాచర ... ౧౪౬

దెలియడె పుణ్యపాపముల దేవుడు మానవులందు నెయ్యడన్
కులమున బాపడైకలుము కోటులొనర్చిన; దేవళంబులో
పలకు జొరంగవచ్చునటు పంచమపుణ్యులు సత్యవర్తనుల్
మెలగుటతప్పు ధర్మమని మిత్రులు బల్కుచునుందురో...౧౪౭

ఒకజాతిన్దిగద్రొక్కి హీనులని కుయ్యుక్తుల్పురాణాదులన్
నకలంకంబుగజూపి కల్పనలనూహల్జేసి గల్పించినన్
నొకకాలంబున హరలీశ్వరుదయన్ నొప్పున్దశల్మించి త
ప్పక విప్రాదులధోగతిన్బడును సందర్భంబులేదో ... ౧౪౮

యుత్తమజాతియంచు మది నుబ్బుచు బల్కిన నంత జెల్లునే
యుత్తము యోగతత్త్వముల నొప్పెడివారలె సత్యసంధులై
యుత్తమబ్రాహ్మణుల్ధర నహో యని జాటవె వేదశాస్త్రముల్
యుత్తములౌ దురాజసన మొందిన విప్రుల చేతన ... ౧౪౯

దుర్మనుడంచు క్రూరుడని ద్రోసితొ మూలను లేక పూర్వపున్
కర్మము నాల్గుమాసముల కాలము బుచ్చిన బోదు శీతమీ
మర్మమెఱుంగకుంటి దగ మానసమందున నేమిపీడయో
నిర్మలమొప్ప జేయవె యనేకనమస్కృతులంటినో ... ౧౫౦

రూపము మార్చివేసె చలిరోగము దానిప్రభావమెట్టిదో
తాపము పైత్యవాతములు దాహము వాంతులు దారుణంబునన్
యాపదబాంధవుండని బుధాదులు నిన్ను భజింపుచుంద్రు నా
యాఫదబాపవేమిర దయారససాగర రక్షక ... ౧౫౧

ఈ శతకంబు వ్రాయగను యిట్టుల మూలను ద్రోసితోరి నా
యాశయమద్దియే బుజభయంబునకంటెను స్వప్నమందు నీ
యాశను దెల్పియున్నయెడ హర్షముతోడ రచించబూననే
యీశ దయానిధేనుత మహీతలభక్తజనావన ... ౧౫౨

నిరుపమ శాస్త్ర వేద వసు నీరజవైరి శకాబ్దముల్చనన్
బరగెడు శోణితాక్షి మధు మాసమునన్ దిది పూర్తిజేసితిన్
స్థిరమతి గ్రంధివంశమణి శ్రేష్ఠుడు బస్వాయముద్దుసూనుడన్
సరసుడ సుబ్బరాయకవి సంతుషితాత్ముడ పావన ... ౧౫౩

౧౮౪౬ శా. శ.



గాంధియుగంబునన్ జనినకాలము మూడవవత్సరంబు ని
ర్బంధనమౌ చలిజ్వరము బాధలనొందినవేళ వ్రాసితిన్
గ్రంధము తప్పులున్నయెడ గౌరవమొప్పగ దిద్దవేడెదన్
బంధురకీర్తిశాలురగు పండితులన్ కవులన్సదా ... ౧౫౪

శుభమగు భారతీయులకు శోభితమానవలోకమంతకున్
శుభమగు దేశభక్తులకు శూరవదాన్యుల కెల్లవేళలన్
శుభము మహాత్మగాంధికటు సూనృతవర్తనులైనవారికిన్
శుభము మహమ్మదీయులకు సూవె మతంబులకెల్ల నో ప్రభూ॥

మంగళం భవేత్ - శ్రీ



శ్రీ గురునాథేశ్వరాయ నమః.

శ్రీ

# గురునాథేశ్వర శతకము.

---

శ్రీపరమేశాంచితగుణ । దీపితకారుణ్యహృదయ దీనవిచారా
తాపసవందితచరణా । కూపారనిషంగసంగ గురునాథేశా॥

కరుణాస్వాంత గిరీశ చంద్రమకుటా, కల్యాణసంధాయకాం
బరకేశా వృషభేంద్రవాహ గమనా, బ్రహ్మేంద్ర సంపూజితా
వరదా శైలశరాసనా యభవ దేవస్తుత్య ముక్తీశ్వరా
గురునాథేశ్వర గర్తపట్టణవిభూ గోరాద్తురంగాభవా॥ ౧

పరమేశావ్యయ దీనపోష కరుణా పారీణ భక్తప్రియా
హర చిద్రూప మునీంద్ర సాధునుతబోధానంద నిర్వ్యాజ నీ
చరణంబుల్భజియించుచుంటిని సదాచారంబునన్గూర్చరా।గు

సురసంపూజిత శేషభూషణ హరా శూలీ జగత్పోష భా
సురతారాద్రినికేతనా పశుపతీ సోమేశ పూతాత్మ భూ
సురులౌగాదె నినుందలంచుమనుజుల్శుద్ధాంతరంగంబులన్।గు

పెరుగున్మీగడి వెన్నముద్దల సదా ప్రేమారగా బెట్టుచున్
సరసన్గూర్చొనజేసి యన్నమును హస్తంబందునన్గూర్చె నా
సరమాంబామణి తత్పతిన్దలతునే సద్భక్తిసేమంబుగా। గు

# గురునాథేశ్వర శతకము.

శ్రీహయగ్రీవాయనమః.

## ఉపోద్ఘాతము.



ఆర్యమహాశయులారా! ౩౮ అ

క్రోధనసంవత్సర జ్యేష్ఠ బ ౬ శుక్రవారమున వైశ్యకులాలంకారులగు శ్రీ ఉప్పుటూరు వేంకట కృష్ణయ్యగారు తన పినతండ్రిగారగు గురునాథము గారిచే 10-11-22 శంకుస్థాపన కావింపఁబడిన గుంటూరు బ్రాడి (తిలక్) పేటలో దేవాలయమును బూర్తిగావించి యందు శ్రీమదంబికాసహిత గురునాథేశ్వరుని బ్రతిష్ఠించినసంగతి యెల్లరకుఁ దెలసిన విషయమేగదా! ఆ సందర్భమునఁ (14-6-25) దాత్కాలికపు నా యగ్రాసనాధిపత్యముక్రింద సమావేశమైన యొక సభయందు "గురునాథేశ్వరశతక"మను నీ చిన్ని పొత్తమే తద్గ్రంథకర్తలగు శ్రీ గ్రంధి వేంకట సుబ్బరాయగుప్తగారిచే స్థాలీపులాకన్యాయమున నందందుఁ గొన్ని పద్యములు చదువఁబడి శ్రీ శ్రీ శ్రీ గురునాథేశ్వరున కర్పింపఁబడినది.

ఈ కవి వైశ్యకులీనుండును బసవార్యాత్మజుండును సరమాంబా పుత్రికాసుతుండును వైద్యవిద్యయందుఁ బరిచయముకలవాఁడునను నీ విషయంబు లీ శతకములోని ౬౭ వ పద్యముచేఁ దెలియుచున్నది. ఈశతకంబునందు ౧౧౦ పద్యంబులు కలవు. అన్ని పద్యంబులకును "గురునాథేశ్వర గర్తపట్టణ విభూగోరాట్తురంగాభవా" అను మకుటముంచుటచే నన్నియు రేఫప్రాసంబులును మత్తేభవృత్తంబులే కావలసివచ్చెను. దానఁ గొంతవఱకుఁ గవికి శ్రమము కలుగక తప్పదు. ఈకవి నూతనవిషయంబులందు మిగుల నాదరము కలవాఁడు. ఈ గ్రంథమునందుఁ బూర్వకవిస్తోత్రమునకు బదులుగా దేశసేవాపరాయణులగు దేశభక్తులను స్తోత్రమొనర్చియున్నాఁడు. వేయేల యీఁడు

వంతు లీ గ్రంథమునఁ బ్రస్తుతోద్యమమును గూర్చియే వ్రాసెననుటలో నతిశయోక్తిలేదు. ప్రాయశః తత్తత్కాలాభిప్రాయంబుల వెలిపుచ్చుటయే శతకముల యుద్దేశముకదా !

ఈకవి కవిత్వము ధారాళమై సరసమై సరసజనహృదయంగమమై యలరారు భాషాభిమానియైనను బాల్యమునందు విద్యాభ్యాసమొరర్చుటకుఁ దగినంత యవకాశములేకుండుటచేఁ గాఁబోలు నీకవికి సంస్కృతాంధ్రములయందుఁ గొంత వ్యాకరణాదిలోపము లందందుఁ గాన్పించెడిని. ఏది యెట్లున్నను మొత్తముమీఁద నీకవి కవిత్వము రసాన్వ్యానము గానఁ జదువరులకుఁ బాండురంగమహాత్మ్యములోని-

గీ॥ తప్పులుగలిగినచోటనే యొప్పుకలుగు
సరసకవితావచోక్తుల సరణియందుఁ
గప్పుకలిగిన నీహార కరునియందు
నమృతధారాప్రవాహంబు లడరుఁగాదె॥

అను పద్యమును జ్ఞప్తికిఁ దేకమానదని నాయభిప్రాయము.

ఇట్లు,

పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు,
సంస్కృతప్రధానోపాధ్యాయుఁడు,
టౌన్ హైస్కూలు, గుంటూరు.





శ్రీమద్గుంటూరు తిలక్ (బ్రాడీ) పేటలో గావించిన గురునాథేశ్వర ప్రతిష్ఠానంతరము ( **14–6–25** ) తేదీన జరుపబడిన పండిత సన్మానసభలో జదివిన పద్యములు.

శ్లో॥ కృత్వా వైభసంయుక్తం దత్వాజ్ఞాతాంచ సంపదం ।
సహాయాత్సర్వదాదేరః పున్నరాయాం రమాపతిః ।
శ్రీవాల్మీకి మహర్షికీర్తితయశః కాంతాసమాలింగితః ।
పాషాణాకృతిగౌతమ ప్రియసతీ మోక్షప్రదాతాపరః ।
భూపుత్రీసుమనః పయోరుహ రవి ర్భక్తావనీ దీక్షితః ।
శ్రీమాన్ రఘు కుంజగోనతుసదా శ్రీపున్నరాయాహ్వయం ॥

ఉ॥ శ్రీరమణీమణిప్రియుడు చిన్మయరూపుడు చిద్విలాసుడున్
నీరదనీలవర్ణ సహ నిత్యవిభాసిత దేహవర్ణుడున్
కారణ కర్మబంధముల ఖండనచేయగ జాలువేల్పు భూ
భారనివారణాస్పదుడు భక్తులపాలిటి కామధేనువీ
ధీరుని యుప్పుటూరికుల దీపకు పున్నయనాము నిన్మహో
దారుని స్వీయమిత్రజన తామరసాకరమిత్రుభవ్య గుం
టూరుపురస్థ వైశ్యకులనూత్న శశాంకుని సత్యసంధునిన్
కోరికలిచ్చిసంపదల గూర్చియశంబుముదంబొనర్పగన్ ॥

ఉ॥ దానవభంజనుండు కవితాఘ విదూరుడు శంఖచక్రసం
ధానుడు రుక్మిణీవిభుడు తాపసమానస వాసి లోకసం
త్రాణుడు కృష్ణమూర్తి వివిధంబుగ సంపదలిచ్చి పున్నరా
యా! నిను బ్రోవుమగావుత దయానయదృష్టిని నెల్లకాలమున్ ॥

శా॥ వాసి న్గర్తపురంబున న్విమలమౌ వైశ్యాళి నెంతేనియున్
వాసిన్గాంచుచు మంచికార్యముల నిర్వర్తించి నీకీర్తులన్
భాసిల్లంగ దిగంతమందు మనుమా భాగ్యంబు రెట్టింపగా
నాసన్మిత్రమ యుప్పుటూరికులచందా పున్నరాయాహ్వయా ॥

సీ॥ పినతండ్రిగారిదౌ పెద్దమొత్తమునెల్ల మంచికార్యముల కర్పించితయ్య
దివ్యంబులైనట్టి దేవాలయంబుల గట్టించిఖ్యాతిని గాంచుమయ్య
కులమువారలకెల్ల గొప్పవిద్యల నేర్ప యాశ్రమంబిడి పేరు నందవయ్య
కవిపుంగవులచేత కావ్యముల్ వ్రాయించి దశదిశలన్కీర్తి దాల్చుమయ్య

గీ॥ ఉప్పుటూరన్వవాయ పయోధిచంద్ర   38 ఈ
మానితచరిత్రయుత మామకీనమిత్ర
సనకఋషిగోత్ర పుణ్య సత్కారపాత్ర
పూర్ణసద్గుణగణగేయ పున్నరాయ॥   ఇట్లు,

భవత్శ్రేయోభిలాషి, జమిలినమ్మాళ్వారు, గుంటూరు.

శ్లో॥ పూజ్యః ప్రాజ్యవిభూతిమాన్ త్రిభువనా భ్రాజైక్యక రాజ్యేశ్వరః
ప్రోద్యచ్చండతరః ప్రభావమహితః కారుణ్య వారాంనిధిః
వాచోగమ్య కదావిదిర్విహిగురు నాథేశస్స్వయం భూర్విరాట్
భూయఃపాత్వఘనీలనీరద బృహర్ఝుంఝానిలోవస్సదా
నానాహీన విభూషణాంచిత తనుః ప్రోద్యత్కళావిగ్రహః
సంప్రాప్యాథ శిరస్థధారపదవిన్ దేవప్రకాండాత్పరా
భ్యర్థైశ్చైన్యైః ప్రమాబాధితైః పరివృతస్త్రైలోక్య రాజంమహా
దోర్వైరక్షతి వస్సపాతు గిరిజాధీశో మహేశోభృశం॥
ధన్యాస్తే వై విమలయశసః కీర్తికాయా విపన్నా
యేహిశ్లాఘ్యాన్యనుప మధియః పుణ్యకార్యాణికుర్యుః
ఇత్యుక్తాంతాంగిరమనుసరం పున్నయశ్రేష్ఠివర్యః
శ్రీమాన్ భక్త్యాచరతి గురునాథేశ్వరప్రతిష్ఠా॥
మ॥ సతతశ్రీ జగధీశ దివ్యపదకం జాతద్వయాపూజన
ప్రీతుడౌస్వీయ పితృవ్యుడే గతినొనర్పన్ జిత్తమందెంచెప
న్గతినీ పున్నయధీరుడిప్డు గురునాథస్వామి దేవాలయం
బతిమాన్యస్థితిగట్టజేసె బుధులాహాయంచు గీర్తింపగన్॥
ఉ॥ అస్తుత శంకరోస్తు కరుణాస్తుమహా ధనధాన్యభాగ్యరే
ఖాస్తు దిగంత విశ్రుతయశోస్తు తధర్మకార్య దీ
క్షాస్తుగురూపచార ధిషణాస్తు కుటుంబసమృద్ధిరస్తు వి
ద్యాస్తు చిరాయురస్తు శుభమస్తు సదాయువిపున్నరాయతే॥
శ్రీవాణీ గిరిజానాథా గ్రహాస్సూర్యోదయ స్తథా
దిశనుశుభసంపత్తి ముప్పుటూరు పున్నారాయతే॥

ఇట్లు.

శ్రీమాన్ కాశీ వ్యాసాచార్యులు, గుంటూరు

ఓం.

# ఆలయములోని లోపలిద్వారమునకు దక్షిణపు ప్రక్కనున్న తెలుగు శాసనము.

శ్రీమదంబికా సహిత గురునాథేశ్వరాయనమః

స్వస్తిశ్రీ శా శ ౧౮౪౭ క్రోధననామ సం॥ జ్యేష్ఠ బహుళ షష్ఠి శుక్రవారమున నీతిలక్ష్పేటఅనే బ్రాడీపేటయందు నీగుంటూరు వాస్తవ్యులును వైశ్యవంశీయులు ఆంగిరస శాకల్యద్వాత్రేయ ప్రవరాన్విత సనకసగోత్రులు యజుశ్శాఖాధ్యాయులు అపస్తంబ సూత్రులును అచ్చమాంబాప్పయార్య పుత్రులు రోశమాంబా దయితులు దానకర్ణులును సర్వాభీష్టప్రదాయకులునైన ఉప్పుటూరి గురునాథముగారు శాశ్వతముగా నన్నసత్రము చలివేంద్ర కన్యకాపరమేశ్వరీ నిత్యనైవేద్యము భిక్షుకులకు సదావృత్తి బెజవాడ కొండపై మఠము నేర్పరచి సప్త సంతానములు సంకల్పించి తాటికొండ, అమరావతి, రోడ్లమధ్య తటాకప్రతిష్ఠ గావించి ధననిక్షేప బ్రహ్మస్థాప్యధర్మోపనయనాద్యనేక ధర్మంబు లాచరించి యీ యాలయము గట్టించుచు బరలోకగతులు కాగా వారి ధనముతో నంబికా సహిత గురునాథేశ్వరాలయము పూర్తి గావించి సాంగముగా నమ్మహాత్ముని పేర నాచంద్రార్కము తత్పుణ్యమునకై వారి యన్న నరసింహముగారి పుత్రుడు వెంకటపున్నయ్య శివుని ప్రతిష్ఠించి వ్రాయించిన ధర్మశాసనము.

శ్రీగురునాథేశ్వరార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ

శ్లో॥ పళ్లైవంశోద్భవో మాధ్వః । పూర్ణప్రజ్ఞో నిధిర్గిరాం
పాణినీయవిదేతాని । శాసనాన్యలిఖద్బుధః   33 ఈ

# ఆలయములోనున్న లోపలిద్వారము నకు ఉత్తరపువైపునున్న తెలుగు లిపి

## సంస్కృత శాసనము.

ఓమ్ శ్రీఅంబికా సహిత గురునాథేశ్వరాయనమః.

శ్లో॥ శ్రీమచ్ఛనకస గోత్రే వైశ్యమణౌ పుప్పటూరి వంశీయే।
అచ్చాంబాపార్వ్యసుతే గురునాథే రోశమాంబికా దయితే॥
శ్రీ కన్యకాంబికాయా నిత్య నివేద్యాదికం వినిర్మాయ
సంస్థాప్యచాన్న సత్రం పథికజనానాం ప్రియామేకాం॥
శ్రీ విజయవాటికాయ మచలే పరికల్ప్య కనకదుర్గాయాః
మఠమత్రైవస్యపురే సాధూనాంచసదా సదావృత్తిం॥
తటాక ధననిక్షేప బ్రహ్మస్థాప్యాదికం స్వయం కృత్వా
సంకల్ప్య సప్తసంతతిముదార బుద్ధ్యాది వంగతే తస్మిన్॥
అబ్ధిష్వబ్ధివసుశశాంకైర్గణితేఽస్మిన్ క్రోధనేచశాల్యబ్దే
గుంటూరు తిలకుపేటే జ్యేష్ఠే జ్యేష్ఠస్యాం కవౌబహుళపక్షే॥
భ్రాతుస్తస్యసుతో నృసింహవణిజశ్శ్రీపున్నరాయాహ్వయ
స్తేనారబ్ధ శివాలయం విరచయన్ పూర్ణంచతద్విత్తతః
తన్నామాఙ్కితమంబ యాసహశివం సాంగంప్రతిష్ఠాప్యచ
ప్రీత్యైతస్యకృతీ సశాసన మిదం తచ్ఛ్రేయసేఽలేఖయత్॥
స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥
తటాకం ధననిక్షేపం బ్రహ్మస్థాప్యం సురాలయః
ఆరామ కృతికూపంచ సంతానం సప్తకీర్త్యతే॥

కల్యాది ౫౦౨౬ సృష్ట్యాది ౧౯౫౫౮౮౫౦౨౬ విక్రమార్క శక ౧౯౮౨ గాంధి శక ౪ ఫసలీ ౧౩౩౪ హూణశకం, 12-6-1925.

శ్రీ శ్రీ శ్రీ





గుర్నాథేశ్వరాలయములోని తెలుగుశాసనము ప్రక్కనున్న

నాగరలిపి శాసనము.

**श्रीमान गुर्नाधनामा वणि गमलमना स्सप्तसंतानकर्ता**
**प्रारभ्यात्रेश्वरस्यालय मिममसमाप्त्यैव नाकं गतो ऽ भूत्**
**भ्रातृव्यस्तस्य धीमान् तदनु परिसमाप्त्यालयं पुन्नरायः**
**तन्नाम्ना सांगमीशं सहगिरिसुतया ऽ स्थापत् क्रोधने ऽ ब्दे.**

నాగరలిపికి తెలుగులిపి.

శ్రీమాన్ గుర్నాథనామా వణిగమలమనా సప్తసంతానకర్తా
ప్రారభ్యాత్రేశ్వరస్యాలయమిమమసమాప్త్యైవ నాకం గతోభూత్
భ్రాతృవ్యస్తస్య ధీమాన్ తదను పరిసమాప్త్యాలయం పున్నరాయః
తన్నామ్నా సాంగమీశం సహగిరిసుతయా స్థాపత్ క్రోధనేబ్దే.

శ్రీగురునాథేశ్వరాయ నమః.

శ్రీ

# గురునాథేశ్వర శతకము.



శ్రీపరమేశాంచితగుణ । దీపితకారుణ్యహృదయ దీనవిచారా
తాపసవందితచరణా । కూపారనిషంగసంగ గురునాథేశా॥

కరుణాస్వాంత గిరీశ చంద్రమకుటా, కల్యాణసంధాయకాం
బరకేశా వృషభేంద్రవాహగమనా, బ్రహ్మేంద్ర సంపూజితా
వరదా శైలశరాసనా యుభవ దేవస్తుత్య ముక్తీశ్వరా
గురునాథేశ్వర గర్తపట్టణవిభూ గోరాడ్తురంగాభవా॥

పరమేశావ్యయ దీనపోష కరుణాపారీణ భక్తప్రియా
హార చిద్రూప మునీంద్ర సాధునుతబోధానంద నిర్వ్యాజ నీ
చరణంబుల్భజియించుచుంటిని సదాచారంబునన్గూర్చరా।గు

సురసంపూజిత శేషభూషణ హరా శూలీ జగత్పోష భా
సురతారాద్రినికేతనా పశుపతీ సోమేశ పూతాత్మ భూ
సురులౌగాదె నినుందలంచుమనుజుల్ శుద్ధాంతరంగంబులన్ ।గు

పెరుగున్నేగడి వెన్నముద్దల సదా ప్రేమారగా బెట్టుచున్
సరసన్గూర్చొనజేసి యన్నమును హస్తంబందునన్గూర్చె నా
సరమాంబామణి తత్పతిన్దలతునే సద్భక్తిసేమంబునై ।గు

మ॥ సురలెవ్వాని పదాబ్జముల్ నిలిపి హృత్స్థానంబులన్భక్తితో
నిరతంబున్భజియించుచుందురు హరా నిన్నేకదా చూడగన్
నరులట్లన్నుతిజేయనోపుదురె సానందాత్ములై శ్రద్ధతో ॥గు॥

గిరికోదండమ ! నారిసర్పము ! హృషీకేశుండు బాణంబ ! వ
హ్వారె విశ్వంభరమా రథంబు ! శ్రుతులా వాజుల్దినేశాబ్జులా
యరదాంగంబులు తోలువాడునలువా హా వైరులన్ద్రుంచగా
పరమానందముతో తపంబుసలుపన్ భక్తాళివీక్షించి స
త్వర కామ్యార్థములెల్ల నిత్తువుగదా కారుణ్యమేపారగా
కరిచర్మాంబర నందివాహ! గిరిజాకాంతామనోనాయకా॥గు॥

గురుపంచాక్షరితో తపంబుసలుపన్ ఘోరాఘముల్బాపుచున్
స్థిరకైలాసమొసంగి బ్రోతువుగదా దేవేశ మోదంబుతో
సరిగానాప్రణవంబు జేర్చినుడువన్ సాధ్యంబువర్ణింపగా ॥గు॥

కరుణాపూర్ణశశాంక శేఖర హరా కైలాస సన్మందిరా
వరదా దానవపూజితాంఘ్రికమలా వాగీశసంసేవితా
పరమేశావ్యయ ఫాలలోచనభవా పాపౌఘసంహారణా ॥గు॥

సురతిన్దేలుచు సుందరీమణులతో శోధించక న్ధర్మముల్
నిరతంబట్లు పకోడి లిడ్డెనల పానీయంబుకై సోడ స
త్వరణాకాఫీగొనుచుండి మందిరమునన్ భక్షింపగా జెల్లనో॥గు॥



అరయన్గాంధికులీనుడైన బసవయ్యార్యాత్మజుండన్ధరన్
సరమాంబావరపుత్రికాసుతుడభై షజ్యాండ దేవావణి
గ్వరుడన్వేంకటసుబ్బరాయుడను లింగాభవ్యనిస్సంగయో। గు

ఉరుదభ్యాసమొనర్చినట్టి బుధులన్ యుప్పొంగిమోదంబునన్
గురితో సబ్దులజీజుసాహెబును సంకోచంబులేకెంతయున్
సరిగానట్లు కరీముసాహెబు మహా సద్భక్తిబూజించెదన్। గు

తిరమౌభక్తిని రామనామ జపమున్ దివ్యంబుగా జేయుచున్
శరమానందముతోడ రామనవమీ కల్యాణముల్జేసెనా
సరసున్వంగల వీరభద్రుమనెదలో సన్మానమున్ జేతునో। గు ...

పరులన్లెంచక హైందవాళినెపుడున్ భావంబులన్మిత్రసో
దరవర్గంబుగ జూచుభారతము సంతాపంబును న్దీర్చగా
మురిపెంబున్గను యాలిసోదరులనే ముఖ్యంబుగా నెంచెదన్।గు

భరతాఖ్యావని నాడువర్ణమున సద్భావంబులన్జూప నే
ర్పరులై మిక్కిలి రాజకీయమున సారంబంతయున్దెల్పె నే
డరయన్గాంధిమహాత్ము లాజపతిరాయాఖ్యున్మదిన్దల్తునో। గు

తరమానెన్నగ గొల్లపూడి కులసీతారామశాస్త్రీంద్రు చూ
డరు భావజ్ఞుని మానసంబులను కొండా వెంకటప్పార్యునే
తరివర్తింపరు దేశభక్తుల పదార్థంబుల్సదా నెంచుచున్। గు

ఉరుపంచాక్షరి మంత్రరాజ మగునా యోంకారవర్ణంబు లా
దరభావంబున నోటఁబల్కఁగను దిద్దన్ జేసె విద్వాంసు డా
పరతాడేపలి జోగిరాజు నెదలో భావింతు నశ్రాంతమో। గు

గిరిజానాథ సనాతనా పరశివా గీర్వాణ సత్పోషణా
కరిదైత్యాంతక పాలితాఖిల జగత్కర్తా కృపాసింధు నీ
చరణంబుల్మదినమ్మినాను గనుమా సామీప్యముఞ్జేర్చరా। గు

పరమేశా శివశంకరా యనుచు స త్పానీయముల్పోయుచున్
శిరమందు న్దగ బిల్వపత్రముల వాశింబూజగావించినన్
శిరులన్గూర్తువుగాదె ప్రేమమున స త్శ్రేయంబులన్ బొందగా।గు

హరియున్ రాఘవుడంజనీసుతుడు కృష్ణాదుల్సదా పూజ్యులై
బరగు న్వారి భజించకన్మిగుల దేవర్లంచు వీర్లంచు గో
తురుమేషంబుల వేడుకల్సలుపుచున్ దోషంబుభావించకన్ గు॥

కరణాల్వేటలు ముందుగోయవలె నీ కారుణ్యమెట్లాంటిదో
యరరే గాంచుడు జీవహింసనములా యజ్ఞంబులన్జేతురే
దురితంబంచును బట్టు పిష్టపశువున్ హోమంబున న్వైష్ణవుల్।గు

పురుహూతాదిసుపర్వబృందములు సం పూర్ణాత్మలన్భక్తి నీ
చరణంబుల్వినుతించుచుందురెపుడున్ శార్వాణి నాథా హరా
పరమోదార కృపాకరా విబుధ స త్పాలా జగన్నాథయో।గు



పరిశుభ్రంబొనరించి సింధుజలము న్వర్షించు ధాత్రిన్బయో
ధరము ల్సస్యములెల్ల బెంపుగన స త్కారంబును న్బొందకా
సరణిన్గాంచరు మానవాళిదనుపన్ సద్ధర్మముల్సేయరో। గు

నిరుపేదల్పడుచున్న కష్టములదేనిన్ జూడకే బెద్దలై
కరువే లేదని జంకకన్దైలపె స ర్కార్మెచ్చగా జూడ ను
ర్వరసౌఖ్యంబులె సుస్థిరంబనుచు వహ్వా పాపమెట్లోగదా। గు

తరుగొందున్గనకుండి విత్తముల స ద్ధాన్యంబులందందు పా
తరులున్గల్గియు లుబ్ధులౌ జనులదే దారిద్ర్యమోగాని మె
క్కరుదేని న్దినువారిగాంచిమది దుఃఖంబందునో శంకరా। గు

నిరతంబాకలిచే కృశించు జనుల, న్వీక్షించి నేత్రంబులన్
నెరదాతల్కరుణించి చిత్తముల పున్నెంబంచు భావించుచున్
సరసాన్నంబులబెట్టి దన్పుచు వెస, క్షామంబునున్దీర్చరే గు॥

పరులే కష్టము బొందుచున్న యనుకంపన్ జూడ కేరుండునో
నరులేగారని సాహసింతు బలుక నాత్కాగరంబెంచు వా
నరులే మేలని బుద్ధినెన్నవగు వ స్యంబులే వాసముల్। గు ౨౨

శిరముల్వేయినిగల్గి భూభరము నా శేషాహిదాల్పెన్గదా
యురగేశుండురుభూషణంబరయనో యుగ్రా కపర్దీహరా
బరువెట్లోర్చితి వప్ప దబ్బరెటులౌ భర్మాద్రివిల్కానికిన్। గు

సరిగాసల్పరు బ్రహ్మచర్యమెవరుఁ జందెంబులన్వైచి ని
ద్దరమేల్కాంచరు దేహ సత్పటిమనే దూరంబుగాజేసె గాం
తురు సంతానము బాల్యమందునె గనఁ దుస్సాధ్యమా
[ జేయఁగ। గు ౨౮

దురముజ్జేతురు రాజ్యకాంక్షగనియే దోషంబుబాటింపకే
శరజాలంబుల దృంతురందరిని యాచార్యాదులైనఁ సుసో
దరులే గొట్టుకజావరా కౌరవుల్ దక్షింపగా పాండవుల్। గు

సరసుల్మెచ్చరువిన్న నీదుచరిత ల్సర్వంబు శోధించ నా
సురతం బీడిగ నాతితో సలుపగఁ చోరత్వమున్గాంచగా
వరుడే తెంచిన భీతినొందుచు సురాభాండంబు నన్దాగవే। గు

మురిపెంబున్గన కన్నవారి పలుకు ల్ముఖ్యంబుగా నెంచి యే
బిరికిన్బోందక పాలకుండగొని నైవేద్యంబిడఁ ద్రాగి స
త్వరబాలన్గొడ గూచిబ్రోచితివి దేవా చంద్రమౌళీహరా। గు

సురసేనాని షడాననాఖ్యుడుభవ త్సూనుండు సత్పూజల
న్గరికన్మెచ్చు వినాయకుండు సుతుడౌ గందేభచర్మాంబరా
సరిలేరెవ్వరు నీకుసాటి పరమేశా సింధుతూణీరయో। గు

పురికైలాసము గల్గియుండగను యీబూచుల్సదా గొల్వకా
పురముజ్జేయగ వల్లకాడుదగునా బూదేయొడల్బాయనా
కరిచర్మంబు ధరించుటా? దెలసె నీకర్మంబునన్గాతువే। గు



తరినల్లూరుకులస్థుడైన నల సీతారామరాజున్భయం
కరుడంచు న్వచియింతు నిక్కముగ ధిక్కారింపగా నెప్పనే
ధరణీపాలన మెట్లుజేసినను యీ దారిన్గనుల్గాంచనో। గు ౩౦

పరిశుభ్రంబుగ వేదముల్చదువ బా పండౌనువల్లించకే
దిరిగేవారలు శూద్రులౌదురిది సం దేహంబుగా దెందులఁ
వరమోదాత్ములు బ్రాహ్మణుల్భువిని దే వా
[ మృత్యుసంహారకా। గు ౩౧

దొరతామండలనాథులెల్లగనిన న్దూరస్థులైవచ్చి యీ
భరతంబేలుటచేత మోసమునకుఁ భావింపగా మూడువే
ల్సరిగా జీతముజాలదంట కరువే చందంబు నన్దీరునో। గు

సరిగాబిల్వ దళార్పణంబులను బూజల్సల్పగా రావణా
సురుడన్గాను తపంబొనర్చుటకు నా శోణాధినాథుండనే
కరణిన్గాను నుతించనేర నిల దీక్షున్భాని పంచాక్షరిఁ। గు

బరువుల్మోడున బెట్టి భారమనకఁ పన్నుల్వ్యాస న్గట్టుచుఁ
సరిగా పాలన జేయుచుంటిమని నిస్సందేహవాక్యంబులఁ
పరదేశంబుల జాటసంఘముల సా మ్రాజ్యంబు నన్నిల్పునో।గు

పురముల్వ్రేడను వెండికొండపడ నే భూతుల్మదిన్గోర సు
స్థిరభక్తిన్దయచేయ మంటి నదియే దేవా మహాత్మేరువా
పరమానందముతోడ దీర్చుమటు నీపాదంబులన్వీడనో। గు

సరివారెవ్వరులేరునీకు పరమేశా జూడ దైవంబులన్
దురితంబుల్కడకంపి భక్తులను సంతోషంబునన్గాచి స
త్వరకైలాసము గూర్తువెంతయును భావాతీతగౌరీధవా। గు

పరివారంబులునీకు భూతగణముల్ పాములొవ్వడల్ సొమ్ములౌ
ధరియింపన్గటి వ్యాఘ్రచర్మమగు నీదారిద్ర్యమేదారి కా
పురమాచిత్రము వల్లకాడగు సదా భూతుల్దగన్గూర్తువే। గు

పరులన్వేడను నిశ్చయంబిది మహాపాపుండ దుర్మార్గుడన్
నిరుపేదన్గడు నీచమానసుడ సాన్నిధ్యంబునన్ జేరు టె
ట్లు రతీశారి విశాల మార్గమెద నాలోచింపగా నేరనో। గు

గిరిజానాథ పురాణపూరుషభవా గీర్వాణసంస్తోత్రమే
దుర కారుణ్యమయా మునీంద్రవిహితా దోషాబ్ధిసంశోష స
త్వరపాపంబుల బాపిబ్రోవుమిక భావాతీత చిద్రూపయో। గు

మొరలేతీరున నాలకించకను యేమోజెప్పచున్ బైకి దు
ర్భరమా పన్నులవైచి గుంజుచును సారంబెల్ల నెల్లప్పుడున్
భరతింబున్దగ నేలుచుండి రహహా ప్రాలుబ్ధమేమోగదా। గు

పరమాన్నంబులకాశ జెందరెవరే భక్ష్యంబులన్గోరరా
తురతన్ జెందుచు బొట్టకూటికి సదా దుఃఖంబునున్బొందెడిన్
నెరదాతల్గని గంజియో కలియొ పానీయంబులో బోయనా।గు



తెరవేగన్పడదేమిచిత్రమొ భవా దీనాళిరక్షింపగన్
కరవేతీరదు ప్రాణరక్షణకు నే గ్రామాదులన్ జూడ సో
దరకాయంబుల దుఃఖమొచ్చునుగదా దారిద్ర్యమున్దీర్చవే। గు

గురుయంత్రంబులనిల్పి మేటిధనికుల్గోడున్విచారింపకన్
తిరిపెంబెత్తగజేసె భారతము సందేహించకే నాత్మలన్
శిరులెల్లప్పుడు గల్గబోవు యొకటన్ జీవంబులేబోవునో। గు

తురగంబుల్ధనరత్నభూషణతతుల్ తోషంబు సంధించవే
తరిదుఃఖంబును గల్గజేయునిక నేధర్మంబులన్ జేయ భా
సురమౌ బుద్ధినొసంగ వీశ్వరునిసం స్తోత్రంబుదూరంబగున్।గు

పరమేశా భజియించనేరక నినున్ పాపంబులన్జేసి మం
దిరముల్దీయుచు బీదవారినెదలో దీనత్వమున్గాంచి యే
కరుణన్దాల్చక మెక్కుచుందురు సదా కాయంబులన్బెంచగా।గు

పురముల్గల్గిన కోట్లకొద్ది ధనముల్పూర్ణంబుగా నుండినన్
పరమానందము జెందుచున్దినక సంపాదించగా నేర్చి ద
బ్బరలన్బల్కుచు రెల్లబీదలను కొంపల్గాల్చ భావింతురో। గు

నరులంచున్గురుభావమున్గనక న న్యాయంబు నేబూని ఢ
య్యారు పాంచాలుర పేల్చిజంపె నహహా యాంగ్లేయు
[ లుబ్బంగ హం
టరు సంఘంబది కాదు ధర్మమని వెంటన్ సూచనల్దెల్పినన్। గు

అరదం బుర్వినొనర్చి సారథిగ నాయబ్జోద్భవున్నిల్పి భూ
ధర చాపంబునుబూని దివ్యశరమున్ దైత్యారి సంధించి యా
పురముల్మూటిని గూల్చిలోకముల సంపోషించితౌ బ్రేమతో। గు

పరిచారంబొనరించ రుచ్యముగ వే పాకంబులన్ జేయ మం
దిరముల్ శుభ్రమొనర్చ పంచముల సందేహంబునున్ లేక నా
దొరలెల్లప్పుడు నుంత్రుదాకనగు సంతోషంబు నన్వారినో।గు

వరచేలంబులు గల్గనెల్లడల భా వాతీతగారీధవా
కరిచర్మంబును దాల్చనేల కటిసీ కార్యంబునన్ జూడగా
పరిహాసంబగుచుండు మౌనివరదా ఫాలాక్ష ప్రజ్ఞాన్వితా। గు

పరదేశంబుల భారతీయులను పాపంబంచు భావించ కే
దురవస్థల్గలిగించుచుండె నహహా దుర్మార్గమేముందు బో
యరు లన్యాయము మానుబుద్ధినిడు బాహాటంబుగానో శివా।గు

సరిగాజీవన మాచరించగలమే జాతీయ భావంబులన్
గురువుల్నేర్పకగౌర్నమెంటుబడులన్ గోల్పోవ స్వాతంత్ర్యముల్
తిరిపెన్ బెత్తగ దాస్యవృత్తులకు దీర్చున్గదా బాలులన్। గు

చెరసాలన్ తమవారి బెట్టిరని నిస్సందేహమేపార బా
లురు వృద్ధుల్సభజేయ నోర్చకను యాలోకించి సేనాని డ
య్యరు పాంచాలురగాల్చె పాపమనకాహా మెచ్చెనింగ్లండులో।గు



సరిగాగాంచక భారతీయులను సత్సంతోషముం గూర్చ కా
దరభావంబును లేక గొప్పపదవుల్ దామే సదాబూని జూ
తురుహీనంబుగ తెల్లవారు మదిలో దుర్మార్గమంచెంచకన్। గు

దురమందున్ గురుధైర్యమూని జయమెంతోగూర్పగా మెచ్చి స
త్వర స్వారాజ్యము నాశబెట్టి దగవాగ్దత్తంబులన్ జేసి దు
ష్కర చట్టంబుల వ్రాసిదీర్చి వరముల్ కార్యాంతమందో శివా।గు

అకరే జూడుడు పంచమాదుల ఘృతాదుల్సదా తుర్కలే
కరణిన్విక్రయ మాచరించుటలు సత్కార్యంబు లన్దానినే
ధరణీదేవు లెరింగి వాడెదరు తా త్పర్యంబునున్గాంచవే। గు

పురుషత్వంబును యుద్ధనైపుణిని సంపూర్ణంబుగా జూపిసు
స్థిరమైనట్టి జయంబుగూర్ప ఘనులై దేహంబు లర్పింగ స
త్వరస్వాతంత్ర్యముగూర్తునంచునదివహ్వాసున్నబెట్టెంగదా।గు

అరలేకాత్మను పంచముల్సలుపు పాకాదుల్దిగంమ్రింగుయా
దొరలన్నాకగ విప్రవర్ణమునకే దోషంబు లేదెంచ నా
దరమున్ జూపిన వంటవారినటు పెద్దల్దిట్టరే చోద్యమా। గు

గరువన్విద్యల విప్రబాలకులు సర్కార్వార గేహంబులన్
సరిగా పంచమబాలులన్గలసి నిస్సందేహులైవెడ్క దా
కరె? జందెంబుల దెంచివైచెదరె వీరన్ సోదరుల్గాంచుడీ। గు

వరవేదంబుల ధర్మశాస్త్రవితతిన్ బాపల్సదా జూచుచున్
సరిగా దెల్పుచు నడ్వి రేజనుల దాస్యంబంచు భావించకన్
మఱియాదౌనని నాకరుల్సలిపెడిన్ మన్నించగా జెల్లునే। గు

ధరణీదేవులటంచు బ్రాహ్మణులు గ్రంథంబుల్ధరన్ వ్రాసిరే
సరిగా సత్వగుణంబు బూనుచు సదా సత్యంబునేబల్కిరన్
సురలా? నయ్యవిలేని వార లసురుల్ శోధించగా ధారుణిన్।గు

పరిశుద్ధాత్ములు సర్వజాతులను సంభావింపగా నుండ రా
సరసుల్వేదము లన్యభిరింపదగదా సత్యంబుగాజూడ నా
సురలన్బోలినవారు బ్రాహ్మణులలో శోధించగా లేరొకో। గు

పరగన్బ్రాహ్మణ క్షత్రియుల్వైశులు నాపాదోద్భవుల్గాంచపాం
డుర సద్రక్తహరిద్రనీల రుచులుండున్ గ్రంథముల్దెల్ప వా
సరణిన్విప్రుల నుండిరే గనిన యేసద్వర్ణముల్గల్గునో। గు ౬౩

నరులకు మోక్షమివ్వగల యామ్నాయంబు లన్వేడ్క నె
వ్వరు బారంబును జేయరాదనుచు బాపల్జెప్పి మోసంబు నే
ర్పరులై జేసిరి జేయుచుండెనిక నీపాపంబునున్ జూడుమో।గు

తరియించున్గద భారతీయులను వేదంబుల్పఠించన్దగన్
గురువుల్మేమని సుంకముల్గొనుచు సాంగోపాంగ మానటు లే
దొరకన్ జేయరుమోక్షమార్గ వితతుల్ హేలాగతిన్యాబనియో।గు



తరువుల్పక్షుల కాలవాలము:యు సంతాపంబునున్దీర్చగా
నిరవుల్గూర్చుచు పండ్లనిచ్చుచును పుణ్యేచ్ఛన్ధరన్ జూపునా
కరణిన్యాబనరు సోదరాళిదనుపన్ కారుణ్యపుంభావులై।గు ౬౬

దొరవుల్బావనమొనర్చ మర్త్యులు సదా తోయంబులన్నింపి స
త్వర దాహంబుకు దీర్చు వేజనులు నా దారిన్గనుల్గాంచుచున్
పరమార్థంబునుగోరి ధర్మమును సంభావించగా మేలగున్। గు

చిరితొండార్యుని భక్తిజూడగను నీ చిత్తంబునందెంచి మం
దిరమున్ జేరుచు పుత్రశోకమును సందేహించకన్గోరగా
పరమానందముతో నొసంగ నతనిన్ భాసిల్లరక్షింపవే! గు

కరుణన్యాబనక కాలుడెంతయును మార్కండేయుని న్జేరగా
వెరపున్బొందుచు గావలించుకొన నా వెంటన్ యమున్బాపుచున్
పరిపూర్ణాయువొసంగినావుదయతో బాలున్దయన్ జూచియో।గు

అరదాంగంబులు చంద్రభాస్కరులు వహ్నిగుఱ్ఱముల్వేదముల్
సరసీజాసనుడెంచ సారథిగదా చాపంబు హేమాద్రియా
పురముల్గెల్వను తూణమబ్ధినుడా భోగీశుడేనారి యా। గు

దురయూహల్ జనియించె పెద్దలకు సాధుత్వంబుగోల్పోయెని
బ్బరమున్యాబనరు కాటకంబుగనరే బాధల్ధరం బొందిరన్
సరకార్మాటలు నమ్మిగ్రుమ్మరుదురో స్వామీదయాంభోనిధీ।గు

అరుదందర్ జగముల్సురాసురలు దుగ్ధాంబోధినిర్ జేరి మం
దరమున్గవ్వమొనర్చి చిల్కగను నద్దానంబుట్టె చోద్యంబుగా
గరళంబద్దిధరించి కంఠమున లోకంబుల్దగర్ గావవే। గు

సురలన్దోలుచు మౌనివర్యులను సంక్షోభంబును న్బెట్టి త్రి
ప్పురుచుర్ లోకము లెల్లభీతివడనే మర్త్యాశనుండా జలం
ధరునిన్నీచమడంచినావుగద నీ దర్పంబుచే భర్గయో। గు ౨౩

తరుణీరత్నము భార్గవిన్గొనియె నా దైత్యారి మోహించుచుర్
తురగంబుం సురలోకనాయకుడు సంతోషంబునన్గాంచె నా
గరళంబున్గళమందు దాల్చితివి నీ కారుణ్యమే పారగా। గు ౨౪

వరదా భూతగణాధిపా పశుపతీ వాణీశసంసేవ్య నా
దురితంబుల్ హరియించి నిత్యమును సంతోషంబునన్నీదు స
చ్చరితంబుల్జదువంగ భక్తినీయుచుర్ సద్వృత్తులన్గూర్చవే। గు

ధరపీఠంబుల నిల్పె శంకరుడు నద్వైతంబు వర్ధిల్ల నా
కరణిన్బ్యానక పంచమాదులను లాగం క్రీస్తుసంఘంబుకే
గురువుల్వద్దని బోధజేయరె చటర్ గోడేవిచారింపరో। గు ౨౬

దిరుగున్బ్రీతము లెల్ల గ్రామములకున్ధీశాలులౌ పండితుల్
పరివారంబులతోడ డాంబికముగర్ పాపంబుర్ జంకకర్
వెరపుర్ జూపి ధనంబులాగెదరు హా బీడింపుచున్బీదలర్। గు



సరిగా క్రీస్తుమతాభివృద్ధి నెటులా సంఘంబు సాధించె పా
దరు లెబ్బంగిని బోధజేసెదరొ నా దారిన్విలోకించుచుర్
యరరే బూనరదేమొకో యతులు కయ్యంబుల్దగన్దీక్షనా। గు

పురముల్పట్టణపంక్తి దేశములనే బోధల్సదా జేయగా
దిరిగెర్ శంకరు డెల్లప్రొద్దులను సందేహంబునర్ లేక న
బ్బురముర్ జెందగనట్లు జేయవలదా బోధల్మతోద్ధారులై। గు

జెరుపన్బ్యాని మతంబు నెల్లెడల దాక్షిణ్యంబు లేకేమి సో
దరులర్ జేయ మహమ్మదీయులను సాధ్యంబయ్యె నామీద జే
ర్చిరె సంఘంబున నేడు వైరులెవరో చిత్తంబులర్ జూడరో। గు

పరదేశంబుల కేగి విద్యకొరకై పానీయముల్ద్రాగుచుర్
వరిసాదంబును యాంగ్లవంటకములర్ భక్షింపగావచ్చు స
త్కారమౌనిచ్చట పంచమాదులను బాధల్బెట్టుటే మార్గమో। గు

చెరువుల్గుంటలు నీటిపైపులను దోసిళ్లర్ జలంబెత్తి స
త్వరపానంబును జేయవచ్చు నటులా బావుల్దరిర్ జేర నెం
తురు దోషంబుగ పంచమాదులవృథాదూరంబుగా జేతురో। గు

గోరియల్మొక్కల బట్టిగోయుచును మ్రొక్కుల్దీర్తు రాపట్టిదే
వరలన్బూజల జేయుచున్మిగుల వహ్వాపంబతే పెద్దలా
దురు జాతర్లను సాగజేయుటకు నే దూరస్థులర్ జేయరో। గు

మరియాదంచుదలంచి బ్రాహ్మణ విశుల్మారీ మహంకాళి దే
వరలన్నిల్పినవేళ వేటలను జీవంబుల్ వృథాదీతురే
కరుణన్బ్బానరు ముందుజన్మముల మేకల్గారె వారెంచగా। గు

హరియుఁ రాఘవుఁ డంజనీసుతుడు కృష్ణాదుల్సదాపూజ్యులై
బరగున్వారి భజించకన్మిగుల దే, వర్లంచు వీర్లంచు గో
తురుమేషంబులవేడుకల్సలుపుచుఁ దోషంబుభావించకన్। గు

పరదారన్ హరియించి రావణుడు దా ప్రాణంబులన్బాసె సో
దరు భార్యన్ రమియించివాలిమడసెన్ ధర్మాత్ముడౌ రాముచే
పరనారుల్గని మోహమంద నిలలో పాపంబు పాలౌదురో। గు

చరకాద్రిప్పుడు దేశమంతయును మీ చాతుర్యమొప్పారస
త్వర దారిద్ర్యము దీరునంచు నెపుడుఁ దత్త్వోపదేశంబు స
త్కారుణ్జేయుచునుండె పర్యటనము న్గాంధీమహాత్ముండిలం। గు

తరుణుల్దారముదీసి సన్నగను వస్త్రంబుల్మదం బొప్పగా
ధరియించ న్భరతంబు కాటకపు బాధల్దీరునంచున్సదా
గురుడౌ గాంధిమహాత్ముడేవడకుసంకోచింపగా వల్కనే। గు

సరసన్బిదలుగట్ట వస్త్రములకుఁ సాదంబుకై యేద్వనా
దరమే జేయరు దిన్నబొట్టలకు మోదంబౌనె కారుణ్యమే
దరికిన్ జొచ్చె సమత్వమెందణగె సంతాపంబునుఁ జెందరో। గు



వరహాల్గోరుటలేదు బీదలెలమిన్ వస్త్రంబులన్గట్టనో
గిరము న్మెక్కగ బొట్టనిండగను గోర్కెల్బెట్టిరేగాని నా
దరముఁ జూపరు వాటికై ధనవరుల్దారిద్ర్యమున్దీర్పరే। గు ౯౦

దిరుగున్బక్షిమృగంబు లెల్లడలనే దీనత్వము న్బొందకే
కరువేలేదవి వాహనంబులెపుడు న్గాంక్షించగా జూడ రె
వ్వరు మోటారులు సర్కిలుల్నరులకే వాజుల్కరుల్గావలెన్। గు

నరజన్మంబు మహోత్తమంబనుచు సన్యాసుల్బుధుల్బల్కన
బ్బురమౌనయ్యది జాతిహింసనము నెప్డుంబూని గావింతురే
తరి పాలించను రాజుగావలెగదా తప్పొప్పులన్దీర్చగా। గు ౯౨

తిరుణాళ్లన్బలె తీర్థయాత్రలకు ముందేరైళ్లకున్గార్తురే
వ్వారికిన్బెట్టరు సాధులోకముల సద్భక్తిన్విచారింపరే
సరణిన్ జూడగ నుట్టికెక్కకనిలన్ స్వర్గంబు నెట్లందునో। గు

సరిగాకోయిల పల్కులన్విననియా శార్దూలభల్లూకకే
సరినాగంబుల జూడ నాశుకములన్ సర్వేశునీసృష్టి సుం
దరమేమందును బర్హిపింఛముల చందంబెందు గాన్పించునో। గు

గిరిపఙ్క్తుల్గహనంబులన్గనిన లక్ష్మీవాసమైదోచు నా
తరువుల్గుల్మము లందమౌ సుమములన్ తావుల్గనన్సౌఖ్యమై
బరగున్వేణువితానరావములు శ్రావ్యంబౌచు కర్ణంబులన్। గు

మరుతాగ్నుల్ హిమనీరతేజముల నిర్మాణంబు లీక్షించ నీ
ధరణిన్వృక్ష శిలాదులందు గలుగన్ తార్కాణముల్జేయగా
తరుపాషాణములందు గప్పలకు వాతంబెట్లు ప్రాప్తించునో। గు

ధర ప్రాలేయనగంబు చెంతనె బృహద్ధ్యానుండు వెల్గొందు మే
దురమౌ యుష్ణజలంబు బారు నదులా దుర్గంబు నన్బట్టె నా
తరమే దేవ భవద్విలాసముల మోదంబొప్ప వర్ణింపగా। గు

బరువౌ రాళ్లను గాలియెట్లు మెలగున్ భావింపలేదందు రే
కరణిన్గప్పలు నీరుగల్గునట సాహౌద్భూమిలో జంతువుల్
సరిగావృద్ధిని జెందుచుంటగనమే స్వామీదయాంభోనిధీ। గు

జరిగెన్ సార్ధము జీవితంబు నెటులో సామాన్యమౌ బీద సో
దరులన్బోలి కుటీరవాసముల నిత్యంబెందులన్ లేదు హా
నిరతంబు న్భజియింపనేరరు శివా నిర్మోహనిర్లోపయో। గు

బరగు న్ప్రాణులకెల్ల నాల్గుదశల న్భావానిలో జూడ రెం
డరిగెన్మెల్లగ గాంచదక్కినవి కాయంబెల్లనొండించుచున్
మరణంబున్గను దారిజూచును గదా మాతాతలన్బోలుచున్। గు

పరిపూర్ణంబొనరించితీవు దయతో పల్మారుచిత్తంబులో
సరవిన్నీ శతకంబు వ్రాయుటకు వి శ్రాంతిన్ దగన్ గూర్చి స
త్సరిగా దెల్పుచు పద్యభావముల నిస్సంగా భవానీధవా। గు



ఉరుకాయంబులు గల్గ మోయితురు సదా యుర్విన్బలేగట్ట ఖ
ద్దరుభారంబని బల్కుచుందు రహహా దర్కించదవ్యాధ్యుల్లే
దురవస్థల్బడుచుండు రెల్లపుడు సంతోషంబునున్బొందరో। గు

భరతావస్థయు గాంచ రెంతయు సదా ప్రాలుబ్ధమేమందునా
భరణంబుల్గగ మోతురెంతయును సద్భామామణుల్ధాత్రి సుం
దరమౌ ఖద్దరుగట్టభారమట మోదంబెట్లు సంప్రాప్తమౌ। గు

పురుగుల్బుట్టుచు కాయలందచటనే పూర్ణత్వమున్బొందునే
సరణిన్గల్గును ప్రాణవాయు వహహా సాధించ సర్వంబునన్
దిరుగున్వాయువసూక్ష్మరంధ్రములసందేహంబులేదోహరా। గు

నరజన్మంబిల దుర్లభంబనుచు వి న్నాణంబుగా బల్కుటల్
సరిలేదెందుల కల్లు చుట్ట సిగిరెట్ సారాయిల న్ద్రాగుటల్
పరద్రవ్యంబుల దొంగిలించుటలు నే ప్రాణుల్గనన్ లేదుసూ। గు

పరులన్దిటక గొట్టకుండునటులన్ పాలించగా నెప్పుడున్
ధరణీనాథులుగావలెన్ సచివ బృందంబందు నాలోచనల్
సరిగాబల్కుట దుస్సహంబున్నృపులా చందంబువర్తింతురో। గు

పరివారంబుకు రత్నపుంజములకున్ బంగారువస్త్రాళికిన్
వరహర్మ్యంబులకట్లు భూషలకు ద్రవ్యంబెంతయోగావలెన్
సరిగారాజుల ? కట్లుజంతువులకీ సౌఖ్యంబులే లేవుగా। గు

బరువున్నారము ప్రమోయగావలెను సర్వంబుఁ బ్రజల్దిట్టలై
శిరమున్దాల్చుక న్యాయమున్విడచి యే శిస్తుల్గట్టినన్భూమిక్ౕ
నిరతం బుప్పుకు గష్టబెట్టిన నృపుల్ నిందిచతప్పందురో। గు

బెరుగఁ గోట్లకుకోట్లు దృష్టిబడకఁ బేరాశకుఁజిక్కి స
త్పురముల్ నాశమొనర్చజూచెదరిదే పుణ్యంబొ పూర్వార్థమో
పరితాపంబును బొందరెంతయును పాపంబంచుభావించరో।గు

పరిశుభ్రంబొనరించి పట్టణములఁ బాజారులంగొందులఁ
పెరడుల్మూత్రమలంబులూడ్వగను నాపేక్షందగఁ జూపి సో
దరులఁ నీచపువృత్తులందనుపగా ధర్మంబె సన్మార్గమే। గు

బరగుఁ షట్కారశూన్యభాణచయముల్ బాగొప్పకల్యాదివే
యరుగన్గాంధియుగంబునఁ దలరగానబ్దంబులామ్నాయముల్
సరిగా క్రోధన జ్యేష్ఠమాసమునకే సంపూర్ణమయ్యెన్ శివా
గురునాధేశ్వర గర్తపట్టణవిభూ గోరాద్భుతంగాభవా॥ ౧౧౧
కలిగతాబ్దః (౧౦౨౬) గాంధి శ. ర.

---

ఓమ్.

# వివిధ పద్యావళి.

శ్రీలలితాత్మ భక్తజనసేవిత సర్వచరాచరప్రభో
పాలితలోక మానిహిత పాపవినాశన సచ్చిదాత్మసా
శీల నిరామయాగుణవిశేష నిరంజన నిర్వికార నీ
మూలమెరింగిబల్కగను బుద్ధికి గోచరమానె రక్షకా॥ ౧

పర్యటనంబునన్నిగుల పాల్పడినట్టి వితండవాద గాం
భీర్యము వైశ్యులన్గలుగు బెద్దలభావములెల్ల మేటియా
దార్యుల సత్కారంబులను ద్రవ్యసహాయమొనర్చినట్టి స
ద్ధైర్యులదెల్పెదన్విశుల ధర్మవిధానములన్ని పొందుగఁ॥ ౨

నైజాం వైశ్యమహాసభ ప్రోత్సాహమునకు వెళ్ళినప్పుడు వరంగల్లులో
జరిగిన విశేషములు.

శ్రీ రమణీయ వైభవము జెంది ధనంబులు గాంచిమించదు
ర్వార యశంబుదాల్చగను బోలురు విద్యలదేలిమేటి స
త్కారున వన్నెకెక్కగను గాంచవె మార్గమువైశ్యజాతినో
కారుణికోత్తమా నిఖిల కార్యవిచక్షణ మోక్షదాయకా॥

ఈశవినాశకిల్బిష గణేశ సుపుత్ర గుణాబ్ధి గౌరిచి
త్తేశ ఫణీంద్రభూషణ గిరీశ దినేశ శశాంకనేత్ర భూ
తేశ మునీశసన్నుత సురేశమహేశపరేశ రామలిం
గేశ హరా వరంగలు పురీశ్వర వైశ్యుల జేర్పవేసభఁ॥ ౪

మున్ను ప్రతాపరుద్రుడట ముఖ్యనివాసముజేసియుండె భా
గ్యోన్నతుడై యశంబుగని యుండెనొ మంత్రి యుగంధరుండు వి
ద్యోన్నతుడౌచు నొప్పె జన వర్గములట్టిది యోరుగల్లు మీ
పున్నెమటంచు నెంచదగు బుద్ధిని వాసముజేయు టెంతయున్॥

తెలియ సమస్తశాస్త్రములు ధీరగుణంబులు వృద్ధినొందగా
కలుములనెల్లజెందగను కాలములారసి సంచరించ వి
ద్యలు చదువంగ శౌర్యమును దాల్చుచు నేరికి తగ్గకుండ వై
శ్యుల నొనరించు మార్గముల శోధనకై సభ లాచరింపుడీ॥

ఎన్నిదినంబులో గడచె నిచ్చట భోజనమెట్లటంచు దా
మెన్నరు వైశ్యపుంగవులు హేళనమా పెరవారు విన్నచో
మిన్నక జూచుచున్న నిక మిక్కిలి దుర్యశమౌను మీరు నా
తెన్నునెరింగి కార్యమును దీర్పగబూనిన మేలుగల్గెడిన్॥ ౭

కవితము జెప్పనేర్చి యొక కార్యముబూనుచు మిమ్ము వేడగా
చెవులను బెట్టరెవ్వరును శ్రేయముగాదటు సల్పసోదరుల్
దవిలి కులాభిమానమును దాల్చకనుండిన వృద్ధిగారు మా
యువకులు విద్యలందున మహోన్నతిగాంచరు వర్ణమెచ్చటన్॥

మనకులమందు పండితులు మందునకైనను జిక్కబోరు మీ
కనులకు ? నిట్లపూజ్యముగ గాంచుచునుండుట జేతనే గదా
గనుడిక నన్యవర్ణముల గౌరవమెట్టుల జేయుచుందురో
ధనములు శాశ్వతంబులని దల్చకుడెప్పుడు కీర్తియే దగున్॥ ౮



అధికధనంబుగూర్పవలె నంచు భయంబును మానుడెంతయున్
కుధరముగాదె సోదరులు గూర్చియు నొక్కొకరాయి వైచినన్
ప్రథిత యశంబుగాంచుడటు బాదుగులార ధనంబు జేర్చుచున్
బుధులు కులాభిమానమురు భూషణమంచని బల్కియుండరే॥

కష్టముతోడ సత్రమున కాలముబుచ్చితి మాసమొప్ప న
దృష్టము మంచిదైనయెడ దేవుడు కార్యఫలంబొనర్చుచున్
తుష్టినిగూర్చుగాక నటు దోడ్పడకుండిన నింటిమార్గమే
స్పష్టము దెల్పనేలనిక సర్వమెరింగినవారికీయెడన్॥ ౧౦

అదనుకు తామురంగయ సహాయమొనర్చుచుగాచె [మానమున్
తదుపరిజేర్చు టేమగునొ దాల్మికృతజ్ఞతజూపు టెంతయున్
వదలదు కార్యనిర్వహణ భారము వైశ్యసమాజమిచ్చటన్
కుదురుగగూర్చగావలెను కోర్కెయి దే హృదయంబునందునన్॥

తోడగనుశీతబాధలకు దుస్తులు లేవు భరించ కష్టమా
బుడతల జూడకుండనిట ప్రొద్దులుబుత్తు నికెంత కాలమున్
వడకను రాట్నచక్రము శుభంబుజెలంగ లభించకుండె నే
కుడుచుట లెట్లటంచు విశకోటులు దల్చరు కాలమింతకున్॥

వదలక నెల్లప్రొద్దులను వర్తకమందు నెబుచ్చి పత్రికల్
చదువకనున్న దేశమున సంగతులెట్టుల గోచరించు స
ల్పుదురెటు మేలు దేశమున శక్తినిగాంచరు ద్రవ్యముండినన్
కుదరవు సౌఖ్యపుంజములు గొప్పజనంబుల గాంచరెందులన్॥

సత్రమునందు వాసమును సల్పుచు నచ్చటివారియాజ్ఞ నే
మాత్రము దాటకుండవలె మాసముబుచ్చితి నెట్లనోదగన్
నాత్రము జెందుచుంటిమది నచ్చటనిల్వక లేచివెళ్ళనో
మిత్రజనంబులార విధి మీరగ నెవ్వరిశక్యమౌ భువిన్॥ ౧౫

వరంగల్లు రెండవ వైశ్యసభలో జదివినవి.

సరవిన్విద్యలనేర్చి సర్వకళలన్ సాధించి శాస్త్రంబులన్
పరిపూర్ణంబుగజూచి గౌరవము సంపాదించగా బుద్ధిభా
సురమై యొప్పగ వైశ్యవర్ణము యశోధామంబులన్ జేసి సు
స్థిరతన్నుండగ జూడవే మరికృపన్ శ్రీరామలింగేశ్వరా! ౧౬

ఎంతోతిప్పలుబెట్టిబెట్టినను మీ యిండ్లిండ్లకున్దిప్పి నా
యంతుస్దీసియు జేసి చుల్కదనమున్ నాలోచనజ్జేయుచున్
పంతంబెట్టిదొ వైశ్యజాతికిదియే భావంబుబోధించియే
సంతోషంబొనగూర్చునో దెలియనౌ స్వాంతంబులన్సర్వమున్॥

బూనినకార్యమెప్పుడును బోదు వృథాఫలితంబు గాంచకన్
గానరు వైశ్యసత్సభల గాంచిన మేలుల మానసంబునన్
దేనిసహాయ మొందుచును దీరుచు వైశ్యులు విద్యలందు స
న్మానముబొందుచుండిరొ ఘనంబునుజూడుడు వైశ్యసోదరుల్

పగ్గెనుబూని శూద్రకుల బాలురు వేలకువేలు విద్యలన్
నెగ్గుచు వేతనంబులను నేర్పునదాల్చుచు వృద్ధిజెందుచున్
తగ్గరు రాజకీయపువిధానములందున విప్రజాతికిన్
సిగ్గటులేదు వైశ్యులకు జెందక కోపముజూడు డాత్మలన్॥ ౧౯



గురుతరభాగ్యలక్ష్మి మన కోమటిగేములజూడ నెచ్చటన్
తరతరముల్వసించెను హితంబుగదెల్పుడు కోపమందకన్
తరుగదు దానధర్మముల ద్రవ్యమొకింతయు నష్టపాటులన్
సిరిహరియించు నెందులను జేయుడు వేగపరోపకారముల్॥

స్వర్ణవిభూషలుండిన యశంబునుగాంచరు మానవోత్తముల్
నిర్ణయవృత్తులందుగడు నేర్పువహించి ధనంబుగూర్చుచున్
వర్ణహితంబు గోరుచును వాసినిగాంచగనౌను దాన ను
త్తీర్ణతనొందుజాతిమరి దేశము వృద్ధినిగాంచు నెంతయున్॥ ౨౧

పంచుచుబత్రికాచయము ప్రార్థనజేసియు మిమ్ముజేరి దీ
పించగ వైశ్యధర్మములు బెక్కులుదెల్పగ బూనియుండగా
వంచనజేసి బంపగను వైశ్యులకియ్యది ధర్మమౌనె యో
చించుక మానసంబుల వచింపుడు సత్యము దాచకెంతయున్॥

తనువులుగావు నిత్యములు తావునుదారినో రాలునెప్పుడో
ధనములుశాశ్వతంబులని దల్చకనెప్పుడు మంచిచెడ్డలన్
గనుచును బీదసాదలను గాచుచునీశ్వర భక్తియుక్తులై
మనుడిక నెట్టివారి కవమానము గూర్చకుడయ్య కోమటుల్॥

సోదరవైశ్యులార కృప జూడుడు నాదగు యత్నపుంజముల్
బీదలబాగుజేయవలె పెద్దలుముందుగ నింటగెల్చి యా
మీదను రచ్చగెల్వవలె మీరలు వీనులవిన్ననీతి మ
ర్యాదగ నెంచగాదగు విరాజితమొప్పెడి ధర్మమార్గమా॥ ౨౪

కన్నులనీరుబాపినటు గౌరవమెంతయొ జేసినట్టులన్
నెన్నుచుమీరలొక్కసభ నింతట దృప్తిని జెందమంచు నా
విన్నపమేమియోవినక వీనులసిట్టుల మాయ జేయుచున్
సున్ననుజుట్ట మేలగునె జూడుడుకీర్త్యపకీర్తులెంతయున్॥ ౨౫

కులమునబుట్టి పద్దెముల గూర్చెడిశక్తిని దాల్చికొద్దిగా
దలచి నిజాము రాష్ట్రమున దప్పక వైశ్య మహాసభాస్థలిన్
వెలయగజేయ నూరుజులు బెద్దలపిన్నలనెల్ల గూర్చుకన్
పలువిధసూచనల్దెలిపి ప్రార్థనజేసిన నిల్వరెంతయున్॥ ౨౬

జెప్పితి ముఖ్యసంగతులు శీఘ్రముగూర్చుచు వైశ్యసత్సభం
తిప్పలుబెట్టిచూడకను తీర్చుడు నాదగు యుద్యమంబు మే
లొప్పనొనర్చు నాపయిన హోయనిపెద్దలు మెచ్చనెల్లెడన్
తప్పుగదోచెనేని విదితంబొనరించుచు దిద్దగాదగున్॥ ౨౭

ఈపురిలో పరిస్థితుల నెంచగనింతకుమించి జెప్పగా
నోపను జూడగాదగు సహోదరులెల్లరు వైశ్యధర్మ స
ద్దీపికనందు ముఖ్యములు దెల్పును సర్వపురాణశాస్త్రముల్
జూపు వితండవాదముల శోధనజేయుచు ఖండనంబులన్॥ ౨౮

మెలగితి రెండుమాసములు మిత్రజనంబుల మధ్యనిచ్చలన్
సలపితి కార్యయత్నమును శక్తికొలందిని కష్టమెంచకన్
దలచక శంకరుండిటుల దాల్చెను నిర్దయనేమొనర్చెదన్
సెలవొసగన్నమస్కృతుల జే యుచునుంటిని మీకునివ్వనా॥



చంకలుగొట్ట విప్రతతి సల్పితిరెంతయు వైశ్యసోదరుల్
జంకుచు మానసంబునను సందియమందను కార్యసాధనం
బింకనొనర్చి జూచెద న హీనగతిన్దగమీద జేరుచున్
శంకరుడాత్మమెచ్చ కన సాధ్యమొనర్చునె భక్తపోషుడై॥ 3౦

గీ॥ ఎవనిశాసనము చంద్ర యినులు దిరుగు
నిత్యుడై దివ్యదీధితి నెగడునతడు
కరుణమీర యుస్మాన్నలీ ఖానుపాదు
షాహశాయువు నిచ్చుచు సాకుగాత॥ 3౧

విప్రులొక్కొందరు శాస్త్రసంచయముల నీక్షించ కేవాదనల్
సప్రామాణ్య మటంచు జేసెదరు దేశంబెల్లతామంచు వి
ద్యాప్రావీణ్యుల నీతిధర్మపథము ల్దారాకణముల్జేయ కే
యీప్రాంతంబున మాయజేసినను దారెచ్చోటికిన్ రారొకో॥

వినువారుండిన మేకబోతువలె గాంభీర్యంబునన్ జూపిరన్
జనునాశాలము? విద్యలన్ జదువుచున్ శాస్త్రంబులన్ గాంచినన్
గనరేసత్యము నప్పుడేమగును ప్రాగల్భ్యంబులన్మానిబో
ధనలన్ జేయుడు ధర్మసంయుతముగా ధన్యత్వమున్బొందగన్॥

శ్రుతులన్ వైశ్యనృపాలకుల్జదివిరన్. శోధించగాశాస్త్రముల్
హితమౌనట్టు లొనర్చ పాపమనుచున్ నెందేనియున్గన్పడన్
స్మృతులన్వేదము లభ్యసింపకను వారేమానుచున్ జాతికిన్
ధృతితోదెల్పుదురింత కష్టపడ భూదేవాళులై జెల్లునే॥ 3౪

జూచితినెల్ల భంగులను స్రుక్కక కష్టముఁ గోర్చి దీక్షతో
వేచితి రెండుమాసములు వేడుకసాధన జేయ కార్యముఁ
దాచుచు గుట్టుదెల్పక వృథా చెడగొట్టితి రేమి జెప్పుదుఁ
బాచినకూడ దెట్టులిల పక్వముఁ గొంచు నెరింగి యున్నదే॥ ౩౫

వృద్ధినొనర్చ బాలకుల విద్యలు భాషలు నెల్లకర్మలఁ
బద్ధుడనౌచు గ్రుమ్మరుచు పట్టణరాజము నోరుగల్లునఁ
శ్రద్ధనుజూప ముందుగను సల్పెదమంచు మహాసభాస్థలిఁ
బుద్ధిని జెప్పి వెళ్లుమని పోయెడిమార్గము జూపి రెంతయుఁ॥ ౩౬

భిక్షుడనౌచు నాసభకు బెద్దలజేరగవత్తుమంచు నా
తక్షణ మాత్మమెచ్చుచు వృథానొనరించితి రయ్య చిత్రమా
లక్షలుగల్గువారలిటు లక్ష్యము జేయకనున్న సత్యముఁ
కుక్షికిలేని బీదజన కోటులబద్ధమునాడ నేరమా॥ ౩౭

విత్తముగల్గి వర్ణముల బేరువహించరు కొంచమైన వి
ద్వత్తును లేక బేరముల వాసిని జెందిన జెందుగాక నే
మెత్తుకబోరు జచ్చుచు న హీనధనంబులు మంచిచెడ్డలే
సొత్తుగ వెంటనంటి జను శోధన జేయుడి శాస్త్రమండలిఁ॥

గిజగిజలాడ తిండికయి గేయమునందున బిడ్డలుండగా
గజిబిజిగాక ధీరమును గాఢముగా మనమందు నిచ్చుచుఁ
భజనమొనర్చి శంకరుని వైశ్యమహాసభగూర్చ నెంచితిఁ
స్వజనములాలకించరిక జాలును చంపలు వేసినట్టులే॥ ౩౯



జీతము బుచ్చుకొంచు పని జేయుచునుండెను లేకయున్నచో
నీత డిటేలకష్టపడ నింతయటంచు జనంబులాడెడిఁ
పాతకమంచు నెంచకిటు బల్కుచునుండె యథార్థమారయఁ
జేతనుగాక కొందరటు జెప్పుట దోషమటంచు బల్కెడిఁ॥

సత్యాసత్యము ముందుగాననగు నా చందంబు వైశ్యాళికిఁ
సత్యాశంబర తెంచి యాశయములే నన్నింటిని ద్దెల్పితిఁ
ప్రత్యక్షంబుగ నిల్చి ద్రవ్యమును సంపాదించి సాధించుడీ
నిత్యంబేదియుగాదు నిల్చుయశమే నిక్కంబు ముమ్మాటికిఁ॥

మెతుకులు గల్గియున్నవని మీ కులబీదలు బొందుచున్న దు
స్థితులనుగాంచకఁ సుఖము జెందగ నన్యులకిచ్చి ద్రవ్యముఁ
ధృతిపురిసంచరించినను ధీరముగాదది ధర్మమే తగుఁ
బ్రతికిన జచ్చినఁ స్వజన బందుగులేగద దిక్కు జూడుడీ। ౪౧

రుసుమని కన్యకాంబకిడ రూకలుదీయుచు దేవి నిల్పగా
మసలుదు రేమిచోద్యమిది మంచిద సొమ్ముహరించ దిట్టరా
పొసగదుకీర్తి యేయెడను పుణ్యమణంగును బెంపుగ్రుంగెడిఁ
విసము సమానమా ధనము వీసమునంటిన నాశనంబగుఁ॥

జెప్పుచు శక్తినామమును ఛేదన జేసియు మేకపోతులఁ
చప్పుడులేక భక్షణము సల్పుదు రట్టుల కన్యకాంబపే
రొప్పగ దీసి రూకలు ప్రయోజనమేమి యొనర్చకేదగఁ
పప్పుగ మెక్కుచుందురిది పాపము వైశ్యుల కొందరిట్టులా॥

పద్ధతులేమిపెట్టినను బల్కసరేయని మీఁదవాటికిన్
బద్ధులుగారు హాస్యముల పాలొనరింతురు బీదసాదలన్
శ్రద్ధగడెందమందున వి శాలధనీకుల తత్వమంచు నా
సిద్ధముశెట్టిమల్లయ వి శిష్టము నాకువచించియుండఁడే॥ ౪౫

భాషలనేర్ప వైశ్యకుల బాలులకున్వెస బాటజూపుచున్
పోషణజేసిరేని పరి పూర్ణయశంబొన గూడునెందులన్
దోషములెల్లమాని కడు తుష్టితొనుండ్రు కులాభిమానమే
భూషణమంచు శాస్త్రముల బోధనువీనుల నాలకించరే॥ ౪౬

సతతము దేశకాలముల సంగతులారసి ధర్మమెంచనా
గతులను గాంచరేకులము గౌరవహీనము జెందుటెంతయున్
మితముకు మించుచున్ వ్రయము మేటిధనీకులు జేయుచుండెస
ద్వ్రితశుభకార్యజాలముల వాడగనేల విదేశవస్తువుల్॥ ౪౭

బలభాగ్యంబులు గల్గువారలకు లుబ్ధత్వంబు శూన్యంబుగా
వలె నట్లొప్పకనున్నబీదజనులే బాటించగా శ్రేష్ఠులె
ట్టులన స్భక్తిని గల్గియుందురని శ్రేష్ఠుల్జెప్ప నాలించరే
బలువైనన్ సుఖువైన సర్వజనము ల్భారంబునున్ దాల్చనా॥

పూజలులేక నెల్లెడల భూజయుతంబయి పాడుబడ్డ వి
భ్రాజిత దేవళంబులను వైభవమారయ నోరుగల్గునన్
రాజులకోపి భాగ్యముల రంజిలువైశ్యులు గల్గియుండరే
యోజనజేయవారి సుగుణోన్నతమెల్లను గానుపించెడిన్॥ ౪౯



వందలు వేలు లక్షల ది వాలలదీసెడివారి జూచుచున్
బందుగులైనవారు తమ భాగ్యము బోదని నిశ్చయంబుతో
నుందు రిదేమిచిత్రమొ మ హోన్నతధర్మములాచరించి మే
లందుచు ముక్తిగాంచుడు భయంబగు కాలునిశిక్షలెంచిరన్॥

క్రమముగ చాపబాణముల గైకొని కాలునిభంగినిల్వ యు
ద్ధమున దివాకరాత్మజుడు ధైర్యమువీడిన పార్థుగాంచి యా
సమయముబుచ్చి శౌరి గుణ సాహసుజేసిన కర్ణుద్రుంచె ను
ద్యమమటుపాడుజేసితిరి దాల్చుచు కీర్తి ధనాధికుల్ధరన్॥ ౫౧

మటుమాయల్గనుపించకుండగను స న్మానించినట్లొప్ప కో
మటులెవ్వారిని వేడరాదుగద సే మంబెందునున్ గాదు దు
ర్ఘటమావంటలజేసియైన బ్రతుకం గా నౌను ముస్త్యాలవెం
కటకృష్ణార్యుడు బల్కియిట్టులను సాగంబంపె గోల్కొండలో॥

జేరినవారిదాపునకు జీరుచు చల్లగమాటలాడి యా
శారపువారు బంపుదురు కాలముబుచ్చక మంచిదేయగున్
బారలువేసి ముందు నగు బాటొనరింతురు కొందరీయిలన్
సారెకు ద్రిప్పిద్రిప్పి తగు సాయమొనర్చక బంపె నెందరో॥

సిరులవి నారికేళమున జేరెడునీరముభంగి జేకురున్
కరిభుజియించు వెల్గలటు కల్మి జనున్నటుమాయజేయుచున్
మురిపెముజెందనేల ధన ముల్గని శాశ్వితమంచు నెంచుచున్
నరునకు నాలుగంశముల నన్వినియుండరె పెద్దలెల్లెడన్॥ ౫౪

నాకటనోరుగల్లు పురనాయక వైశ్యులు గుర్వులంచు నే
వాకొనబూనిరిక్ గలిగె వన్నెతిరంబెద మేలుబొందిరిక్
కాకలుదీరు కాంచనము కాంతులుమించెడి భంగినెంతయుఁ
జేకొనికష్టపుంజముల జెందుయశంబిల మానవోత్తముల్॥

ఏనిటులుండగా ధనికులెందరొకృంగి దివాలదీసె సం
తానములేక నన్యులను దత్తునొనర్చక దారవోసె నే
దానముజేయకన్ ఋణముదప్పనె బీదలుభాగ్యమందరే
లేనగవేలనూ? కలిమిలేములు కావటికుండలౌననన్॥ ౫౭

సలపిన దానధర్మములు సత్రములన్దగబెట్ట నన్నముఁ
కలిమి నశించదేయెడను కర్మవశంబున వర్తకంబులో
గలుగును నష్టబాటు ధనకాంచన భూషలు మాయమయ్యెడిన్
దెలసియు నిత్యమంచుసిరి ద్రిమ్మరుచుందురు క్రుత్రిమంబునన్

గట్టుచు లింగకాయలను కంఠమునందున శిష్యులంచు చే
పట్టిరిగాని వైశ్యులను బాహ్యులజేసిరి వేదకర్మలన్
కట్టును జేయరైరి శివగాధలదెల్పిన శైవధర్మముల్
గుట్టు దృగ్గోచరంబయిన కొందరు భక్తినివీడకుందురే॥ ౫౯

ధనవరు లెంతమాత్రము యధార్థము నన్గురుభావముంచకా
ర్జనమొనరించి ధర్మమును సల్పకబీదల కొంపలార్చుచున్
దనరుదురట్టివారలు వృధాయని దల్చుచు కీర్తికాంత ని
ర్ధనికులటంచు జూడక నుదారమనస్కుల బొందుప్రేమతోన్



జేరి నమస్కరించుచు విశేషముదెల్పిన చిత్తగించి యా
దారముజూపకాయెడను తర్లుము తక్షణమంచుబల్కయా
బూరుగ విశ్వనాధమిటు పూర్ణతరంబుగ సంతసంబె స
త్కారముజేయకున్న కవి తంబుకు గౌరవహానిగాదిలన్॥ ౬౦

స్వేచ్ఛనెసంగి భాషణల వీనుల విందుగనాలకించుచున్
వచ్చినదాది యాకొమిర వల్లికులేశుడు కాశయాహ్వాయుం
డచ్చెరువంద ముఖ్యసఖు డట్లుగనెంచుచు గాచుచుండె నే
మిచ్చిన దీరదాఋణము యీశుడుప్రోచెడు సార్వకాలమున్॥

పుట్టువునందు బీదలకు భూరిధనీకుల కొక్కమార్గమే
గిట్టుటలో సమంబె వర గేహములల్లె కుటీరవాసముల్
గట్టుకపోరు ద్రవ్యమును కాంచనభూషల పుణ్యపాపముల్
బట్టును వెంటనిర్వురకు ప్రాజ్ఞులు గాంచినభేదమింతయే॥ ౬౨

గలిగినవారిడెందము సుఖంబునుగాంచ దొకింతచూడ రూ
కలు గొనునేమొ చోరులని కావలిగాతురు నిద్రమానుచున్
సలుపుచు కాయకష్టమును సాదముగైకొని స్వేచ్ఛమీర బీ
దలు నిదురింత్రు హాయిగను దైవమునెంచుచు నిర్విచారులై॥

జేసిననేమి దుష్కృతము చింతబడన్ జనదెట్టివేళలన్
వాసములన్నవస్త్రముల బంగరువస్తువ లివ్వవేడ్కలై
లాసమొసంగువారలు బలంబుగనుండె లభించకున్నచో
మోసుకనైనజేర్తురిక భూమిబుధుల్గన శైవధర్మముల్॥ ౬౪

దినకన్బొట్టకు బెట్టకన్యులకు నే దీనాళులన్ బ్రేమతో
గనకన్ బాత్రలబెంచి ధర్మముల నాకర్ణించి వర్తించకన్
ధనమున్గూర్చిననేమి సార్థకమగున్ దాంపత్యసౌఖ్యంబు ని
ర్ధనికుండాత్మ సుతాదులన్ దనుపడే దైవంబు సేవించుచున్॥

ప్రకటిత ధర్మకార్యముల పాత్రములైనను దారవోసి సా
ర్థకమొనరించి సత్ఫలము తప్పక నొందక చేతురన్యులన్
నకుటిల వర్తనల్దలచ కట్టులవిఘ్నము నొందజూచు పా
నకమున బుల్లవైచుట ఘనంబగునా నెరదాతలెట్లగున్॥ ౬౬

లేదనిజెప్పనేల నవలీలగ నగ్రజుడున్నలుబ్ధుడై
వాదొనగూర్చు నాతనికి వచ్చినవారికిసున్నజుట్టి యా
సోదరుడట్టివాడె పరిశోధనజేసిన ఖర్చుకన్న సం
పాదనజేసి మించనగు బల్కరుదానికి బెద్దనెన్నుచున్॥ ౬౭

వేలును వందలిచ్చుచును విప్రులభక్తితొ బూజసల్పగా
జాలినసూక్ష్మదేహమును చక్కగ నా శివలోకమంపినన్
స్థూలమునేరుజేర్చు పరిశోధనజేయ సమాధిచెంతకున్
మేలుకుకీడుకైన కులమేకద? వారలజూడ నొప్పదా॥ ౬౮

నిద్దురలేచి దైవమును నిర్మలచిత్తమునన్దలంచకన్
బెద్దలబిన్నలన్ననక బెంచిధనంబు లసత్యమాడుచున్
కొద్దిగధర్మమున్సలుప గూర్చునెమోక్షము కాకిజంపుచున్
గద్దకువైవసార్థకమె గల్గునెలోకమునందు సౌఖ్యముల్॥ ౬౯



మంచినిపైకిజూపుచును మానసమందున జెడ్డబెట్టుకన్
దెంచుచు దుంపలెందరినొ దీపములార్పుచు స్వాపతేయమున్
సంచులగూర్చిగూర్చి యది సర్వము నాశనమౌచు పాపమే
గొంచుకపోవు నిక్కముగ గూలును నారకకూపమందునన్॥

హితులనుగూడి తీర్థముల కేగి గుడారములన్వసించినన్
సతతము కార్లనెక్కుచు బజారులబొంగుచు సంచరించ స
ద్గతికటుబోవగా దరమె కార్లు తురంగము లిచ్చుటేగదా
వితరణబుద్ధియున్న సరవిన్దగజేర్చును ముక్తికేయెడన్॥ ౭౧

వీడక దుర్గుణంబులను వేదములేమి బఠించకెంతయున్
పాడక ఫాలలోచనుని పాటలు భక్తిని మానసంబునన్
పీడనజేసి శిష్యులను బెట్టుచు తిప్పలు రౌప్యముల్ధరన్
మోడినొనర్చిలాగికొని ముండలకిచ్చెడివారు గుర్వులే॥ ౭౨

చనపురుషుండు వానిసతి సద్గురువంచని ధీరమూనుచున్
జనుచును శిష్యగేహముల జాణతనంబని దల్చకెంతయున్
ధనముకు మోడివేయుచును దర్పముజూపుచు భూతిబూసుకన్
కనికర మాత్మబూనకను కష్టము బీదలనొందజేసెడిన్॥ ౭౩

బీదలటంచు జెప్పినను బెట్టుచుజేసి శపింతుమంచు మ
ర్యాదనుజూడకే హృదయమందున శిష్యులమందిరంబులన్
రోదనగల్గజేయుచు విరుద్ధముగా నటియింతు రెట్టియు
న్మాదమొగాని పుణ్యమను మాటయెదోచదు గుర్వులెట్లగున్॥

తులువతనంబునన్దిరుగు దుష్టులనేస్తమొనర్చుచున్సదా
బలుకుచు ననృతంబులను పాపమటంచు నొకింతజూడకన్
దలచక ధర్మమార్గముల తామసులౌచును శాంతమెంతయున్
నిలుపనివారి గుర్వులని నిష్ఠతొబూజలసల్ప బుణ్యమే॥ ౭౫

శ్రుతిహిత కర్మలన్విడిచి సోమరులౌచును సంధ్యవార్చకే
సుతరము ధర్మశాస్త్రముల శోధనజేయక నగ్నిహోత్రముల్
సతతము సల్పకన్ రతుల సౌఖ్యముదేలెడివారు గుర్వులే
గతులనెరింగి శిష్యులిలగాంచగనౌ హృదయంబు లందునన్॥

సాకగనాలుబిడ్డలను సర్వవిధంబుల భూములుండి యా
శాకలితాత్ములై ధనము జాలక శిష్యుల బాధబెట్టెడిన్
నాకలిగొన్నవానికిల నన్నమొసంగను బోధజేయకన్
గైకొని స్వాపతేయమును కాలునిబాధల గుర్వులందరే॥ ౭౭

మహిమ వహించగానిల సమాధితపంబుల సల్పలేక భూ
తహితము గోరకాత్మను సదా జరియించుచు సద్గుణంబులన్
సహనములేక వాదనల సల్పిమతంబుల దూరికర్మలన్
దహన మొనర్చకన్దిరుగు ధర్మవిదూరులు గుర్వులెట్లగున్॥

బోధనొనర్చి శిష్యులకు పూర్ణముగా కలుషంబు బాపినన్
సాధక గుర్వులంచు సరసంబుగవల్కిరి మౌనిజాలముల్
గాథలుజెప్పుచున్ ధనముగైకొని మూటలుగట్టువారలే
బాధకగుర్వులంచు బుధవర్యులు దెల్పిరి ధర్మసూత్రముల్॥



వినగా శైవమతంబు గుర్వులది భావించంగ నాచారులన్
ఖననంబౌనిక నగ్నిహోత్రములు లేకన్ బ్రాహ్మ్యమెట్లానొకో
గన నద్వైతము శిష్యకోటులది సత్కర్మల్దిగన్ స్మార్తమం
దున వైదీకులెదిక్కు వైష్ణవుల బుద్ధుల్జూడ నిల్లేయగున్॥ ౮౦

నిలపిరె సత్యమార్గముల నీతిని శాస్త్రహితంబుగాదగన్
దెలపిరె వర్ణధర్మముల దివ్యతరంబుగ దాస్యవృత్తులన్
బలికిరె గీతలందుగల భావములెల్లను సోదరాళికిన్
దలప పరోపకారమును ధారుణిజేసిర గుర్వులెట్లగున్॥ ౮౧

క్రమముగ పంగనామముల గల్పనజేయుచు తప్తశంఖుచ
క్రముల భుజంబులందిడిన రాజిలజేయ గురూపదేశమే
సమయములందు వైదికులు స్మార్తమెగూర్తురు కర్మలందు భే
దముగద గుర్వుశిష్యులకు ధర్మమె వైష్ణవమంచు బల్కగన్॥

సవనంబుల్మరి వైశ్యపుంగవులు రాజన్యుల్ప్రమోదంబుతో
దివిజుల్మెచ్చగ జేయగూడదని సందేహంబునున్లేక బ్రీ
తివచించున్ ఘనులట్లు బొంగుచును సందిగ్ధంబె తాజెడ్డకో
తి వనన్బెల్లను బాడుజేసెనను నీతిన్దెల్పెడిన్ గాంచినన్॥

నిలుకడలేక వర్తనల నేరిచి యాంగ్లము సేవకాదివృ
త్తులనొనరించుచున్ కులము దుర్గతిజెందుట గాంచకేమి మో
రలు పయికెత్తివాగెడిని రట్టునుజేయుచు విప్రజాతి వై
శ్యుల నిలదూరుచుంద్రు పరిశోధనజేయుడు పెద్దలెల్లెడన్॥

ప్రకటితకర్మ లారిటిని బాగుగ జేయుచు సత్యవంతులై
యకుటిలవృత్తిధర్మముల నందరకున్వచియించి నౌకరీ
లకు జన పాడిగాదనుచు లక్ష్యము సేయక వాని మార్గద
ర్శకులయి విప్రలోకము యశంబునుగాంచిన గుర్వులయ్యెడిన్

పంచమబాలురన్గలసి పాఠులకుర్రలు నాంగ్లభాష మే
లంచు జరించవచ్చు మరి యాదకు భంగముగాదు జూచుచున్
మంచిదిగాదటంచు బుధ మండలి వల్కరుగాని వీధిలో
వంచన జేతురంటనుచు వారల? ధర్మమె నీతిమార్గమే॥ ౮౬

మినుకుచు ముచ్చటాడరు ని మేషముపండితు లెవ్వరొచ్చినన్
ధనికులు విజ్ఞపీగుదురు దానప్రయోజనమేమి గాంచగన్
దినకను బెట్టకుండినను దిష్టికినిల్పిన చేనిబొమ్మలై
దనరు ధనంబు గావలికి దల్చకనుండిన దానధర్మముల్॥ ౮౭

రాబడితక్కువంచు తన రాతయటంచు గొనంగి చల్లగా
పోబడియెక్కువంచు మది బొక్కుచు వచ్చినవారి కెంతయున్
దేబెతనంబు జూపుచును దిట్టుసహాయము గోరువారలన్
నేబదిలక్షలుండిన ధనేశులు దేముడొనర్చ డట్టులన్॥

బెట్టుచుఖర్చురౌప్యముల వేలకువేలు వదాన్యులట్ల చే
పట్టగ గొర్నమెంటును ది వానుబహద్దరు బిర్దునందగన్
గట్టుకపోవడాబిరుదు కాలుడుగాంచియు దుర్వ్యయంబుకున్
పట్టుగ నారకంబునకు బంపుచు బాధల నొందజేయడే॥ ౮౮



దేశము దుస్థితిన్దనర దిక్కుదెసం గనకుండ నెందులన్
యాశనుపీడకేమియు న హర్నిశముల్గణియించి ద్రవ్యమున్
కాశికిబోయి రైళ్ళకును గార్చినసంచులు పున్నెమబ్బునే
శేశముజేయ ధర్మ మవ లీలగ మోక్షము లభ్యమయ్యెడిన్॥

అతిథుల ప్రేమమీరగ గృహంబుల పూజలసల్పి బెట్టకన్
పితరులు ముక్తిబొందుదురె పిండములెట్లుగ్రహింత్రు వేడ్కతో
గతులెటుబొందగల్గుదురు కాశికిబోయిన సార్థకంబె ధీ
చతురులెరుంగనౌ మదిని శాస్త్రములెట్టుల దెల్పుచున్నవో॥

దిరుగరు పెద్దలన్గలసి దీనులజూడరు సత్కృపామతిన్
సరసగుణార్జనంబునకు సల్పరుయత్నము గట్టిగాను యే
పరువుప్రతిష్ఠలన్గనరు ప్రాణములుండినజాలు మానమే
మరుగునదూరినన్ ధనిక మార్గము కొందరికౌను గాంచగన్॥

అన్నతొవంతు బెట్టుక న యంబుగ నాతని నీచబుద్ధి న
త్యున్నతిజూపనెంచుటిది యుక్తమె లుబ్ధుడుగాడె తమ్ముడున్
సున్నలజుట్ట? ధర్మముల శోధనజేసిన మాయగాదె యా
పన్నగడన్ హితంబనుచు బల్కుదురెట్టుల పండితోత్తముల్॥

పదుగురుకంటె లాభములు ప్రాప్తముగావలె వేలులక్షలున్
పదుగురమించి రత్నములు భర్మవిభూషలు దాల్చగావలెన్
పదుగురతోడ ధర్మముల పద్దువేయగరాదు చేయి యా
పదుగురితో సమానదశ బట్టును కోరినయట్లె ముందటన్॥

అజగరమల్లహస్తముల కందినదానిని సంచివైచుచున్
స్వజనులనైనజూడకను సర్వులవృత్తుల నాక్రమించుచున్
నిజమును వల్కకెంతయు వినిర్మలవర్తన బూనకుండినన్
ప్రజలు గ్రహింపడెందముల బల్కరె నీచులటంచు దిట్టగన్॥

వదలక నాశనెంతయును వర్తకమంతయు నాక్రమించుకన్
పదుగుర జీవనంబులను బాడొనరించుచు పెద్దమేడలన్
సదనములెన్ని గట్టినను సర్వము నాశనమొందు బిమ్మటన్
గదలునె భాగ్యలక్ష్మి సరిగానొనరించిన దానధర్మముల్॥౯౬

ధనమునరాదు గౌరవము దర్పముజూపిన బొందరేమియున్
గనవలె దానబుద్ధినిల కాలములారసి దన్పిబీదలన్
దిని తన బొట్టనిండగను దృప్తినిబొందిన మెప్పుగాదు చే
తనములనెల్లప్రేమగని దైవకృతంబు నెదం దలంచనౌ॥ ౯౭

సతతంబున్మరి రేపు మాపనుచు నాశంబెట్టి వేధింపకన్
మతధర్మంబులెరింగి పండితుల సన్మానించి లాలించుచున్
స్థితితోనుండడె గర్వమాత్మ గనకన్ చీకోటి వీరన్న యీ
క్షితిలోధర్మ మొనర్చినన్ జెడరు వాశింగాంచు లాభంబగున్॥

ఆయుర్వేదము వృద్ధిజేసి ప్రజ కాయారోగముల్బాపుటే
శ్రేయంబంచుదలంచి మేటివణిజుల్ చిత్తంబులన్ ఖర్చుకై
మాయోపాయముజేసివైచి రుసుమున్ మాంద్యంబుతోనుండ
నేన్యాయంబౌదగనోరుగల్లు పురిలోనన్ జూడుడీధార్మికుల్॥



ధీరత ధర్మఖర్చులనుదీసి యొనర్చకనే వ్రయంబు స
ర్కారున జెప్పనెట్లగునొ గాంచుము శాసనమెట్లుదెల్పునో
యూర్థుజులొప్ప రెచ్చటన హోరుసుమింతయుమెక్కబొట్టకున్
దీరవు కార్యజాలములు దీన? ఘనంబును గాంచగావలెన్॥

ఒకనికి గల్గులాభమని యోచనలందున గోచరించ వా
నికి బయిపోటి వేరొకని నిల్పుచు ద్రవ్యమొసంగి యుక్తిచే
సకలము మ్రింగజూచు నది సాగిన నెప్పుడొ సర్వనాశమై
పకపకనవ్వనల్వురు దివాలనుదీయడె వాడుముందటన్॥౧౦౧

పదుగురుతోడ ధర్మమున పద్దునువ్రాయక లోభియైనచో
గదిమి పరాభవంబెపుడొ కార్యములందున జేయనెంచి స
మ్మదము నడంచి కోర్టున నమానుషముస్గలిగింపకుందురా
కుదురును రోగమయ్యెడను కోర్టువ్రయంబొనరింత్రు ధీరులై॥

చిక్కిన ధర్మరొక్కముల జేర్చక దానికి పేలపిండిగా
బొక్కిన నేమిసార్థకము బొట్టకు కన్యకదేవియెప్పుడో
గ్రక్కగజేయుసర్వమును గాంచగ నీశ్వరిశక్తిగాదె పెం
పెక్కరు చిల్లిగవ్వదిన నెప్పటికప్పుడొసంగ మేలగున్॥ ౧౦౩

పదుగురువద్ద ధర్మమని బట్టుక రూకలఖర్చుబెట్టకన్
బెదరక బొట్టవేసుకొని పెద్దలమంచని సంచరింతురే
మిది తిరిపంబుగాదె ఘన మెట్లగు యాచకులందు ముఖ్యులే
మొదలకు మోసమౌ నరయ మూర్ఖతనంబునుజూపనెప్పుడో॥

దిగుమతి బండ్లవారిపయి దీసెడిధర్మము నావిధంబుగా
నెగుమతి రూకలంగొనుచు నీశ్వరికర్పణజేయకే సదా
యగుపడకుండమెక్కెదర హా పెరవారల సొమ్ముగాదె దా
చగ నిదియేరిముల్లె? కల చందముజెప్పిన పర్వహీనమా॥

పరువని కొందరూరుజులు బల్కుచునుండెను యాచనంబుకీ
పురికరుదెంచెనంచు ఘన బుద్ధియె సత్యమటంచు నొప్పెదం
తిరిపెముగాదె ధర్మమని దీసెడిరూకలు? యేరిసొమ్ము మం
దిరముల ఖర్చుజేసికొన దీనివిచారణ జేయనెట్లగుం॥ ౧౦౬

చెవులకుజొచ్చె యాచనము జేయగవచ్చెనటంచు వైశ్యబం
ధువు లొక కొందరాడుటయు దోషముకాదది వర్తకంబులో
నెవరుగణించి ధర్మనిధి కివ్వకస్వార్జిత మట్లునెంతురో
వివరమెరుంగ తేటపడు బిచ్చముకాదని పెద్దలెంతురా॥

విప్రద్వేషినటంచు కొందరెవరో వేడ్కారగా బల్కుచుం
స్వప్రామాణ్యములేవి వైశ్యులకు శాస్త్రంబుల్గనం జూడ తా
మే ప్రావీణ్యులమంచు నుబ్బుచును సన్మిత్రంబునుం జూడ కెం
తో ప్రాముఖ్యమటంచు నెంచెదరు సంతోషంబు చేకూరునే॥

వేలును కోట్లు లక్షలను విత్తముకూడిన తృప్తిజెందకం
గూలచకొంపలెన్నియునొ కోరికవెట్టుదు రంతలోపలం
జాలకకాలకర్మములు సర్వదివాలను దీయుచుందురా
వేళనుదరిద్రవంతులను బెద్దలజేతురు కాళ్లజాచుచుం॥ ౧౦౯



దరిద్రమొసంగ నీశ్వరుడు దాని విధుల్గని శాశ్వతంబుగా
దివ్యులుమెచ్చ ధర్మముల దృప్తినొనర్చక బీదవారితో
సవ్యముగాను వర్తనము సల్పక గర్వముబూని బొంగుచుం
నవ్యవిదేశవస్తువు లనారతముం ధరియింత్రు బుణ్యమే॥ ౧౧౦

ధనమభివృద్ధిజెందుతరి దాన కుటుంబములెన్నియైన నా
శనమయి చేరుచుండు నని శంబును తృప్తినిగాంచరెందులం
జనుతరి గీములెన్నిటినొ చక్కగ శుభ్రముజేయుచుం దివా
లను తగదీయుచుంద్రు సర శంబగు కీర్తినిగూర్చు నేరికో॥

కుదురదు ద్రవ్యమెంతయొన గూడినస్థైర్యముమానసంబుకుం
వదలరు దుర్గుణంబులను బాధలబెట్టగ బీదవారలం
పదుగురి జీవనంబులను భంగముజేతురు లుబ్ధులై సదా
తుదకెటుబోవునో ధనము దోచదుబుద్ధికి జ్ఞానశూన్యమై॥ ౧౧౨

దిగులుజెందక వేలరొప్పముల సందేహంబునుస్వీడుచుం
దగ మోటారులు పూజ్యనీయమని యాత్మన్దల్చుచున్గార్చి మో
జుగ మల్లుల్ధరియించి సిల్కులమరం జుట్టంబులం జూడ షో
కుగ రస్తాలను దిర్గుచుందు రహహా గొంపోవునే ముక్తికిం॥

పూర్వసవారులుం శకటపుంజము మోటుగగానుపించుచుం
గర్వము జెంది స్పార్టులని కార్లు రికాషలగాంచి బొంగుచుం
సర్వవిదేశవస్తువులె చక్కగవాడుచు బాకశాలలం
దుర్వినియోగమంచు మది దోచదొకప్పుడు భాగ్యశాలికిం॥

సంతతమే విచారమును సల్పక పెద్దలసేవ జేయకన్
వంతులు బెట్టి ధర్మమున వచ్చినవారల ద్రిప్పిద్రిప్పి యా
వంతయుజూడకన్ తమకు వాశియటంచు దలంతు రేమి యా
వంతులుచావుకున్ గనుట భావ్యముగాదొకొ భాగ్యముల్గొనన్

కాలముజూడకన్ధనము గార్చుచు లక్షలలోహయంత్రముల్
శాలలనిల్పి వర్తకము సల్పుచు విత్తము ప్రోవుజేయుచున్
వేలును కోట్లు లక్షలను బెట్టి విదేశపు వస్తువుల్గొనన్
బీలిచిబిప్పిజేసెదరు బీదలనెల్ల ధనీకు లిమ్మహిన్॥ ౧౧౬

జరుపుచు వర్తకంబును విచారముజేయక దేశదుస్థితిన్
మురియుచు ద్రవ్యమున్నిను పముక్కలకున్ వ్యసదారబోయుచున్
తిరిపపువృత్తిజూపి యతి దీనులజేసెను సోదరాళి, కా
పురములనెల్లదీయుచును పున్నెమ జూడ ధనీకపాళికిన్॥ ౧౧౭

గట్టినపెద్దమేడల సుఖంబును జెందగబోరు వానిలో
బెట్టకపట్టెడన్నమును బీదలకెప్పుడు బోదుకాలమే
పట్టుననైనభూతములు బట్టుక్రమింగు జయంబులేదు యీ
గుట్టుగ్రహించనౌను బుధ కోటుల దీవనలంద మేలగున్॥

జిక్కినభాగ్యమంతయును జేయగధర్మమువానికౌనె వే
రొక్కరు దానిబొందగమ రొక్కరికట్టులజేసె నీశుడే
నిక్కముజూడ నొక్కెడనె నిల్వదు వంతులబట్టిబొందు దా
చక్కగదానధర్మముల సల్పహరించిన మీదనేమగున్॥ ౧౧౯



ఎంతవిశాలమందిరము లేర్పడగుండ్లకు మీరగట్టినన్
పొంతను జేర్చి యన్నమును భూరిదయామతి బెట్టకుండినన్
సంతతమెల్ల దేవతల సల్పకపూజల నున్నకీర్తులన్
చింతలబొంద జేయుచును జీవములన్ యజమాని బాపెడిన్॥

ప్రమదముతోడనుండకను భాగ్యము జేకుకొలంది బీనుగై
క్రమమున బెట్టకెవ్వరికి గాంచిభుజించక బొట్టనిండ దుః
ఖము గనుచుండు వీసమురక్షిప్పపడన్ తుదకెప్పుడో భువిన్
యమపురి కేగి కష్టముల సందును రెంటికిగాక నీచుడై॥ ౧౨౧

పుట్లకుపుట్లు పండినను పూర్తిగ కర్షకపాళి తృప్తినే
పట్లనుబొందకన్నినక బాగుగకూటికి మండజేసి యి
క్కట్లను బెట్టి కార్మికుల కష్టముగాంచక నిర్దయాళులై
భట్లను మించుధోరణిని పల్మరుదిట్టుదు రేమి ధర్మమో॥ ౧౨౨

ఎండలకల్లై వర్షముల కెల్లసహించుచు నెల్లప్రొద్దులన్
పండక నిద్రగోరుచును బాగుగ సేద్యమొనర్చ మెచ్చకన్
పండినపంట కర్షకులు వాసములందున నింపి జూడకన్
తిండికిమండజేసెదరు దిట్టుచు కార్మికపాళి పుణ్యమే॥ ౧౨౩

ముఖ్యోద్దేశము.

జెప్పినపద్యభావము ల శేషధనీకుల కన్వయించగా
నొప్పవు లుబ్ధపుంగవుల కొప్పునుదంతము భక్తిమీర నే
తప్పకదాతలెల్లరకు దండములర్పది వేలొనర్తు నా
తప్పులనెల్లసైచుచు సదా దయమీరగ జూడనెంతయున్॥

దెలసిసమస్తదానముల దీనులఁబ్రోచెడివారు ధర్మముల్
నిలుపమనంబులన్దగవి చారమొనర్చెడి వారలుండగా
నిలుకడలేక గ్రుమ్మరిన నీచులగీముల వేడ్కనిల్వగా
దలచుటభావ్యమే గుణవిధానమొ ప్రీతియొ భాగ్యసుందరీ॥

మర్మము బూనకెప్పుడును మంచిచెడుల్గమనించుచున్మదిన్
నిర్మలభావముల్గలిగి నీతిని వీడక శౌరిబ్రీతికై
కర్మలొనర్చుచున్ జనుల కష్టములన్గని యోర్వజాలరే
ధర్మగుణజ్ఞులీభువి నిదానముగా మనదేశదుస్థితిన్॥ ౧౨౭

వితరణబుద్ధిగల్గు సువివేకులు నిర్ధనపాళి కార్యముల్
సతతముదీర్చుచుందురతి సంతసమందుచు దిప్పకెప్పుడున్
ధృతిధరియించి డెందమున దీనులజూచు దయార్ద్రచిత్తులై
వెతలసహించలేరు నిరుపేదలుబొందెడి వానిగాంచుచున్॥

దెలియగలుబ్ధ(లోభి)తత్వమును దివ్యతరంబుగజివ్వాయందునన్
నిలచి నిజామురాష్ట్రమున నిర్మలమొప్పగ వృత్తపుంజముల్
బలుకగజేసినావు ధర భారతి ధాతసతీకృపామతీ
పలుమరు వేడ్కతోజదువుభారము సోదరపాళిదేగదా॥

కులజులజేర్చవర్తకము గుట్టుగ్రహించిన మోసమంచు న
న్యులగనిజేర్చులెక్కలను యుక్తులునేర్చినమీద నెక్కుచున్
దలపయినన్గలైజేతురు సదా కుటిలంబున సంచరించగా
గలుగదె ముప్పునీతిగలు గంసరి (దగు) వారలుజిక్కకుందురా



నిలచి విదేశవర్తకులు నేర్పున సర్వము మ్రింగుచుండినన్
దెలసియు దానికడ్డుపడ ధీరములేకను వారిపట్టునే
బలుకుచు నైకమత్యమును బాడొనరించుచు భారతావనిన్
మలమలమాడజేతురిది మంచిదె వర్తకసంఘమంతయున్॥

కూడునొకప్పుడున్ ధనము కోటులు లక్షలు వేలు వందలున్
జాడనెరుంగకుండ జను సర్వము నాశనమౌచు నెప్పుడో
నేడు ధనీకులౌచు నిల నిక్కెడువారలు రేపు బిచ్చముల్
వేడెడివారి జూచుచును వెఱ్ఱితనంబును వీడరేలకో॥ ౧౩౧

కర్వున బీదసాదలను గాచుచు రూకలనమ్మకెంతయున్
సర్వుల సేమమే తనదు సంపదగానెద కోర్కెవెట్టుచున్
గర్వములేక పెద్దలను గాంచి ముదంబున సేవజేయుచున్
శర్వునిబూజసల్పుచు యశంబును గాంచగ ధర్మమార్గమౌ॥

నీచులటంచు పంచముల నీడయు సోకగరాదటంచు వే
బీచమడంచి కష్టముల బెట్టిన యుత్తమజాతులిప్పుడే
యోచనజేయగావలసి యుండెను మేలగు మానసంబునన్
జూచిన కాలమానముల సూచనలెల్లను తేటతెల్లమౌ॥

ఒకసమయంబునన్ధనికులుత్తములట్టుల రాజపుంగవుల్
ప్రకటితగౌరవంబునకు పాత్రులుగా నొనరించి మెచ్చినన్
నొకపరి బీదసాదల మహోన్నతధర్మవిధానసూత్రముల్
సకలముబల్కియుండుటలు సర్వబుధేంద్రులెసాక్షియౌగదా॥

వచ్చెడివేళలక్ష్మి కలుగు వంటగు మోహముగజూపివచ్చెడిన్
ముచ్చటదీర్చిపోవుతరి ముద్దికజూపుచుబోవు నందుచే
యిచ్చెదలంప రివ్వరు మహీనుణవంతులు జూడనాత్మలో
కుచ్చితబుద్ధిపాపముల గూర్చునుకీర్తినెసంగు నేరికో॥ ౧౩౫

సాయము గోరివచ్చినను సత్కవివైశ్యుల వేడనట్టులన్
జేయనధర్మమంచు బుధ శేఖరులౌనను ధీరభావులై
శ్రీయుతులందుకొందరు విశేషములన్వచియించె జూడడీ
న్యాయమదెట్టిదోచదవు నాశనమై కులమంతరించదా॥ ౧౩౬

కురియును వర్షమెల్లెడల గుంటలజేరిన నీరమంతయున్
నరులుసమస్తజీవము లవారలమున్గొని దప్పికార్చు నా
సరణిధనంబు నీశ్వరుడు సర్వులకంచును బంప నొక్కడున్
బరగుసమస్త మానవులు బాధ్యులుగైకొన వృద్ధిజేయగన్॥

తెడ్డెడుజావనైన మరి దృప్తినొసంగదు బీదవారికిన్
బిడ్డలనివ్వకచ్చటను బెంచుధనంబులు కోట్లకుద్దిగా
దొడ్డగుణంబులున్నయెడ దూరమొనర్చును దర్శ్యరాశికిన్
చెడ్డతనంబు బ్రహ్మకిది జేయును సుందరుల న్ననాథలన్॥

మేడలుగట్టినన్ సుఖము మించదు మృత్తికమేల్గుణంబులన్
నీడలుగావు వృక్షముల నిర్మలహాయినిగూర్చ సౌధముల్
జాడలెరుంగ బుట్టుకల సర్వజనంబుల కొక్కమార్గమే
పాడెలెబోవువేళ ధన పాళికి బీదలకెల్ల ధాత్రిలోన్॥ ౧౩౭



పైరులవేసిధాన్యముల పంటనొనర్చక రైతులెంతయున్
సారపుభూములెల్ల దగ సాధనజేసి పుగాకువైచుచున్
సారెకుతిండికై ప్రజల చావగజేయుచునుండె జూచుచున్
నేరుపుతోడ వద్దనుచు నీతినిదెల్పరు ధారుణీధవుల్॥

మత్తుపదార్థముల్గొనగ మానవజాతికి బ్రహ్మవ్రాసెబో
సత్తువనెల్లదీయుచును సత్యము దూరమొనర్చి భూరియా
పత్తులబొందజేయుచును పాపములన్బడవేసి సత్వరన్
మిత్తినిగూర్చుచుండె నృపమేటులు తప్పనిజెప్ప రేలకో॥

కాయమునందు నెత్తురును గైకొని బీనుగ జేయునట్టి గం
జాయిని త్రాగవద్దనిన సాలుకు లక్షలుకోట్లుగూర్చు సా
రాయమువల్లటన్న నల బ్రాందిని గ్రోలగరాదటన్న నే
వాయుగుణంబొ? వారినిల బాధలపాలొనరింతు రీశ్వరా॥

ఘనుడగు సార్వభౌముడు సుఖంబెటులుండిన దేశమందునన్
జనులభివృద్ధినొందుటకు సంతసమందుచు నుండెగాని జీ
వనముల కష్టమున్గనడు వన్యములైన నొసంగవల్లగా
దను నికనెట్లు బిడ్డలను దన్పగజాలుదు రేమి ధర్మమో॥

భూముల నెల్లధాన్యముల పూర్తిగపంట నొనర్చునట్టులన్
వేమరుసేద్యపాళికిల విత్తగబల్కగ నోరురాదొకో
పామరమున్ ఘటించి గురుపాపముగూర్చు పుగాకుపత్తినిన్
వేమరునాటుచుండుటకు వేడుకజెందుదు రేలనోధరన్॥

జాస్తిగభూములున్నవని సల్పగసేద్యము బీదవారికిన్
శిస్తును నిర్ణయించి గురు జీవనమానటు లేలజేయరో
ప్రస్తుతకాలమందటుల బట్టియొనర్చక నున్నభూప్రజల్
పస్తుపరుండగావలసి వచ్చును యొక్కరిసొమ్ముగాదిలన్॥

గాంధియుగంబునన్ జనిన కాలము మూడవవత్సరంబు ని
ర్బంధనమా చలిజ్వరము బాధలనొందినవేళ దిద్దిరిన్
గ్రంధి సువంశజాతుడను గన్గొన బస్వయనందనుండ నే
బంధుర తేజ దీనజన పాలన వెంకటసుబ్బరాయుడన్॥ ౧౪౬

సర్వేజనాఃసుఖినోభవంతు.
శుభంభూయాత్.

శ్రీ.

క్రీ॥ శ॥ 1923 డిశంబరు నెలలో కాకినాడలో జరిగిన 38-వ దేశీయ మహాసభలో జదువుటకు వ్రాయబడిన పద్యములు. వ్యవస్థాపకనందున క్రీ॥ 24 జనవరి 8 తారీఖున శేట్ జమునాలాల్, బ్యాంకరు శంకరులాలు, మగన్‌లాల్‌గాంధి, మధురాదాస్ పురుషోత్తమదాసుగార్లు గుంటూరుకు విచ్చేసినప్పుడు చదువబడి యుండెను.

దీనులబ్రోచువారల సుధీరుల సత్కవి లోకమాన్యమా
లానల దేశభక్తుల కులంబుల గణ్యతగాంచువారలన్
మానవసేవకాపరుల మానధనాఢ్య మహాత్మశాంతులన్
జ్ఞానుల నిచ్చునెవ్వడు నిజంబుగ నాతడు బ్రోచు నీసభన్॥

హాయిగ సౌఖ్యములొసగ నాళికిగూర్చక కష్టబెట్టు యా
బోయరులన్ గ్రమంబుగను బుద్ధిని ద్రిప్పుచు మేలొసంగి యా
హాయన భారతీయుల జయంబును బేర్కొన కాకినాడ దే
శీయమహాసభాస్థలి విశేషయశంబునుగాంచి మించెడిన్॥



రసపుష్టినదరార విద్యల సదారంజిల్లగా దేశజుల్
అసహాయోద్యమతత్వమున్దెలసి వహ్వాయంచు హృద్వీధి సం
తసమున్గాంధి మహాత్ముడందగ తిర స్థాయిన్ జగత్కర్త కాం
గ్రెసునన్ సల్పినకాకినాడ పురికిన్ శ్రేయంబులన్గూర్చెడిన్॥

నెం 396 ర కాంగ్రెస్ సైనికునిగా నుండియుంటిని 28-12-23. 8-1-24 గుంటూరులో జరిగిన సభలో జదివిన పద్యములు.

బొంకక నెల్ల కార్యముల పూనికతోడ మహాత్మగాంధి కే
శంకలులేక భక్తియుత సాయమొనర్చుచు నున్నధీరుడా
శంకరులాలు బ్యాంకరుని సర్వశుభంబులొసంగి వేడ్కతో
శంకరుడోముగాత నని శంబు కృపారసదృష్టిగాంచుచున్॥

క్రమజాతీయ పతాకరక్షణ మహాకార్యంబుసాధించి యు
త్తమధీరంబును భారతావనికి బాధల్బొందుచున్ జూపి శాం
తముజాటించెనో గాంధి యుబ్బగమదిన్ త్యాగంబు నన్నట్టి శేట్
జమనాలాలు బజాజునీశుడు దయన్ సంతోషినిన్ జేయుతన్॥

తలక్రిందౌనటు మిల్లులన్నియును ఖద్దర్జేసెనో దానికే
బలమున్ గూర్చుచు కష్టపుంజముల సంభావించకన్ జూచునా
లలితాత్మున్ గుణకంధి వైశ్యుని మగన్‌లాల్గంధి నెల్లప్పుడున్
గలుగన్ జేసెడి దేశసేవహిత భాగ్యంబుల్ హితుల్మెచ్చగన్॥

శ్రమపడి ఖాదినిర్మితము సాధనజేసెడి గౌరవంబు ను
త్తమమని దాల్చిశక్తిని సదా జరియించుచు వేడ్కమీర యు
ద్యమమున నిల్చెనో మధుర దాస్పురుషోత్తమదాసునెప్పుడున్
విమలయశంబు గూర్చుచు నవీనబలంబు రమేశు డిచ్చెడిన్॥

2-3-23 తారీఖున కుగ్గురు చికిత్సాలయ సహాయచికిత్సకురాలగు శ్రీమతి పారమాంబ స్వదేశమగు మలబారు వెళ్ళునప్పుడు గౌరవార్థమై గావింపబడిన సభలో జదివినది.

శ్రీరమణీయమౌ నఖిల జీవులనెల్లను బ్రోచువాడు వి
స్తారకృపారసంబున న జస్రము భక్తులనెంచువాడు సం
సారము నేమ్మువారలకు చక్కగ నందనివాడు శౌరి శ్రీ
పారమ సోదరీమణి క పారసుఖం బొనగూర్చి గాచెడిన్॥

చాటుపద్యము.

సీ॥ ఏనుగుల్గని పచ్చి పీనుగులైనను
ధనములర్పింతురు దాతలట్ల
కోపమువచ్చిన శాపించుననిభీతి
వందలర్పింతురు గుండిలోన
పీఠమూర్తులజూచి బెదరుచు మనముల
వేలోసంగుదురు ప్రవీణులగుచు
మాయతంత్రంబుల మంత్రికి మరుమాట
జెప్పలేకను డబ్బుజేర్చుచుంద్రు

గీ॥ సతులచే నూలుదీయించు గతులులేక
దేశవస్త్రంబులనుగట్ట నాశవదలి
తిలకునిధికిని కాసివ్వ తెంపులేక
యతులకెట్లిత్తురో వైశ్య తతులు భీతి॥



రుధిరోద్గారి సంవత్సర ఆశ్వయుజ శు 3 లు శ్రీ శ్రీ పుష్పగిరిపీఠాధిపతులు లరుదెంచినపుడు చిల్కలూరుపేట వైశ్యులగూర్చి వ్రాసిన పద్యములు.

సాటువులన్వచించుచును సత్యమసత్యములన్ గ్రహించకన్
బూటకవర్తకంబులను ప్రొద్దులుబుచ్చుచు బుద్ధియందు నా
బోటులుదెల్పవచ్చినను మోటుతనంబునుజూప చిల్కలూ
ర్పేటనివాసులార ధర పేరుప్రకాస్తియె పెద్దలెంతురే॥

స్వామికి వేలోసంగగను సంచులదీయుచునుంటిరేదగన్
యేమివినాశకాల మిటులేర్పడె మర్మముజెప్పబూన మీ
ధామములందు నిల్పుచును ధర్మవిధాయక సత్కారంబులన్
ప్రేమనొనర్చకన్ పయిగ బెట్టుచు పస్తులబంప బాడియే॥

లేదని జెప్పిబంప నవ లీలకులస్థుని జేయవచ్చునే
వాదునులేదు నాదయిన వచ్చినకార్య మదెట్టిదో వినన్
మోదముజూపకెంతయును మూర్ఖతనంబును బూనమేలె స
త్సోదర భావమెంచకను జూచితిరన్యునిభంగి పెద్దలై॥

వచ్చినవర్ణబంధువు న వారితలీలగ సత్కరించకన్
యిచ్చకమాడి మీరుగని హీయునినవ్వగ పండ్లుబైటికే
వచ్చును దాన నష్టము ర వంతయుగల్గదు కీర్తిబోదు యీ
పిచ్చితనంబునున్వదలి పేరునుగాంచుడు వైశ్యసోదరుల్॥

కులజుని సత్కవీశ్వరు న కుంఠిత మోదముతోడ నిల్పుచున్
పలుకులనాలకించకను బంపితిరేలొకొ భోజనంబు నే
వలననుగూర్చరైతి రిది వైశ్యులువిన్నను నవ్వకుందురే
కలుములు శాశ్వతంబు లిల గావు కవీశ్వరుడంచు నెర్గరే॥

అన్యులు గారు కొందరు ధనాధిపులెంచగ నాదుమాని కాం
డిన్యసగోత్రజుల్విమల డెందముల్ పరమాదరంబులన్
గణ్యతగాను బంపకను గండ్రతనంబును జూపితీరు యే
పుణ్యము వేలువందలును బోసితిరే యతికే భయంబునో॥

దిట్టినవారిపూజలను దృప్తినొనర్చరు నీచులైన నే
కట్టును జేయకన్ననక కాలముకర్వును వేలరౌప్యముల్
పుట్టిమునింగినట్టులను బోసితిరే యతికిన్ వృథాగనన్
గిట్టదు బెట్టగాయతిథి కిన్దగ నారకమందు గూలినన్॥

వైశ్యకాండో ఎక్కల చెంగల్వరాయశ్రేష్ఠిగారిని గూర్చిన పద్యములు
25—1—23 వరంగల్లు.

బల్లిదులెల్ల మెచ్చగను బాహుబలంబు శరీరసాధనం
బెల్లను జూపినావు తర మేరికిగాదు వచించ వైశ్యులన్
తొల్లిటివారలందిటుల దోర్బలశాలురు గానుపించరీ
మల్లతనంబునందు నల మారుతిసూనుని బోలువాడవో॥

సీ॥ అనుపమశక్తితో నినుపగొలుసునుద్రెంప, సామర్థ్యమును గాంచ జాలినావు
బారువులెనిమిది బరువుగల్గినశిల, నిలపి వక్షంబున గెలచినావు
బండిలో మనుజుల నిండుగానెక్కించి, యెడలపై లాగగా నోపినావు
బల్లలపైబండి బండ నేవురునిల్వ, భారంబుమోయగా బరగినావు
గీ॥ చీట్లపేకను యొకసారి జించివైవ। గా కరాంగుళులను పట్టు గాంచినావు
అహహ దేహపరిశ్రమ మందినావు। వైశ్యకాండోయటంచని వరలినావు॥

ఆతతమౌ పరిశ్రమము లందలరారితివంచు బల్కగా
బ్రీతిని జెందు నూరుజులు భేషనిమేటి బలీయులెన్నగా



ఖ్యాతిగడించి మించితివి గా భరతావనిగల్గు దెన్గునన్
జాతికి వన్నెదెచ్చితివి చక్కగ యెక్కల చెంగయాహ్వయా॥

సీ॥ భారతావనినెల్ల పర్యటనమొనర్చి, పతకంబులను పెక్కు బడసినావు
భాగ్యసంపన్నులు పార్థివోత్తములరు, దండగా గౌరవ మందినావు
చలియించకనునిల్చి జనుచున్న మోటారు, నాపుటలో శక్తి జూపినావు
శిరమున శిలనిడి బరువుదెబ్బలు గొట్ట,కదలని బలమును గాంచినావు
గీ॥ విరివిగ పరిశ్రమలజూపి పేరుగాంచి। దేశమునకెల్ల కీర్తినిదెచ్చినావు
యింక కొందరవైశ్యుల నిటులదేల్చ। శ్రేయమగునిల యెక్కలచెంగయార్య॥

గీ॥ సంస్కృతాంధ్రాంగ్లభాషల సర్వకళల
విజయులైనట్టి వైశ్యప్ర వీణులుండి
యుండె మల్లతనంబునం దుండరెవ్వ
రా కొరంతను దీర్చితి వయ్య నేడు॥

దేశభక్తుల నెదురించినవారిని గూర్చిన పద్యములు.

శ్రుతిధర్మంబులవెల్లడింతుమని వాక్పారత్వముల్ జూపుచున్
సతతంబున్పరదూషణంబు నెదమోక్షంబంచు భావించి దు
ర్గతులన్ జూడక గాంధిమౌనివరునిన్ గంగాధరున్ దూఱు దు
ర్మతులెట్లొప్పుదురెంచ పూజ్యులగుచున్ మాసోదరుల్గాంచినన్
తమసిద్ధాంతమెశాస్త్రయుక్తమనుచున్ తార్కాణముల్ జేసియ
క్రమమౌనంచు తదన్యబోధహితవు ల్కౌటిల్యులై జెప్పి మో
సముగావింతురు వారిసోదరులు లక్ష్యంబెంతయున్ జేయకన్
సమతత్వంబున సూక్ష్మధర్మచయమున్ సాధించనాసత్యమున్

హితులంచు న్గురులంచు బెద్దలని దామేమేమియుఁ జెప్పినన్
గతులన్ జూపుచు నైకమత్య మెలమిన్ గాఢంబుగా గూర్చి భా
రత దాసత్వవిముక్తి సూత్రముల దుర్వారంబుగా గాంచి స
మ్మతి బోధింతురొ వారె సద్గురువులౌ సన్మానముం జేయగన్॥

క్రమముగ ధర్మశాస్త్రముల గాంచియు జూడక దేశకాల పా
త్రములను పూజ్యనీయుల వృథా నెపమెంచుచు గొల్చితంచు గ
ర్వమునవచించు పండితుల వాదనలెవ్వరు జూడబోరు భే
దము గలిగించకష్టమె సదాగుణశూన్యులు పాకయాజులై॥

గీ॥ సర్వ సమభావ మొప్పెడి సాధుపుంగ
వులను దూషించు వారలె ఖలులు రాక్ష
సాధములటంచు దెల్పెడి బోధవినరె
గాన వారల బూజించ మానవలదె॥

సీ॥ ధనములకై కన్య లను విక్రయించెడి, పద్ధతినాపెడి బుద్ధిలేక
బెట్టి పటంబుల బెండ్లిండ్లుగావించు, దారి వద్దని జెప్ప నోరులేక
నాంగ్లేయవిద్యల నభ్యాసమొనరించు, విద్యార్థులకు దెల్ప వీలులేక
జపతపంబులమాని సంధ్య నెరుంగక, దిరుగువారల మది ద్రిప్పలేక

గీ॥ బ్రహ్మచర్యవ్రతంబుకై పాటుబడక। స్వకులకర్మల వివరించ శక్తిలేక
దేశభక్తుల నిందించు తెరవుద్రొక్కు।పాకయాజులుకొందరు ప్రాజ్ఞులౌచు॥

సీ॥ లెక్కకుమించిన పెక్కుభేదంబులు, వర్ధిల్లిమించె నే వర్ణమందు
కన్నియ కిద్దర కాంతలనొడగూర్చి, వాదంబులాడు నే వర్ణమందు
తగవులాటలగూర్చి ధనమునుగైకొని, బాధలుబెట్టు నే వర్ణమందు
సత్యమార్గంబుల సంచరించుటమాని, వర్ధిష్ణులైరి యే వర్ణమందు
శాస్త్రవిహితముగాని సకలకార్యంబుల, భారంబుబూను నే వర్ణమందు



గీ॥ నట్టికులమునబుట్టి కర్మాభివృద్ధి। జేయలేకను పండిత శ్రేష్ఠులమను
పాకయాజులు భారత భక్తవితతి। పైకి వెడలగబూనిరి ప్రాజ్ఞులౌచు॥

సీ॥ అన్నవిక్రయముల నాచరించెడివారు, పాపులే ? శాస్త్రము ల్బలుకనెట్లు
సంధ్యముక్కలులేక జంధ్యాలుదాల్చిన, బ్రాహ్మణులగుదురే బారజూడ
జపతపంబులుమాని జరియించుచుండిన, బాపలెట్లగుదురో జూపవలదె
కాఫిహోటులుబెట్టి గణియించవిత్తము, జన్నిగట్టులకును యున్నతెలివె

గీ॥ వర్తకంబు నొనర్చెడి వారలెవరు। సర్వవృత్తులబూనెడి సరసులెవరు
నౌకరులొనర్చు ఘనులుగ న్నట్టులెవరు। దెల్పవలె పాకయాజులు ధీరమూని॥

శుష్కవికార వాదనల జూపుచు నార్యులపైకి బోవుచున్
దుష్కరమైన మార్గముల ద్రొక్కుచు మేలగు నిష్టబూనకన్
లష్కరు పట్టణాదులను లాభముబొందుచునున్న ధాత్రిలో
నిష్కపటంబుతో దిరుగ నేర్పుగదా బుధవర్గ మెంచగన్॥

పెద్దలధిక్కరించుచును బేరుప్రకాస్తికి వచ్చిరాని యా
సుద్దులతోడ వాదనలు జూపినశక్తిని మెచ్చనేర్తురే
యొద్దిక దేశకాలగతు లొప్పగగన్గొని ధర్మమార్గమే
ప్రొద్దున బల్కుచుండవలె బూనియదార్ఢ్యము మానసంబునన్॥

ఓరుగల్లులో కన్యకాముద్రణాలయమును ఆశీర్వదించిన పద్యములు. 1922 సం॥

శ్రీపరమేశు డవ్యయుడు చిన్మయు డద్రిగుహాంతరాళ స
ద్దీపితు డాదిమూర్తి గురు దివ్యవిలాసుడు నిర్వికారుడా
తాపసవందితుండు గుణధాముడు భారతభక్తపాలదీ
ప్తాపరు డెల్లకాలమును కన్యకముద్రణశాల నోమెడిన్॥

నిరతము దేవబృందములు నిర్మలచిత్తమునందు భక్తితో
పురహరవిశ్వనాథ శివ భోగివిభూషణ దేవసోమశే

ఖరసితికంఠశూలియని కౌతుకమొప్ప నుతింతు రాదయా
కరుడిల వృద్ధిజేసెడిని కన్యకముద్రణ మందిరంబునన్॥

మునివరులెల్ల జిత్తముల ముక్తినిగోరుచు నెల్లవేళలం
దున భజియింతు రెవ్వని చతుర్భుజుగా వనమాలిధారిగా
ఘనుడల విష్ణుమూర్తి చిర కాలము కన్యకముద్రణాలయం
బును కరుణామయుండగుచు బ్రోచెడి వృద్ధినొనర్చి ధారుణిన్॥

మణియపవాదుబాపుకొన మాధవుడేవ్రత మాచరించెనో
మనమలరంగ నట్టి సుర మాన్యుడు పర్వతరాజపుత్రి నం
దనుడు చతుర్భుజుండు గుణ ధాముడు విఘ్నములెల్ల బాపుచున్
కనికరమొప్ప బ్రోచెడిని కన్యకముద్రణ దివ్యగేహమున్॥

బలిమిని పాలసంద్రము సుపర్వాసురారులుద్రచ్చ నందు నే
వెలదిజనించె వద్మమున విశ్వధరుండు వరించి మించ నా
కలుములనాతి ప్రేమగని కన్యకముద్రితసద్మమెంతయున్
విలసితమొప్ప జేసెడిని బెద్దల దీవనలంది మిన్నగన్॥

ఆంధ్రపదనిదానసైఘంటికమున కొసంగిన యభిప్రాయపద్యములు.

వివిధార్థంబులదెల్పుకావ్యముల ప్రావీణ్యంబునన్ తూముపం
శవిభూషుండగు రామదాసుసరవిన్ సాధించి యాంధ్రంబునన్
కవితాకన్య నలంకరించె రసయుక్తంబొప్పగా మిత్రవిం
ద వివాహంబును వాక్యసత్పటిమ మేధావంతు లౌనౌనన్॥

గీ॥ సిరివిగాజూపె నాచతుర్విధకవిత్వ
ములను రసముల నందందు ముఖ్యముగను



జిలికె వర్ణనములపెక్కు బలికె భావ
యుక్తముగ సర్వవిద్వాంసు లొప్ప నహహా॥

సీ॥ నూత్నయత్నమునాడె నుడివెను రుక్మిణీ, కల్యాణమును యక్షగానముగను
హరిచరిత్రము బొందు పరచె భక్తిని గోపీ, కావిలాసమున సుకరముగాను
రచియించె నర్ధవా రమునందు శ్రీకాళి, దాస నాటకము సెబాసనంగ
తెనుగునందు కొరంత దీర్చెను యాంధ్రప, ద నిధానమును పద్య తతినొనర్చి
గీ॥ యహహాయేమని చెప్పగా నగునుతూము। రామదాసునిభూరిధా రాళకవిత
మాధురినిజూడ పండిత మండలికిని। సంతసంబును గూర్చదె శబ్దవితతి॥

ద్విపదలు పద్యకావ్యములు దివ్యతరంబుగ వ్రాసిబాసి మో
క్షపదవిగాంచె సత్కవులు గాని నిఘంటువు లల్లరైరి పె
క్కుపదములేరి పద్యముల గూరిచి భాషకుమేలుజేసె నాం
ధ్రపదనిధానమున్ధరణి వ్రాసి హితంబుగ తూము రామదా
సు పరముకేగె ధన్యుడయి శోభిల దిక్కుల కీర్తినింపుచున్॥

గీ॥ దానధర్మము లొనరించు దారిగనక
ధనికులెందరొ చనలేదె ధాత్రివిడచి
నామముల దల్చరెవ్వరు తూమురామ
దాసుపేరు నశించునా దలచనట్లు॥

వివాహములందు వధూవరుల నాశీర్వదించిన పద్యములు.

సీ॥ వ్యక్తిస్వతంత్ర్యమా సక్తిబోధించు ప్ర, కాశముబోలిన గతినిగాంచి
యాంధ్రసంచికల భా షాభివృద్ధినొనర్చు, నాగేశ్వరాఖ్యుఘ నంబుమించి
దేశభక్తినిబూని ధృతిజూపినట్టి కొం, డా వెంకటప్పయ్య సేవనలరి
పంచమవృద్ధికై పాటుబడెడినల రంగము శ్రేష్ఠితె రంగుమీరి

గీ॥ సంస్కృతాంధ్రంబులందుఁ బ్రశస్తిదాల్చి । నట్టియుమ్మేయలీషామహాశయునల
శ్రీనసీరుమహమ్మదు చెలువుదాల్చి । వృద్ధినొందుడు ... ...

సీ॥ వెరువక నాంగ్లేయ విధులనుల్లంఘించు, సావిత్రిదేవిస చ్చరితమెరిగి
నూలుదీయుచు మనస్త్రీల ధర్మంబని, దెల్పు సరళాదేవి తెలివుగాంచి
గురుపతియాజ్ఞల శిరసావహించిన, కస్తూరిభాయిని గారవించి
భర్తబూనినమహా ప్రతినకు తోడైన, లక్ష్మిబాయాంబ విలక్ష్యమెంచి
దేశకష్టంబుల దీర్చబూనిన జాన్సి, వాసిలక్ష్మిబాయి పస్నెదాల్చి
గీ॥ గాంధిబోధనలెల్లను గారవించు । శ్రీమతి పొణకా కనకాంబ చెలువుబూని
బరగుదేవేళ ధాత్రిని ... ...

సీ॥ ఆలిసోదరగుణ జాలంబులనుగాంచి, దేశసేవ నొనర్చ దెలియుమయ్య
మతసమానంబుస మ్మతి జూపునట్టియ, జుమ్మలుఖాను మార్గము బూనుమయ్య
భాసిల్లుమోహన దాసు కరుణచందు, గాంధిబోధనలను గాంచుమయ్య
భావంబులను దేశ బంధు లాలాలజ, పతిరాయిమార్గంబు బడయుమయ్య
గీ॥ వేలు లక్షలు గడియించు వృత్తిమాని । ప్రజలసౌఖ్యంబుకైబూని పాటుబడెడు
చిత్తరంజనదాసు స చ్చిత్తమటుల । ... ...

వైశ్యుల బోల్చిన పద్యములు.

సీ॥ ఛత్రపతి శివాజి సద్గురుడెవ్వడా, రామదాసుని గుణ రాజిదాల్చి
బరగు పండితరాయ బిరుదు వహించిన, వెంకటార్యునిబోలు విద్యనలరి
సప్తసంతాన ప్రశస్తివహించిన బచ్చురామేశార్య స్వేచ్ఛమించి
కంచిలో ధర్మము ల్గావించినట్టి య వచిదేవ తిప్పని వాసిమెంచి
గీ॥ ఆంగ్లనైఘంటికంబు ల వార్యముగను । వ్రాసినటువంటి పాలూరి వంశకర్త
యైన శంకరనారాయ ణాఖ్యుబోలి ... ...



సీ॥ విలువిద్యలోన ప్రావీణ్యతగాంచిన, బ్రహ్మగుప్తాఖ్యుని ప్రజ్ఞమీరి
భాసురబ్రహ్మజి జ్ఞాను మోహనదాసు, కరుణచందూగాంధి గారవించి
దేశబాంధవుడౌచు తేజరిల్లెడి లాజ, పతిరాయి కెనయైన ప్రతిభదాల్చి
వైమానవిర్మిత వాశిగనిన శిరాం, వెంకటసుబ్బయ్య విధులగాంచి
గీ॥ వెలగి యాత్మూరి లక్ష్మినృసింహసోమ । యాజివలెకర్మలనుబూని రాజిలుచును
వృద్ధిజెందుము. ... ...

గీ॥ చంద్రమతి సీత సావిత్రి చరితములను
జదువుచును మేలుగోనముల సరణిగాంచి
భర్త కనుకూలవతియౌచు బరగవమ్మ

... ... ...

సీ॥ వడకిన నేల్నూలు వస్త్రంబులను వధూ, వరులు ధరించగా గఱపుడయ్య
నేతధోవతులనే ప్రీతి సమర్పించి, పండితపూజల బఱపుడయ్య
పూలపాలకులంచు బోయక విత్తము, బీదలకన్నంబు బెట్టుడయ్య
వైవాహికములందు వారాంగనలబెట్ట, మంచిదిగాదని యెంచరయ్య
గీ॥ ఆలయములందునే యెడ నన్యదేశ । వస్తువుల వాడదగదను వాక్యములను
బోధజేయంగ సతతము బూనుడయ్య । బంధువర్గంబులార యో వైశ్యులార॥

సీ॥ శీతాద్రి పుత్రిక భాతిని బ్రీతితో, భర్తకర్ధాంగియై కీర్తిగాంచి
భర్తమార్గములంటి వర్తిల్లు కస్తూరి, భాయిగాంధివిధంబు భక్తినేర్చి
వేదాంతసూక్తుల వెదజల్లినట్టి యా, తరికొండ వెంగమ దారిబూని
శాస్త్రశోధనమును సల్పిన మైత్రేయి, పాండితీగరిమను బ్రౌఢిదాల్చి
రామాయణంబును వ్రాసి వినుతిగన్న, మొల్లమాంబసుగుణ ములను మెచ్చి
గీ॥ ధైర్యసాహసములమించు తరుణి విమల । బోలి వర్ధిలవమ్మ సం పూర్ణముగను
... ... ... ...

కరుణసమస్తలోకముల గాచెడువాడు వెలుంగు తారభా
స్కరహిమధాములన్నడపు శక్తినిగల్గి జెలంగువాడు భూ
వరుల బుధాళిమానవుల వర్ధిలజేసెడి ధీరుడీవధూ
వరులకు మంగళంబిడుచు వాశిజెలంగను బ్రోచి గాచుతన్॥

కవిత్వారంభమునుండి యప్పుడప్పుడు వ్రాసిన పద్యములు.

క్రీ.శ. 1907 సం॥ గుంటూరులో ప్రథమార్యవైశ్యమహాసభయందు ఆతూ్మరి లక్ష్మీనరసింహాసోమయాజిని గురించి వ్రాసిన పంచరత్నములలోని పద్యము. ఇది వారి జీవితచరిత్రము 136 వ పుటలో చూడనగును.

సీ॥ ఎఫ్యేబియేక్లాసు లింపుగా నొసగుచు, పారితోషికముల బడసెబూని
చదివి బియెల్పరీక్షను గెల్చి మిన్నగా, హైకోర్టునన్ లాయరగుచు మెలగి
ప్రాడ్వివాకుండౌచు పార్టీలచేతను, సత్యవంతుడని య శముగాంచె
రాజమహేంద్రవరమ్మున నింగ్లీషు, గురువయ్యె బాలులం దరు నుతింప
గీ॥ నట్టి కారుణ్యసత్పూర్తి యనఘమూర్తి। హారహిమకీర్తిమద్గురు న్యాయవర్తి
వైశ్యకులమణి నాతూ్మరి వంశభవుని। నారసింహాధ్వరిని మది నభినుతింతు॥

సభవారిపద్యములను బ్ర॥ దాను శ్రీరాములవారిని సవరణజేయుమని కోర వారు సంస్కరించి నన్ను జీరి కవిత్వము విడువవద్దు ధారమంచిది ముం దభివృద్ధిజెందగలవని యాశీర్వదించి యుండిరి.

మైసూరు కొప్పరం అప్పారావు శ్రేష్ఠిగారికి వ్రాసిన పద్యములలోనివి.

క॥ త్రిగుణాత్ముండగు శ్రీమ
ద్భగవంతుని కృపను యిచట భద్రింబయ్యా
దగనచ్చట శుభవార్తల
మిగులన్ వ్రాయంచవలయు మిత్రవిచారా॥



క॥ తమరు రచించినసద్గ్రం
ధములను బంపెద మటంచు దప్పని ప్రేమన్
సుమనస వ్రాయుచు నింతకు
సమయంబున బంపరైరి సద్గుణధామా॥

క॥ స్వకులాభిమానిజనులకు
ప్రకటిత దేశాభిమాన బంధుకోటికిన్
సకలార్థ ధర్ములకు మా
మక వందనములను జెప్పు మా గుణధుర్యా॥

పిమ్మట శ్రీమద్భోగనంజుండేశ్వరశతకము, సూర్యశతకము, బాలరామాయణ పద్యములు శ్రీ స్వాములవారి తారావళి పంపించియుండెను.

పరాభవనామ వత్సరమున స్వగ్రామమగు సంబూరిలో విషూచి (కలరా) బుట్టినప్పుడు వ్రాసిన పద్యములలోనివి. శా- శ- ౫౦౦౭

పంచసహస్ర వర్షముల పైనగ సంఖ్యగతించువేళ గీ
ర్తించ పరాభవాబ్దమున దివ్యనిదాఘను శుక్లమందునన్
మించి విషూచిరోగములు మిక్కిలి ఘోరభయంకరంబుగా
దృంచదొడంగె మానవుల ధీరము దగ్గ పురాళి కొన్నిటన్॥

క॥ భిక్షుకులు రారు పురముకు
కక్షులు విడనాడి రేకగర్భజుల క్రియన్
పక్షీంద్రువాహు దలచక
భక్షణమే జేయరైరి భయమెట్టిదొకో॥

గీ॥ తనువు లస్థిరములు ధనము లబద్ధముల్
జయము ధర్మమవని జనులకెల్ల

యిటుల జచ్చు సెరిగి యిలజేయమేకార్య
మనుచు సుజనులాడు కొనుచునుండు॥

కీలకసంవత్సర చైత్ర బ ౮ లు (3-4-1908) స్వర్గస్థులయిన నా యన్న గారిని గూర్చి వ్రాసిన పద్యములు.

సీ॥ కుంభిని కౌండిన్య గోత్రాబ్ధిహిమకరుం,డని వన్నెకెక్కునే ఘనుడుగాంచ
గ్రంధివంశమున సద్రత్నమీతడటంచు, వాశిగాంచెనెవడు వన్నెమీర
న్యాయంబుగాను పంచాయతీలనుదీర్చి, యిరుపక్షముల మెప్పునెతడువడసె
ధనమునం దాపేక్ష దలపున బెట్టక, సదయుడై యెవ్వడు సంచరించె

గీ॥ నట్టి పున్నయవిచక్షుణు డతులధర్మి। సుగుణమణిగణ విభ్రాజ సుందరుండు
యిప్పుడెందులకేగెనో యిహమువిడచి।ముంచి దుఃఖాబ్ధియందున ముద్దుసుతుల॥

సీ॥ కూర్చున్న వేళను గూడును పదిమంది, విన బురాణంబును వేడ్కమీర
జనుచున్నతరి వెంట జనుచుండు కొందరు, సరసోక్తులాడుచు సంతసమున
తనతావునందున్న ఘనవస్తువులగోర, లేదనిజెప్పడు లేమిగనడు
బలువిరోధులనైన బలుకరించుచునుండు, చల్లనిమాటల నుల్లమలర

గీ॥ నట్టి పున్నయ విచక్షుణు నగ్ని దేవు।డేలబాధించి మృత్యువ కేలబట్టి
యొసగెనో ఖేదమయ్యెడి యుత్తములను।దీర్ఘజీవినోనర్చక దివముకంపు॥

సీ॥ ఈదివ్యధర్మిష్టి నీశుండు ధనికుని, జేయడెందులకని జెప్పుచుండ్రు
నీదివ్యపుణ్యాత్ము నీశుడు పూర్ణాయు, వంతుజేయడనుచు వలుకుచుండ్రు
నీదివ్య సుందరు నీశుడన్యాయము, గావించెనని మది గనలుచుండ్రు
నీదివ్యశేముషి నీశుడు మనలోన, సంచరించక నిటు సల్పెనండ్రు

గీ॥ నహహ యీధీరమానవుం డతులసుగుణి।సత్యపథవర్తి వితరణ చారుమూర్తి
కేలనాయువొసంగకశూలధరుడు।మధ్యగొంపోయె నే యేమిమనలబ్రతుకు॥

సీ॥ ఈ తెంపు యీసొంపు యీ పెంపు నీయింపు,యీవైశ్యసన్మణి కెట్టులబ్బె
నీధర్మ మీకర్మ మీశర్మ మాధర్మ, నకు సాటిగా నితని కమరె భువి



నీధైర్యమౌదార్య మీశౌర్య మీయార్య, శేఖరుకెవ్విధి సిద్ధియయ్యె
నీబుద్ధి యీశుద్ధి యీవృద్ధి యీశ్రద్ధ, బాల్యంబునుండియు బట్టువడియె

గీ॥ ననుచు నెవ్వని వినుతింతు రట్టిపున్న।యాఖ్యుడుత్తముడిహమందు నగ్నివాత
బడుచు ముక్తిని జెందెను బ్రాణసతిని।విడచిమేల్ముద్దుబిడ్డల విధియుతంబు॥

సీ॥ ఎవనిమందిరమునకేతెంచి పండితుల్, ముచ్చటించుచు జను మోదమలర
నెవనిమందిరమునకేతెంచి జనములు, వినుచుండు నితిహాస వివరములను
యెవనిమందిరమునకేతెంచి యాచకుల్, దాతృత్వమును మదిదలచి మెచ్చు
నెవనిమందిరమున కేతెంచి పెద్దలు, సత్కారములగొను సరసగతుల

గీ॥ నేనొకటి బూనినెర వేర్చ తానొకపని।దీర్చుచుండును పూనుచు ధీరముఁనను
యట్టి పున్నయ విచక్షుణు డవనివిడచి।యెందుబోయెనో శోకంబు నొందజేసి॥

సీ॥ చదివిపురాణముల్ చక్కగానర్థము, జెప్పగానేర్చెను చెలువుమీర
నిరుపక్షములనొక్క సరణి వీక్షించుచు, తగవుల దిద్దును ధర్మగతిని
పండితులేతెంచ భక్తినిబూజించి, గూఢార్థముల విన గోరుచుండు
కపటంబులేక హృత్కమలంబుననుసదా, యశముసంపాదించె దిశలువెల్గ

గీ॥ తనదు ముప్పదియైదవా బ్దమున పరము।జేరె శోకంబునొందగ చిత్తములను
జనని పుత్రులు మిత్రులు ననుజుడిలను।గుణయుతుండగు పున్నయగుప్తఘనుడు॥

27-12-1909 మైసూరు సంస్థానార్యవైశ్యకాన్ఫరెన్సు బెంగుళూరునందు జదివిన పద్యములు. (సభ జరిగిన ప్రదేశము గవీపురము)

శ్రీసదయాంతరంగుడు వశిష్ఠపరాశర జామదగ్నిస
ద్వ్యాసమునీంద్రవందితుడు భాస్కరకోటిప్రకాశుడాత్మసం
వాసుడు వేదవేద్యు డురు పాలితసర్వజగంతరాళుడీ
భాసిలు బెంగుళూరుపుర వైశ్యమహాసభ బ్రీతి బ్రోచెడిన్॥

గీ॥ జిహ్వాలందున వాసము జేయుచుండి
కవితతికి వాక్సుధాగలు ఘనతనొసగు

చుండు నేదేవి భారతి శోభగులక
వర్ధిలనొనర్చుగాత సద్వైశ్యజనుల॥

సీ॥ తనదేశజుల కెల్ల తండ్రిగానొప్పుచు, సేమముల్గోరునే శ్రీకరుండు
పండితమండలి ప్రజ్ఞలుజూపింప, బోషించుచుండునే బుధవిరాజి
కవిజనార్థులకెల్ల కల్పభూజంబౌచు, భాసిల్లుచుండునే ప్రాజ్ఞవరయ
ధర్మమార్గములను దప్పక రాజ్యపా, లన మొనరించునే లలితమూర్తి

గీ॥ యట్టి శ్రీకృష్ణరాడ్వడయరుజినియసు।ని మహారాజధన్యుడు ప్రేమగనుచు
వైశ్యజనసభ కోరికల్ వర్ధిలగను। బూనినెరవేర్చుగాత సంపూర్ణముగను॥

గీ॥ అవని మైసూరుసంస్థాన యార్యవైశ్య
సభకు ప్రెసిడెంటుగానున్న సరసుమార్గ
పురము చెంగయ్యశ్రేష్ఠిని స్థిరముగాను
సత్కరింపగ సభికుల సరణిగాదె॥

2-4-09 చంద్రికాపరిణయ గ్రంథమునకై జటప్రోలు సంస్థానాధీశు
డగు రాజా సురభి వెంకటలక్ష్మారావు బహదూర్ గారికి వ్రాసిన యుత్తరము.

క॥ ప్రభుగణదీపిత ధీర సు
రభి వెంకటలక్ష్మరాయ రాయబహద్దూర్
విభవయుపేతక్ష్మాతల
యభిరామాదుష్టశిక్ష యరిజనభీమా॥

సాంద్రయశఃప్రకాశ రిపు సామజసింహగభీరసాగరా
చంద్రమయూఖ యర్థిజన చాతకపాతకదూరధీర రా
జేంద్ర దయాంతరంగ దివిజేశవిలాస విచారసజ్జనా
చంద్రిక పర్ణియంబొకటి చక్కగబంపుడు నాకు నిత్తరిన్॥



గీ॥ సౌమ్యవత్సర చైత్రమాసంబు శుక్ల
ద్వాదశి తిథిని భార్గవ వాసరంబు
వ్రాసితిని లేఖ గ్రంధి బ స్వాయసుతుండ
సుబ్బరాయ్‌గుప్తుడను భువి సుజనహితుడ
దివ్యచిత్తంబునకు వేగ దేవలయును॥

రెండవ యుత్తరములోని పద్యము.

ఇదివర కొక్కయుత్తరము యే కడువేడ్కతొ వ్రాసి పోష్టునన్
సదమలచిత్త బంపితిని సన్నిధి కయ్యదిచేరి సంగతుల్
మదిని యెరింగియుండనగు ప్రాపుకుజేరక మధ్యజిక్కెనో
విదితముగాను దెల్పుటకు వీలుకలుంగదు చిత్తగించిరన్॥

ఉత్తరములను కవిత్వారంభమునందు తప్పులుగాయుండినను సంస్థానాధీశులు
యుదారగుణముతో గ్రంధమును బంపియుండిరి.

క్రీ.శ. 1910 విజయనగరమున జరిగిన వైశ్యమహాసభలో జదివిన పద్యములు.

సీ॥ శ్రీకరుణార్ద్రదృష్టిని భక్తకోటిని, సర్వదా బ్రోచునే సర్వసముడు
భువనజాలంబుల నవలీల సృష్టించి, బెంచినడంచునే వేదహితుడు
ప్రళయకాలంబున ప్రజ్వరిల్లుచు మహా, జ్యోతి రూపంబున జూడనెతడు
సర్వముదానయై సర్వమునంటక, సాక్షిగా నుండునే సర్వవిభుడు

గీ॥ అట్టి పరమాత్ము డవ్యయు డాత్మవేది। నిర్మలాకారుడాదిము నిజనుతుడు
వైభవమెలంగ నాలవ వైశ్యకాన్ఫ। రెన్సు బ్రోచుత విజయపు రీవరాన॥

గీ॥ శ్రీగణేశుడు భక్తవ శీకరుండు
గౌరిముద్దుల బిడ్డడు కార్యహితుడు
విఘ్నములనెల్ల జిమ్మచు విజయనగర
వైశ్యసత్సభబ్రోచుత వైభవమున॥

గీ॥ వాణిభారతి కోకిల వాణి సర్ప
వేణి మంజుల భాషిణి విజయనగర
కాన్పురెన్నున గల వైశ్య ఘనుల కెల్ల
వాక్సుధారలొసంగెడి వాశిమీఱ॥

క॥ ఆత్మనివాసుని శ్రీస
ర్వాత్ముని జగదేకవీరు నవ్యయు విమలుఁ
నాత్మ విచారణ జేసెడి
యాత్మ్యార్నరసింహసోమ యాజిభజింతుఁ॥

క॥ వేమూరి వంశతిలకుడు
శ్రీమాఁ తిరువేంగళార్య శేఖరుడుసభఁ
ప్రేమతొ నడుపగడంగుట
శ్రీమీఱదె కాన్పురెన్పు సేమకరంబై॥

తమ యౌన్నత్యముజూపి యెల్లడలబోధల్జేసి యుద్దేశ్యముల్
తమవిత్తంబులనెల్ల విద్యకొఱకై ధర్మంబు లజ్జేయుచుఁ
తమదాతృత్వము మించవైశ్యులిల చందాలిచ్చుచుఁ బూర్తిగా
తమవర్ణంబును వన్నెగుల్కనటులఁ తథ్యంబుగా జూడనా॥

సోమయాజి చరిత్రనాటకమునకు ద్రవ్యసహాయము జేయుట కియ్యకొని సున్నజుట్టిన బొగ్గరగ్రామ నివాసుడు కాకుమాను హనుమయ్యారు వ్రాసిన యుత్తరములోని పద్యములు.

మోసముజేయ కష్టతరమో మదిజూచిన హన్మయాఖ్యశా
బాసుగుణంబు లన్నియును బట్టెను మానసమందు నింతనా
యాసము బెట్టనేల మరి యాదయ గౌరవమా యికెప్పుడుఁ
కాసుకుగాని మాటలచు కల్పనగా వచియించబోకుమా॥

సమ్మతి జెప్పినట్టి కడు సారపువాక్యము లాలకించుచుఁ
నమ్మచు ముద్రణంబునకు నాటకమిచ్చితి తీవ్రపాటునఁ
సొమ్ము ప్రధాన మేయడను జూడగగాదు ధరిత్రి వాక్పృథా
నమ్ము యథార్థము న్దెలిసినఁ మరికల్లలుబల్కబాడియే॥

గీ॥ బావిలో దింపి త్రాడును పైకిలాగి
నట్టు లొనరించితివిగద గుట్టుగాను
కవుల నవమాన మొనరించ గౌరవంబె?
మిత్రమా! జూడుమింకను మేలుగలుగ॥

క॥ కిస్తీ సమయంబుననే
శిస్తుకు పైకంబు దెత్తు స్నేహితులకడఁ
సుస్తిరి జేయక నంపెద
ప్రస్తుత మింతైనలేదు వాసమునందుఁ॥

క్రీ-శ-1910 నవంబరులో కీర్తిశేషుడైన డిప్యూటికలెక్టరు అప్పన సుబ్బయ్యశ్రేష్ఠిగారినిగూర్చి వ్రాసిన పద్యములు.

సీ॥ కష్టించివిద్యల కడువేడ్క నభ్యాస, మొనరించి కీర్తిని గనెనెతండు
చిన్ననౌకరియందు జేరుచునాదిని, ప్రభువులచే మెప్పుబడసె నెవడు
సర్కారు వారికి సన్మార్గములజూపి, యుద్యోగదశలచే యొప్పెనెవడు
సత్యమార్గంబుల సరణిదప్పక మహా, నేర్పుతో జరియించె నియతి నెవడు
గీ॥ వసుధ డిప్యూటికలెక్టరు బనిని వడసి। న్యాయతీర్పులబేరొందె నవని నెతడు
అట్టి యప్పనవంశ దుగ్ధాబ్ధిచంద్రు। డైన సుబ్బయగుప్తుండు జనెను దివికి॥

సీ॥ సత్యసంచారుడ సత్యమూరుండన, నాతని వర్తన మవనిసాక్షి
న్యాయవంతుడుసదు పాయవంతుండని, దెల్పను శాంతమె దివ్యసాక్షి
దుష్టశిక్షకుడు వి శిష్టహితుండన, విడుదల శిక్షలే వెదుకసాక్షి
ఆచారపరుడు దురాచార వర్జితుడ, నగసత్ప్రిలమే నరయసాక్షి

గీ॥ వాదపరులను సద్బోధ భేదపరుల। నణగ ద్రొక్కను ధీరంబె యమితసాక్షి
యట్టిసుబ్బయ శ్రేష్ఠిదానిట్టి యెడను। పరముజెందెను యుద్యోగ పదమువిడచి॥

సీ॥ శిక్షుల వ్రాయను జేతులాడక సదా, పాపంబులకు మది భయముజెందు
నిజము కల్ల లెరుంగ నిర్మల బుద్ధితో, వెదకుచుండును దగ వివిధగతుల
నాత్రము జెందియే మాత్రము తగవుల, తీర్పుల వ్రాయడు దిట్టుననుచు
తప్పుజేసితినంచు జెప్పి క్షమాపణ, గోరిన రక్షించిగుణముదెల్పు

గీ॥ నెట్టివారల సలహాల బట్టడెపుడు। పిన్నవారలదరి కేగి ప్రియముజూపి
చల్లగా నంతుదీసియు సత్యమెరిగి। జెప్పుచుండును తీర్పులు తప్పులేక
నట్టి సుబ్బయ్యశ్రేష్ఠి దా నరిగె దివికి॥

సీ॥ అధికారదర్పంబు నావంతజూపడు, మితభాషణంబుల మెలగుచుండు
నలరించు సుధగుల్కునట్టివాక్యంబుల,దాల్చకసూయ నేతరినయినను
కోపంబుజెందక గుణవంతుడగుచును, దీపించె సదయుడై దివ్యముగను
పక్షపాతంబు నేపట్లను పగనైన, బూనడు మానససూనమునను

గీ॥ తిరుగుబాటునుజేసిన దిట్టెనేని। బూనడెందుల కోపంబు వానిపైన
నహహ వైశ్యకులాబ్ధి హిమాంశుడైన।సుబ్బయార్యుండుస్వర్గముజూడనరిగె॥

సీ॥ సామాన్యపురుషునిచందాన గన్పడు, నింటనున్నప్పుడు హెచ్చుగనక
కసరుచు తరుమడు కఠినోక్తులాడడు, మాట్లాడవచ్చినవారిజూచి
జెప్పినమాట లేచొప్పుననైనను, మరువడెన్నాళ్లకు మానసమున
దిగువనౌకర్లను దిట్టడెన్నండును, క్షమియించు దప్పుల సదయుడౌచు

గీ॥ నట్టిధీవర్యునుంచక నవనియందు। జేర్చుకొంటివె నీదరి శ్రీయుమేశ
న్యాయతీర్పరి మిగుల పుణ్యాత్ముడచట।మమ్ముజేర్చగ మిక్కిలిసమ్మతియగు॥



అప్పనవంశసాగర మృగాంకయశోధరపూర్ణతేజ నీ
గొప్పతనంబు సత్యమును కూరిమి దోర్బల శక్తియుక్తులున్
తప్పులులేని మార్గము నుదారగుణంబుల న్యాయతీర్పులే
చొప్పున బల్కనేర్తుభువి సుబ్బయగుప్త దివంబుగంటివా॥

24-12-10 స్వర్గస్థులైన న్యాయవాది వంకాయల శేషావతారముగారిని గూర్చి వ్రాసిన పద్యములు.

సీ॥ నిత్యకర్మలనెల్ల నేరవేర్చు నెవ్వడు, కాలవ్యవధిలేక కరము ప్రీతి
విద్యార్థిసులగని వేడుకమీరగ, నెతడు సన్మానించు నేర్పుజెలగ
ప్లీడరోద్యోగియై బెంపొందుచుండియు, మతధర్మములనన్ని మానకుండె
చైర్మేనుపదవిని జేకొని జనముల, కష్టసుఖంబుల గనెను కరుణ

గీ॥ తన్నుజేరినపార్టీల తగవులందు। న్యాయవాదన మొనరించు నమితముగను
అట్టిశేషావతారునియాత్మ గలసె। దివ్యమైన యనంతుని తేజమందు॥

సీ॥ ధీవిశేషమునందు ధిషణు సమానుడౌ, యని కొందరాడుదు రవనియందు
ధీరంబునందున మేరునగంబుకు, సరిబోల్చుచుందురు సరసమతులు
ధర్మగుణంబుల ధర్మజుడేయని, బల్కను కొందరు ప్రౌఢిమెరయ
ప్రజ్ఞానమందున బ్రహ్మతుల్యుండని జెప్పును కొందరుజేరి మిగుల

గీ॥ న్యాయవాదనదక్షుడు న్యాయపరుడ।టంచునుతిజేతురాకకొందరార్యులవని
అట్టి శేషావతారుని యాత్మగలసె। దివ్యమైన యనంతుని తేజమందు॥

సీ॥ ఘనవైశ్యకాన్ఫరెన్సున సభ్యులకునెల్ల, నామోద మొనరించె నమితముగను
ప్రెసిడెంటులకు తోడుపడి వ్రాయనేర్చును, తీర్మానముల నెల్లతీరుగాను
యాంగ్లేయభాషకు నాంధ్రశబ్దంబుల సంధించుననువుగా చారుగతుల
బోలుపొంద తాలుకాబోర్డు మెంబరుపని, సాధించె నేర్పుతో చక్కగాను

గీ॥ వైశ్యకులశేఖరుండని వన్నెకెక్కె। వేదకర్మలనొనరించె విధియుతముగ
నట్టి శేషావతారుని యాత్మగలసె। దివ్యమైన యనంతుని తేజమందు॥

క్రీ—శ=1911 లో శ్రీజార్జిచక్రవర్తి ఢిల్లీలో పట్టాభిషిక్తుడైనప్పుడు వ్రాసి
ముద్రించిన ప్రభుభక్తి యను గ్రంధములోని పద్యములు.

శ్రీలలితాంతరంగుడు వి శిష్ట జనంబులబ్రోచు సద్దయా
శీలుడు క్రీస్తుసన్మతవశీకరవర్తన దూరదృష్టి వా
చాల సమన్వితుండతుల శాంతుడు పంచమజార్జిధీర స
త్పాలన మొప్పుగాత బహు భాగ్య సమన్వితమై ధరాస్థలిన్॥

సీ॥ సప్తమ యెడ్వర్డు సార్వభౌముని కెలెగ్జాండ్రాసుతుండౌచుచతురుడయ్యె
మహి కీర్తిగన్న డెన్మార్కురాజోత్తమ, దౌహిత్రుడై గుణధారియయ్యె
ఆల్బర్టు విక్టోరియారాజ్ఞి ధీశాలి, సత్పౌత్రుడౌచును సరసుడయ్యె
వెలదీలలామమౌ విక్టోరియామేరి, ప్రభ్వికి శ్రీమించు భర్తయయ్యె
గీ॥ నట్టి శ్రీజార్జిఫ్రెడరిక్కు యార్కుప్రభువు
పాలనము సర్వభూతల ప్రజకనాథ
దీనులకు కష్టజనులకు దృష్టిలేని
వారికెల్లను క్షేమమై వసుధదనరు॥

గీ॥ అవనికల్యాది గతములు యక్షిచంద్ర
గగనబాణంబు లొప్పిన కాలమందు
శ్రీవిరోధి కృతాబ్దము చెలగు మార్గ
శిరమునన్ కృష్ణసప్తమి జార్జి హిందు
దేశపట్టాభిషిక్తుడై తేజరిల్లె॥

పండితులొద్ద జేరి దగ పాఠనజేయగలేదు విద్య నే
యందయులేక నేర్చితిని నాలుగు ముక్కలు భక్తిమీర పూ
దండలుగూర్చి సంతత ముదంబున పంచమజార్జిధీర భూ
మండలనాథ నీకిదె స మర్పణజేసితి భక్తిమీరగన్॥



(ప్రభుభక్తి వాణీముద్రాక్షరశాలలో ముద్రింపంబడి యుండెను.)
14—8—11 ఎడింబరులో బారట్లా జదువుచున్నపుడు మాజేటి నాగభూషణం
గారికి వ్రాసిన యుత్తరములోని పద్యములు.

మీరు విదేశవాసులయి మిత్రమ ధైర్యముదక్కి లేఖలన్
తీరుగవ్రాయుచున్న నెడ ధీరముగ్రుంగియు గుండెబ్రద్దలై
భూరి విశోకవారినిధి మున్గడె మీజనకుండు తద్వ్యధిన్
వారక నన్నదమ్ములును బందుగులెల్లరు దుఃఖమందరే॥

ఎట్టి రుజల్జనించినను యేర్పడ కష్టము లెన్నివచ్చినన్
పట్టును దప్పకుండుమిక భక్తిని యీశ్వరు నెంచుచున్నొసన్
బుట్టినరోగజాలములు బోవవె దూరములౌచు గాలికిన్
నట్టె మొగుళ్ళు బారుసటు నవ్యవిధాయక విద్యసాధకా॥

ఎచ్చటనున్న దేవుడొకడేకద యీవుగ్రహించెనట్టిదే
యిచ్చటనచ్చటన్మరియు నెచ్చటనైనను నిండియుండి దా
నిచ్చలనమ్ము భక్తులను యీశుడు రక్షణ జేయుచుండు నా
సచ్చరితున్దలంచుమిక సౌఖ్యముగల్గును వ్యాధిదూరమై॥

మాటికధైర్యలేఖలను మానుమువ్రాయుటకట్టె వ్రాయనా
బోటులు వ్యాకులంబు బడి పోవుటగాకను మిత్రబంధుస
త్కోటులు తల్లిదండ్రులిల కూలుదు రెంతయు దుఃఖవార్ధిలో
సాటికులంబువారు మరి సంశయు లౌదురు రాను సీమకున్॥

పుట్టినచోటునుండినను బుట్టవె పేకులు దేహధారికిన్
నట్టెవిదేశమేగక గృహంబున సౌఖ్యము మీరనున్న నె
ప్పట్టున జావకుండిరె ధృవంబుగ ధారుణి చావుసిద్ధమే
గట్టిది యాయువైన యెడ కాలుడు జీవము దీయజాలునా॥

30-11-10 బొర్నిగాజనువున్న మాజేటి నాగభూషణం గారికి వ్రాసిన లేఖలోని పద్యములు.

ఇన్నిదినంబు లుత్తరము నేలిఖియింపక యిన్నకుండుటల్
మన్ననజేసి కోపమును మాని హృదబ్జమునందు బ్రేమతో
దిన్నని చూడ్కులన్నిలిపి ధరను బూనుచు తప్పటంచుమం
దెన్నక మిత్రి బాంధవము లెంచుచు తప్పుక్షమించుమీద్ధరన్॥

తమరిగ్లాండుకు విద్యనేర్పుటకునై గ్రామంబును న్వీడి చి
త్తమునన్ ధైర్యపు తీగెల్లెల్ల నిగురొత్తన్ జేసి మోదంబుతో
డమరిన్నెగిన దాది మీజయమునే డంబొప్పగా గోరినే
స్తము బాటించుచు నీశ్వ్రే[illegible] జేయుచుంటిన్ వెసన్

ఇంకా యెన్నిదినంబులుండవలెనో యేమేమి యభ్యాసమే
వంకన్ జేసితివో విధానమెటులో వ్యాసంబు లేలాగునో
యింకానేమి బఠింపగా వలయునో యెగ్జామిషన్ యెప్పుడో
శంకన్ లేకపరీక్ష దేలుదువె యాచందంబునున్ దెల్పుమా॥

కష్టము కోర్చి శేముషిని గైకొని శాంతముబూని యెల్లెడన్
నిష్టులు మెచ్చలానుగల యింపగు మర్మము లెల్లజూచి బా
రిష్టరువై జయంబుగొని వృద్ధిని జెందుచు భారతావనిన్
తుష్టిని జేర నీశ్వరుని తోరపుభక్తిదలంచుచుంటిగా॥

మీదగు ప్రాణతుల్యులగు మిత్రులకెల్లరికిన్ నమస్కృతుల్
మీదగు బోధలందుగల మేష్టరులందరికిన్ ప్రణామముల్
మీదగు క్లాసునందెగల మేటిధనికుల కెల్ల దండముల్
మీదగు పెంపుగోరుచును మేమిట నెంచుచు నుంటిమీశ్వరున్



30-12-11 తారీఖున అచ్చమ్మపేటకు వేములూరు రామయ్యకు వ్రాసిన ప్రత్తరం.

నీదగు యుత్తరంబు మరినిన్నటిరోజున జేరె తమ్ముడా !
మోదము జెందితిన్ జదివి ముచ్చటయై దనరారె ముద్దులెం
తోదగ మాటగట్టినటు దోచెను గ్రంథములిప్పుడేదగన్
నీదరిజేర బంపితిని నేర్పున పోష్టున నందగాదగున్॥

తమ్ముడ వేడ్కబంపెదను తిప్పక మంచిదిజూచి నీవునే
త్రమ్ముల కందమొప్పగను దాల్చిన వేడియడంగి చల్వలన్
గ్రమ్మసుఖంబొసంగు నది గైకొని కొద్దిదినాల కందగా
సమ్మతి బూని దాల్చుమది సంతస మొదగ మిత్రులందరున్

1911 జూన్ చెన్నపురంబున జరిగిన వైశ్యమహాసభకు గాను వ్రాసిన పద్యములు. యీ సభకు వెళ్ళుట తటస్థించలేదు.

శ్రీకరుణామయుండు బుధ సేవితు డచ్యుతు డాదిమూర్తి సు
శ్లోకుడనంతుడాఢ్యుడరి శోషిత సర్వదిగంతరాళుడ
స్తోకజ యావహుండు కవి సూరిజనస్తుత పాత్రుడుర్విశో
భాకరుడిచ్చు చెన్నపురి వైశ్యమహాసభకున్ శుభంబులన్॥

వరవేదంబుల వాని యంగముల సద్వ్యాఖ్యంబులన్ నాంగ్లవి
ద్యరహిన్ పారనజేసి వేడ్కమిగులన్ న్యాయాధికారత్వమున్
స్థిరతన్ జేకొని పెక్కుయోగములోన ర్చెన్ భక్తినాయాత్మకూ
ర్నరసింహాధ్వరి యాశయంబు లెల మిన్నవ్యంబులై మించెడిన్

ధీయుతులొచు సత్ప్రథను ద్వైత్రిచతుర్థ సభాది పత్యముల్
హాయిగబూని వైశ్యసభ లందును మీర జయప్రదంబుగన్

న్యాయముమీరగా నడపి నట్టిగుణాఢ్యుల నెంతు సుంకునా
రాయణు చక్రపాణి గుణరాజితు కృష్ణతిరుంగ డార్యులన్॥

ఇందుధరేశు డాశివుమహేశుని భక్తివలంచి వేడ్కఁ బెం
పొందగ విద్యలన్ జదివి పూర్ణతరంబుగ కీర్తినెల్లెడల్
జెందిన ధీరుమార్గపురి చెంగయ గుప్తసభాధి పత్యమా
నందకరంబు వైశ్యులకు నవ్యవిధానము లెల్ల దెల్పెడిన్॥

అంచిత మానసుండురుద యాబ్ధినరేశ్వరుడాయశోకునిన్
మించిసమస్తమానవుల మేలుదలంచెడి కీర్తికాముడా
పంచమజార్జిసత్ప్రభువు పాలనమందొనరించు చున్నయీ
పంచమవైశ్య మండలి యపారముగా వెలుగొందునెయ్యెడన్॥

20-5-12 కుంభకోణమున గావింపబడిన వైశ్యమహాసభకు బంపిన పద్యములు.

శ్రీరమణీ మనోహరుడు సేవిత సర్వమునీంద్రబృందబృం
దారక వంద్యుడవ్యయుడు ధర్మవిచారణకర్త భక్తమం
దారు డఖండతేజుడరి దారుణమూర్తి కృపాకరుం డిలన్
వారక కుంభకోణపురి వైశ్య మహాసభ నేలుగావుతన్।

హిమకరశేఖరుండు భుజగేంద్రవిభూషుడు మానిపోషుడా
హిమగిరిజాధినాథు డఖిలేశ్వరు డాగమవందితుండునా
హిమకరువీతిహోత్రదివ సేశ్వరలోచను డాదిమూర్తిసం
భ్రమమున కుంభకోణపురి వైశ్యమహాసభ నేలుగావుతన్॥

ధీయుతుడౌ స్వయంభవుడు దివ్యచతుర్ముఖు డావిధాతవి
ద్యాయతమూర్తి బ్రహ్మకమలాసను డబ్జజు డాత్మయందునన్



హాయిగ కుంభకోణ నగ రార్య మహాసభ సభ్యులందరన్
నాయువొసంగి బ్రోచెడి మహామహిమన్ కృపబూని
[యెంతయున్

గీ॥ పద్మవంశంబునన్ బుట్టి వాసిగాంచి
పద్మనాభాహ్వయముదాల్చి ప్రజ్ఞమీరి
నట్టివాణిజ్య నేర్పరి యైన ఘనుడు
సభకు నాథుండుగా నుండ జయముగాదె॥

తృప్తిగ గేహమున్వెడలి దిన్నగనారవ వైశ్యమండలిన్
యాప్తుడనౌచు జేరి మరి యాదలనొందగనే ప్రయాణ సం
వ్యాప్తత నుండ పిర్దుపయి బాధజెలంగుచు లేచెపుండు వే
ప్రాప్తములేకయున్న విభవంబుల గాంచగ నబ్బునాభువిన్

1-1-13 మంగళగిరి శ్రీశారదామనోవినోదినీ సంగీతనాటక కళాశాలవారు సబుమేజస్ట్రేటు మ॥ రా॥ అప్పన వెంకట్రామయ్యగారి గౌరవార్థమై ప్రదర్శించినపుడు జదివిన పద్యములు.

పక్షాపక్షము లెందుబూనక మదిన్ పాపన్బటంచున్నదా
దాక్షిణ్యంబును బైకిజూపకను సం దర్భంబులన్ జూడకన్
శిక్షల్వేయక న్యాయమార్గమునకై జింతించుచున్నే విశా
ద్యక్షుండొప్పును నట్టి ధీరునకు శ్రేయంబుల్వొసన్ గల్గెడిన్॥

వృథయౌ వాక్యములన్వచింపకను సద్విద్యావిశేషంబుచే
బుధులెంచన్మరి కొట్టుతిట్టులను సంపూర్ణంబుగా న్యాయమున్
విధియుక్తంబుగ బల్కి సజ్జనములన్ వీక్షించునో ప్రేమ నా
యధికారిన్ ఎ.వి. రామగుప్తుని సహాయంబు న్దలంపంగనౌ॥

డంబాచారము జూపక నగ్రిమతో డర్ ప్రిజ్ఞవాటిల్ల న్యా
యంబున్గాంచుచు విజ్ఞప్తిగకను నా యాసం బటంచుర్ శరీ
రంబున్దాచక కష్టనిష్ఠురము లా రంభంబునే గాంచి స
త్యం బున్నారసి తీర్పువల్కు ఎ. వి. రా మార్యుండు

[బెంపాం దేడ్

సీ॥ గొప్పయుద్యోగంబు గూర్చి బెంపొందగా, నొనరించి యీశ్వరు డోముగాత
నేరస్తులను మది నెరుగ మేధావిగా, నొనరించి యీశ్వరు డోముగాత
నేయెడ తీర్పులక్ష న్యాయంబుగావల్క, నొనరించి యీశ్వరు డోముగాత
నధిక వేతనవృద్ధి నమరించి ఘనునిగా, నొనరించి యీశ్వరుండోముగాత

గీ॥ ప్రబల చట్టము లందున ప్రజ్ఞయందు। లలిత సుగుణములందున లక్ష్యమందు
సాధుభావంబునందున సరసమతిని। యొనరగావించి యీశ్వరు డోముగాత॥

సీ॥ బంధు బృందంబులు బల్మరు వినుతించ, మరలెపుడొత్తువో మాదుపురికి
గొప్పయుద్యోగము గొని దొరతనమున, మరలెపుడొత్తువో మాదుపురికి
దేశంబులనుగాంచి ధీరభావంబున, మరలెపుడొత్తువో మాదుపురికి
కార్యంబులందున గాంచి జయంబును, మరలెపుడొత్తువో మాదుపురికి

గీ॥ నధిక వేతనమందున యలరినీవు। మరల నేతెంతు వెప్పుడో మాదుపురికి
మరువకుండుము నెప్పుడు మనమునందు। మమ్ము నెల్లరనోయయ్య మాదునగరు॥

చీమకుర్తి బసవయ్యగారు మునిసిపాలిటి కౌన్సిల్లరుగా నెన్నుకొనబడినప్పుడు
జదివిన పద్యములు.

సీ॥ బాల్యంబునందునే భక్తితో తలిదండ్రి, సేవలొనర్చెడి చిత్తమబ్బె
పవితనమందునే పండితోత్తములచే, శివకథ లాలించ చెవులయొగ్గె
చిన్నతనంబునే చెలికాండ్రగూడుచు హరిభజనాదుల ననుసరించె
చిరతప్రాయమునాడె చెప్పనుపన్యాస, ముల నభ్యసింపగా మొదలువెట్టె



గీ॥ అట్టి వైశ్యకులాబ్ధి హిమాంశుడైన। బసవయాహ్వాయుడీపురి పారిశుద్ధ్య
సదనమందున నొప్పగ సభ్యునిగను। ప్రజలు గోరుట మేలగు బాటగాదె॥

సీ॥ వ్యక్తిగల్గినదాది శక్తిసామర్థ్యము, లార్జించ డెందము నందు దలచె
వ్యక్తిగల్గినదాది వైశ్యధర్మంబుల, వెదకను మొదలిడె వేడ్కలూర
వ్యక్తిగల్గినదాది వాణిజ్యనేర్పున, గణితంబు నార్జించ గలిగె మిగుల
వ్యక్తిగల్గినదాది వ్యాపార తగవుల, పంచాయతీ తీర్పులెంచగాంచె

గీ॥ వ్యక్తిబూనినదాదిగా వాశిగాంచ। నైకమత్యంబునే జిత్తమందు దలచె
నతని మనమున్సిపాలిటినందు కౌని। సిల్లరుగనుండ నెన్న విశేషమగును॥

సీ॥ మున్నొకతరిమన మునిసిపాలిటి కౌను, సిల్లరు పదవిలో జేరిమెలగె
మరి వైశ్యబాలసమాజంబునను కార్య, దర్శిగానుండె విధాయకముగ
నతులార్యవైశ్యమ హాసభ సెక్రెటరీ పదవిని నిర్వహించగలిగె
భద్రింబుగా వైశ్య పత్రిక యెడిటరు, పనిబూని కొన్నాళ్ళు ప్రజ్ఞజూపె

గీ॥ నన్నసత్రము కమిటీయం దలర శెక్రి। టెరి యగుచు కీర్తిచేతను బరగునతని
బసవయాఖ్యుని పట్టణ పారిశుద్ధ్య। సంఘమందున జేర్చుట సరణిగాదె॥

సీ॥ అన్నసత్రమున విద్యార్థి బీదలకును, వసతుల గల్పించె విసువకెంత
స్వకులబాలకులను సుఖులుగా జేయను వారంబులొసగెన వారితముగ
సంతోషయుక్తులై శ్రద్ధతో జదువంగ, బోధజేయును బాల పుంజమునకు
వేదకర్మంబులు విద్యుక్తముగజేయ పాటుబడుచునుండె భక్తిబూని

గీ॥ విమలమైత్రేయ గోత్ర పవిత్రుడగుచు। కీర్తిగోరును నాచీమ కుర్తి బసవ
యాఖ్యుడిప్పుడు కౌన్సిల్లరగుట మేలు। గాదె మున్ముందు జనులకు గాదెసుఖము॥

సీ॥ శిష్టజనులజూచి చేతులొగ్గుచు ధర్మములను గ్రహించును మోదమలర
పండితులనుగని పౌరాణగాథల వినుచుండు భక్తితో వీనులలర
వేదాగమార్థస ద్విజ్ఞానులను బూజ లొనరించి యర్ఘంబు లనుసరించు
భాషాప్రవీణులు బరతెంచ వీటికి బిలపించి సందియములను దెల్పి

గీ॥ వృద్ధిగాంచుచు నితరుల వృద్ధిగోరు । చుండు ననుదినమందు నే సుజనవర్యు
డట్టిబసవార్యునెల్లపుడతుల కరుణ । బూని యీశ్వరుడోము సంపూర్ణముగను॥

20—5—14 ఏలూరు వైశ్యమహాసభయందు జదివిన పద్యములు.

శ్రీరమణీప్రియుండు ముని సేవితపాద సరోరుహుండు వి
స్తారకృపాకరుండు సుర సంఘ విచారు డువేదవంద్యుడౌ
దారగుణాధిపుండు వర ధాముడు సచ్చరితుండు శౌరి యే
లూరి వణిఙ్మహాసభ జయోన్నతి బొందగ జేయుగావుతన్॥

భూరితపోవిచారి పరి పోషితభక్తసురారి సంఘ వి
స్తారి యమాధిహారి గజ దానవనాశన కారి ధర్మసం
చారి త్రిశూలధారి సుమ సాయక గర్వవిదారి భూరి యే
లూరి వణిఙ్మహాసభ జయోన్నతిబొందగ జేసి యోముతన్॥

ధారుణి విష్ణువర్ధనుడు ధర్మమునెంచక దుర్మదాంధుడై
కోరి రమించ శాపమిడి కూల్చి ధరాస్థలి వైశ్యజాతి నిం
పారగజూచి సత్కరుణ పాలనజేసిన కన్యకాంబ యే
లూరి వణిఙ్మహాసభ జయోన్నతిబొందగ జేసి యోముతన్॥

భోగిశయానభూషణులు పోషలయాదులొసర్చు భూరి యు
ద్యోగులు శ్రీయుమాధవులు యోగిజనావనులుత్తమోత్తముల్
రాగవిశారదూరులు వి రాజితమూర్తులు ధీరులుర్వి చ
ల్లాగురుసామి శ్రేష్ఠిని చలంబున శ్రీయుతుగా నొనర్చెడిన్॥

సప్తఋషీంద్ర నిర్జర ది శాంపతివంద్యుడు భక్తరక్షకుం
డాప్తుడు సర్వభూతముల కాదిమవేలుపు వేదవంద్య స
దీప్తచరిత్రు డార్యహిత ధీనిధి సజ్జనపాలబంధు వీ
సప్తమవైశ్యసత్సభను సత్కరుణాయుతుడౌచు నోమెడిన్॥



వేదాంతుల గూర్చిన పద్యములు.

ఇంతులకోయకిన్మదిని యీశునుపాసనజేయలేక కా
సంతయు సత్యమార్గమన యంబును జూడక వేడ్కమీర లో
నెంతయు సౌఖ్యదుఃఖము ల నేకముగా బరికించలేని వే
దాంతులు గుర్వులెట్లగునొ యారయుడీ ఘనులాత్మలందునన్॥

వేదంబుల్పఠియించి శాస్త్రచయము ల్వీక్షించి యర్థంబులన్
మోదంబొప్పగజూచి బిమ్మటను బ్రహ్మోపాసనోద్యుక్త గ్రం
థాదుల్సారముగ్రోలి తత్వమెలమిన్ నాలోకమున్ జేయకే
వేదాంతుల్మేమంచు బల్కుగురులే వేదాంతులో గాంచనా॥

గినుకన్బూనుచు దుర్గుణంబులను యా క్లేశంబులైదింటి పోం
తను లేకుండనొనర్చి యీషణములన్ తగ్గించి నిత్యంబు వే
ఘనతన్ షట్కశమాది సత్వగుణముల్ సాధించకే జ్ఞానులం
చని యుప్పొంగెడి వారిజూడ బుధులెట్లానో భువిన్ తజ్ఞులే॥

పట్టుగ వేదవాక్యముల బల్కగనేర్చి యథోక్తి మీర తా
మట్టె కషాయవస్త్రముల నందముమీరగ గట్టి కోర్కెజే
పట్టి గురూపదేశమని మంత్రమునొక్కటిజెప్పి శిష్యులన్
గట్టిగజేసికొంచు సరి గాను ధనంబుల గొందురెంతయున్॥

గురువుకు జీవమానముల గోరిన యర్పణజేసి భక్తితో
స్థిరమతి సేవజేయుచును జిత్తము మెచ్చగ సంచరించుచున్
గురుతులబట్టి వాక్యసుధ గ్రోలిసుఖం బొనగూర్చుమంచ నే
గురువులు చెంపదెబ్బలకు కొంపలు వేచుక దిర్గునెంతయున్॥

ఇంతులజేరి మాయలను యింపుగ బల్కుచు యుక్తిమీరగా
చెంతకుదీసి మెల్లగను జేతులుబట్టగ నుల్కిపాటునన్

గంతులువేసి ద్రొల్లగను కాయము గుర్వున కర్పణం బొగిన్
నింతియొనర్పకుండి దగ నెట్లుపదేశము గాంతువోయనున్॥

భయమును లేక గ్రుమ్మరుచు ప్రాజ్ఞులభంగిని లోనబొంగి నెం
తయు చదువుల్గ్రహించక నిదానము బూనక భక్తిమీర న
వ్యయు నెరుగంగ లేక ధర పాపమునన్బడి కామశాస్త్ర మ
ధ్యయనమొనర్చు గుర్వులను దగ్ధమొనర్చిన హింసయే? ధరన్॥

భ్రమరము కీటకంబుగొని బ్రాణముబోసియు ధాత్రిజించరీ
కముగ నొనర్చుభంగి తమ కంబున శిష్యుల దుర్గుణంబులన్
క్రమమున ద్రొల్గజేసి తన కార్యములన్గొనుచుండి బిమ్మటన్
తమవలెజేయునట్టి వర ధన్యులు గుర్వులు లోకమందునన్॥

2-8-20 బాలగంగాధరతిలక్ మహారాజు స్వర్గస్థులైనప్పుడు గుంటూరు సభలో జదివిన పద్యములు.

బాధలు గల్గునేమొయని భావమునందున భీతినొందకన్
గాధలు రాజకీయమున గల్గినచెడ్డలు దేశమాత నా
రాధనజేయుమార్గములు రంజిలదెల్పుచు లోకమాన్యగం
గాధర మర్త్యమందున సు ఖంబిక లేదని స్వర్గమేగితో॥

శోధనజేసి గీతలను శోభిలసర్వ రహస్యమార్గముల్
బోధపడంగ తత్త్వమును పూర్ణతరంబుగ దేశదేశ వి
ద్యాధికులెల్ల మెచ్చగ జ యంబునుగోరుచు లోకమాన్యగం
గాధరమర్త్యమందున సు ఖంబిక లేదని స్వర్గమేగితో॥

సాధనజేసి పత్రికల సారముగ్రోలగ సర్వసోదరుల్
సాధుతనంబుచే మిగుల శక్తిగడించుచు పాలనావిధుల్



యోధ వెలుంగ దెల్పుచుకు యుక్తులటంచని లోకమాన్యగం
గాధర మర్త్యమందునసు ఖంబిక లేదని స్వర్గమేగితో॥

వీధులలోన సర్వవిధ విక్రయశాలలు మూసివైచి వై
శ్యాధిపులెల్ల శూద్రులు మహమ్మదు సంతతి క్రూరచట్టదు
ర్వ్యాధిచికిత్సకుం దరిగెనంచు విచారముబొంద బాలగం
గాధర మర్త్యమందున సు ఖంబిక లేదని స్వర్గమేగితో॥

భూదవుసాటిగా బిరుద ముల్గొని సోదరులందు నట్టి దు
ర్బాధల బాపనెంచి పరి పాలన లోపములెల్ల జూప స
తో[illegible]ధముతో ప్రవాసమొనగూర్చ సహించిన లోకమాన్య
గంగాధర మర్త్యమందున సు ఖంబిక లేదని స్వర్గమేగితో॥

21-4-24 శనిగ్రహామునుగూర్చి వ్రాసిన పద్యములు.

అలమంత్రిత్వము రాజగౌరవముమే ఘూర్ఘాధిపత్యంబులన్
తలయందుంచిరి దేవతల్బరమునీ దార్ఢ్యంబునన్ వ్రాసి కే
వలమున్ శూద్రుని తెల్విజూపవలె నూ? భావంబులన్గాంచి వి
ప్రులు మెచ్చన్ మరి బ్రాహ్మణేతరులుయబ్బోయంచనంగావలెన్॥

అధికారంబుల నాల్గునందితివి సా హాయంబునన్ గోర కే
బుధవర్గంబులుమెచ్చ మందగుణమున్ బోనాడి యుద్ధంబులన్
వధలన్గూర్చక సౌఖ్యమొద ప్రజలన్ వర్ధిల్లగాజేసి నీ
విధులన్ నిర్వహణంబొనర్చి కీర్తిగనుమా విశ్వంబునన్ నోశనీ

పసిబాలుండవుగావు జెప్పగను నాభాగ్యంబులన్ బాపి సం
తసమెల్లన్నణగించి పాడికఅవున్ దారిద్ర్యమున్గూర్చుచున్

కసిబూనన్నపరాధమేమి యెరుగఁ గండంబులఁ బెట్టఁగ
వెస ముయ్యేడులు నిండె బూనిచనుటే విధ్యుక్తమానో శనీ॥

ఉండినచోట నిద్రబడి యుండిహరించగ కల్మినంతయుఁ
పండినచోటపండి మరి పాడొనరించగ కొంపగోడులఁ
దండిగుణంబె నీకిది బుధగ్రహమండలిలేదె నిన్ననఁ
మొండితనంబు జూపుచును బూనుదువే పదునాలుగేడులఁ।

ఒకపర్యాయమెరావు నాల్గుపదవుల్ యోచించ రక్తాక్షిలో
సుకరంబొప్పగ ధర్మమార్గముల సంశోధించి తంత్రింబులఁ
సకలార్ధంబులు తగ్గుచున్నవలలు సంసారుల్మదిన్మెచ్చ బూ
నిక మేఘంబులొసంగ వర్షమును బున్నెంబుఁ శనీగాంచుమా.

చాలును నీదుసౌఖ్యమిక సాగుము నాగృహమందు నిల్వక
పాలన శోణితాక్షిని యుపాయముగా నొనరింప ధర్మమా
శ్రీలు జెలంగ దేశమున చెల్వువహింపగ రాజులందరుఁ
దేలుము గౌరవంబునను దృప్త్యధికారయు లెల్లజేయుచుఁ॥

కొండెములాడకుండ జనకోటులు సత్యమువల్కునట్టులఁ
పండితులాపురాణముల బాగుగ నర్థము జెప్పులాగునఁ
మొండితనంబును న్విడచి పుణ్యముసల్ప ధనీకులందరుఁ
తిండికి తిప్పలన్బడక దృప్తిని మానవులుండజేయుమా॥

అప్పులపాలుజేసితి వనాదరణం బొనరించి బంధువుల్
తప్పులబట్టసల్పితివి దండుగలెన్నియొగూర్చి హెచ్చుగఁ
తిప్పలుబెట్టినావికను తీరికగల్గదు శోణితాక్షిలో
గొప్పనుదెచ్చిగొమ్ము జనకోటి శబాసన వేడ్కనో శనీ॥



ఈశుడొసంగె నా జనుల నిట్లుదరిద్రుల జేయుబుద్ధినీ
వాశను గోరితో నిజమ హాదెలియంగను బల్కు సర్వముఁ
దేశజులం దెరుంగగను దీనులవేచుటగాదు? పాపమే
నాశనమొందజేయు జననంబును దాల్చగనేలనో శనీ॥

6-4-24 శీతజ్వరమునుగూర్చి వ్రాసిన పద్యములు.

పీలిచి సారమంతయును బిప్పియొనర్చియు దేహమంతయుఁ
నాలినొకింత రానియవు నాభి విలీన రసాయనంబులఁ
గ్రోలినశీతమా విడచి గొబ్బున జేరవు నీదుతావురుఁ
శూలధరుండులేడ పరిశోధనజేసియు శిక్షవేయగఁ।

గుల్లనొనర్చి దేహమును కూలగ ద్రోసియు కొంపనుండగఁ
కాళ్లనుచేతులన్గలుగు కండలరక్తము నెల్లజంపియుఁ
బుల్లలజేసి నీకుదయ బుట్టను శీతమ జూడుమింక నీ
త్రుళ్ళడగించు నీశ్వరుడు ధూరముబారిన వెంటనంటియుఁ।

రోగములెల్లనీవలె విరుద్ధపు చేష్టల జేయవెప్పుడుఁ
యాగడ మెల్లగంటి హృదయంబున శీతమయింకబింకముల్
సాగవుగాని హెచ్చుగను జంపవు యొక్కగుణంబుమేలు యా
భోగివిభూషణన్ననుము బుద్ధిని జెప్పుచు శిక్షజేసెడిఁ।

అన్నహితంబు జంపియున హాయొక గ్రుక్కెడు జావద్రావగా
తెన్నునుమాన్పిమాటికిని ద్రిప్పుచుపైత్యమునించి గాత్రముఁ
సన్నగిలంగ జేసితివి చాలును శౌర్యము శీతరోగమా
కన్నులవిప్పిశంకరుడు గాంచిన భస్మముగాకయుందువే॥

కక్షను మాని బొమ్మికను కాలముదీరె చలిజ్వరంబ ర
క్తాక్షిని చైత్రమాసమున కారయనిక్కముగాను లెక్కరుఁ

పక్షము లైదునిండ పరిపాకము జెందక కర్మముండునే
రక్షణ జేయ నీశుడు స్థిరంబుగ మానితి భీతి నెంతయున్॥

26-4-24 ఉప్పటూరు వెంకటపున్నయ్యగారికి వ్రాసిన యుత్తరము

ఎటుబోకుండగ జేసి విద్యగరువన్ నేర్పాటుగావించి స
త్పటిమన్ నూను పరీక్షదేల్చితివి సం పద్యుప్పటూర్వంశవెం
కటపున్నాహ్వయ నీకు ప్రత్యుపకృతిన్ గావింపగా నోపసం
కటదూరుండగు విశ్వనాథుడిదు సౌఖ్యంబుల్ సదావేడుకన్॥

ఇంక పరీక్ష దేల్చితివ హీనముగా సుగుణాఢ్యకట్టమూ
ర్వెంకటరామయాహ్వయుని ప్రేమకు మెచ్చెడినమ్రభావునిన్
శంకరుడిచ్చెడున్గరుణ సర్వసుఖంబుల నీకుసంపదల్
పంకము లెల్ల బాపుచును బాయక నెప్డు శుభోన్నతస్థితుల్॥

పలువిధదానధర్మముల పాల్గొనుచున్ స్వకులాభివృద్ధికై
తలపును వెట్టిబాలురకు తావునొసంగియు నాదరించుచున్
దెలియని వాక్యపుంజముల తేటగనర్థము బోధజేయునీ
కల జగదీశుడిచ్చెడిచి రాయువుకోరికలెల్ల సంపదల్॥

గీ॥ పూర్తిగావచ్చె మాసముల్ మూడుశీత
జ్వరము రక్తంబు బీల్చి దుర్బలుని జేసె
నిట్టితరుణంబునందు నిం కేమి జేయ
గలుదును పద్యములె నీకు గౌరవంబు॥

గీ॥ వచ్చినన్నుజూడ వలెనన్న గోరిక
గాఢముగను నాకు గలదుగాన
యింకనుప్పటూరి వెంకటపున్నయ
సలుపబూని తేని సంతసంబు॥



గీ॥ సాంబశివగుప్తకును బూని చారుగతిని
పైపురైటింగు నేర్పింప ప్రాపుదీసి
నటుల వింటిని నీబుణ మెటులదీర్తు
మోగుణోన్నత యుప్పటూర్ బున్నయాఖ్య॥

శ్రీ త్యా గ రా య మ హో త్స వ ము.

పండిత సన్మానపద్యములు.

శ్రీసకలార్యబృందవర సేవితమై విపులాంధ్రదేశసం
వాసితదీప్తమై సుగుణ వర్య ప్రకీర్తితమై సుపూజ్యమై
దాసజనానుకూలమయి తొండవగానరసాళి పూరమై
భాసుర త్యాగరాయసభ వర్ధిలుచుండెడి సర్వకాలమున్॥

సీ॥ ప్రావీణ్యుడౌ చల్లపల్లి సుబ్బయశాస్త్రి, పాటబ్రహ్మానందపదవి నిచ్చె
ఘనుడు సుసర్ల గంగాధరశాస్త్రి, విశారద సద్వీణ పారుపల్లి
రామకృష్ణాహ్వయు రమ్యజంత్రంబును, వహ్వారె యేమనవచ్చు నహహా
ధారుణి తుంబురనారదులే వారు, వేరుగవర్ణింప వీలు గాదు

గీ॥ స్వరవికల్పనతరగల చందమలరె
పల్లవీజ్ఞానరచనల ఫుల్లమలరె
నటుల శ్రీవారణాశి ఘంటాఖ్య ఘనమృ
దంగవాద్యము సభకు ముదంబు నొసగె॥

గీ॥ ప్రౌఢవిద్వాంసుడౌ చల్లపల్లి పంచ
నాదశాస్త్రి ఫిడేలుగానంబు నట్లు
సరసు సింహాద్రియాచార్య జంత్రగాత్ర
పాట వర్ణింపదరమౌనె బ్రహ్మకైన॥

మధ్యమపంచమాదిశ్రుతి మండలిదివ్యవిలాసనాదముల్
విద్య యపారగానమును వేడ్కగణింపగ శక్తిశూన్యమే
సాధ్యముకాదు కావ్యముల సల్పను సత్కరమార్యులారనే
పద్యసుమంబులన్ విమల భక్తినొసంగితి వేడ్కమీరగన్

గీ॥ మద్ది వెంకటసుబ్బరాట్ మణిసువర్ణ
పతకము లొసంగె నట్టుల భక్తిమీర
శక్తిచాలదు బహుమతి సల్పనిలను
యొసగితిని నాల్గుమాటలు పొసగినట్లు॥

ఆ 27-6-19 సం॥ గుంటూరునందు ఆర్యవైశ్య యువకుల సాహితీ సంఘమువారు శ్రీ కలవల రామానుజం శ్రేష్ఠిగారి అకాలమరణమునుగూర్చి చేసిన సభలో జదివిన పద్యములు.

క॥ కలుషభూయిష్ఠమగు నీ
కలినుండగ రాదటంచు గని మనమందున్
యిలబాసి యేగినావో
కలవల రామానుజార్య కలితౌదార్యా॥

క॥ లలిభోగభాగ్యరాసుల
జెలగుచు సుఖమంది తృప్తి జెంది పరమునన్
వెలయించ నేగినావో
కలవల రామానుజార్య కలితౌదార్యా॥

క॥ కులబాలురు మీచే వి
ద్యలసాయము బొందగోరి దలచియుండ వీ
నులనైన వినక నేగితో
కలవల రామానుజార్య కలితౌదార్యా॥



క॥ ఇల బీదజనులు జీవన
ములు లేకను మాడుచుండ ముదముడిగియు క
న్నులజూడలేక నరిగితొ
కలవలరామానుజార్య కలితౌదార్యా॥

క॥ రాణదివాను బహద్దరు
మానిత నుతిగనిషరీఫు మాన్యపదవినిన్
మాని సుగతి కలవల రా
మానుజబుధుడేగె దివము కమరులు మెచ్చన్॥

సీ॥ బాలికలకు పాఠశాలను బెట్టించె, నెగ్మూరినందున నెతడుప్రీతి
పసిబిడ్డలనుసాక పాలనొసంగెడి, ధర్మంబు నేదాత ధరణినిల్పె
వేతనంబులనిచ్చి విద్యార్థిలోకము, చదువగాచేసెనే సరసుడెలమి
వ్యాధులబాపను వైద్యాలయంబుల, స్థాపించె నేర్పునే సజ్జనుండు

గీ॥ గోష చెడకుండ నాస్పత్రి కుదురుపరచ
సాయమొనరించె నేనూరి హాయిమీర
నట్టి కలవల రామాను జార్యు డరిగె
పుణ్యలోకంబు బీదల బ్రోచు టెటులొ ?

క్రీ. శ. 1911 సంవత్సరమున గడగ్ కర్నాటక ఆర్యవైశ్యమహాసభ యందు రాజీవప్పడంబళ్ గారిని గూర్చి చదివిన పద్యములు.

రాజీవారిధరుండు జత్తముననే భ్రాజిష్ణుసేవించునో
రాజీవోద్భవు డాసుపర్వతతులే రమ్యాత్ముని న్గొల్తురా
రాజీవాక్షుడు భక్తరక్షుడు రమారామామణీనాథుడీ
రాజీవప్పను బ్రేమమీరగను సంరక్షించునేవేళలన్॥

రాజేశుండు సురాపగాధరుడు వైరాగ్యానందసంధాయి యం
భోజాతారికిరీటి భర్మగిరిచాపుండార్యసంతోషవి
భ్రాజత్పన్నగకుండలుండు కరుణన్ ప్రావీణ్యుడౌ డంబళ్ళన్
రాజీవప్పను సార్వకాలమును సంరక్షించి గాపాడెడిన్॥

స్వర్గస్థుడైన కలవల కణ్ణన్ శ్రేష్ఠిగారిని గూర్చిన పంచరత్నములు (7-8-1920)

సలిలతధర్మమార్గముల శక్తికొలందిని సల్పివేడ్కగా
గలపనులెల్ల దీరెనిక కాలముబుచ్చవృథాయటంచునా
తిలకుమహాత్ముసన్నిధిని, ధీరతగీతలనభ్యసించగన్
కలవలకణ్ణనార్యపర కార్యధురంధరస్వర్గమేగితో.

పలువురబీదబిడ్డలకు పాలనొసంగెడు శాలలెన్నియో
నిలిపిచికిత్సగేహముల నెమ్మదిగాంచగ వ్యాధిపీడితుల్
కలియుగదానకర్ణుడని గాంచి నుతిన్దగ మానవాళిచే
కలవల కణ్ణనార్యపర కార్యధురంధర స్వర్గమేగితో॥

పలువిధదానధర్మము లపారముగా నొనరించి మెచ్చగన్
బలి కెనయైనదాతయని పండితులెల్ల నుతించి ధాత్రిలో
కులమున వన్నెకెక్క సుర కోటులు బిల్వగ నాలకించుచున్
కలవల కణ్ణనార్య పర కార్యధురంధర స్వర్గమేగితో॥

బలమగు కష్టపుంజముల బొల్పడజేయగడంగు శాసనం
బులగని భారతావనికి బుట్టిన దుర్దశ రాజనీతికిన్
నలుకవహించి పూర్ణముగ నాత్మనుసంగతులెల్ల దెల్పగన్
కలవల కణ్ణనార్య పర కార్యధురంధర స్వర్గమేగితో॥

కలహమునందు వీరజన కాండము ప్రాణములన్ త్యజించిరా
జిల జయరాజ్యసంపదవి శేషము లిచ్చిన తీవ్రపద్ధతుల్



వెలయగజేసినట్టి సర విన్నని మిక్కిలి ఖేదమందుచున్
కలవల కణ్ణనార్య పర కార్యధురంధర స్వర్గమేగితో॥

నవరత్నములు (11-4-24)

శ్రీరఘువంశజుండు ముని సేవితదివ్యపదద్వయుండు వి
స్తారకృపాకరుండు గురు సాధుజనంబులబ్రోచు లోకసం
చారుడు భక్తరక్షణవిశాలసుశీలుడు కోసలాత్మజుం
డారసి యీవధూవరు లనారతమున్ సుఖమందజేయుతన్.

విద్దెను నేర్చుచున్నపుడె వీనులకెక్కియు గాంధిబోధనల్
ఖద్దరుగట్టి యాంగ్లము న గాధమునన్ బడద్రోయునంచు నే
రద్దును జేయకన్విడచి రంజిలబాలులకెల్ల జెప్ప వే
మద్దినుదర్శనార్యుడగు మార్గముబాల్యమునందు ద్రొక్కుచున్

వెనుక నరెస్టులప్పుడు న వీనవిధానవిచారణంబునన్
నిను విడిపించ కోపపడి నీదగుతండ్రి చివాట్లుబెట్టునం
చని భయమున్నదాయని న యంబుగ యాధరుఘర్దుబల్క శి
... ... ... ...మండలనాథుడాడ శి
క్షనువిధియించుటే హితము సమ్మతి ధర్మమటంచు బల్కవే॥

సురుచిరబుద్ధి సర్వజన సోదరభావముబూనివేడ్క సు
స్థిరతను దేశసేవలనుజేయుచు గాంధిమహాత్మతత్వత
త్పరమతివై జరించుచు కృపామతి దీనులపైనబూనుచున్
నిరుపమ సాధువర్తనము నేర్పునుజూపి యశంబునందుమా॥

హా !. పరిపక్వమానస సహాయ నిరాకరణజ్ఞులైగదా
నీపెదపిన్నతండ్రులు వి నిర్మలశాంతముతోడజైలునం

దోపిక సర్వకష్టముల నోర్చి భయంబునులేక శాంతముగా
జూపిరి దేశమంతటికి సూవె! నిజంబగు దేశభక్తినిన్॥

గీ॥ ఆలిసోదరులట్ల మహాత్ముభంగి
లాజపతిరాయివలెను విలాసమొప్ప
సర్వగానములసాధించి శక్తిమించి
ధరణి వర్ధిల్లుమయ్యా సుదర్శనార్య॥

గీ॥ అతిథుల భ్యాగతులపూజ లనవరతము
సల్పుచును పంచమాదుల స్వల్పులంచు
గాంచకను సర్వసమమును నెంచవమ్మ
త్రిపురసుందరి బాలరో దివ్యలీల॥

గీ॥ తీరికున్నపుడెల్లను ద్రిప్పిరాట్న
చక్రమున దారమునుదీసి చారుగతిని
సర్వబాలికలకు నేర్పి జాటవమ్మ
త్రిపురసుందరిబాలరో విపులలీల॥

గీ॥ అవని చౌదరిరాణి బియమ్మయట్ల
శ్రీమతి సరోజనీభంగి చెలువుమించి
భారతాంబను సేవించి భాగ్యమలర
వరసుమంగలివై ధాత్రి బరగవమ్మ॥

గుంటూరుపట్టణమున సకలా వీరయ్యగుప్తగారు వైశ్వదేవమొనరించి నపుడు చదివిన పద్యములు.

శుకవ్యాసాదిమునీంద్రవందితుడు సుశ్లోకుండు సద్భక్తర
క్షకధారేయుడు శేషతల్పుడు కృపాస్వాంతుండు దుగ్ధాబ్ధిక



న్యకనాథుండు చతుర్భుజుండు భరితానందుండు గోవిందు డీ
సకలా వీరయపాకయాజి నిలలో సంతోషిగావించెడిన్।

సకలేశుండు కపాలధారి త్రిజగత్సంసేవ్యు డక్షార్యపా
వకనేత్రుండు యుమాధవుండు కరుణావారాశివిశ్వేశు డం
తకనాశుండు దిగీశవందితకథాధారుండు భూతేశు డీ
సకలా వీరయపాకయాజి నెపుడున్ సంతోషినిన్ జేసెడిన్॥

క్రీ. శ. 1921 వత్సరమున ప్రొద్దుటూరిలో నారాయణ సుబ్బరామయ్య గారిని గూర్చి వ్రాసిన పద్యము.

హాయి రసాలసత్ఫలము లాదరభావముతో నొసంగుచున్
ఛాయని ప్రేమగాంచుచు నుపాయముమీరగ నవ్వుజూపు నా
రాయణ సుబ్బరామయ విరాజితసద్గుణజీవితంబులన్
నామెదమర్వకెంతయు వినమ్రుడనై జరియింతు నెప్పుడున్॥

అన్నం రామయ్యగారినిగూర్చి వ్రాసిన పద్యములు.

చిన్నతనంబునందునను పెద్దలసేవనొనర్చి విద్యలో
కొన్నిపరీక్షలన్గెలచి కోరికమీరగ గొప్పనౌకరిన్
మన్ననదాల్చి సద్విబుధ మండలిమెచ్చగ నిర్వహించునో
యన్నమరామయాహ్వయుడ యన్గనివచ్చినకార్యమెంచుమా॥

భాసురవైద్యగ్రంథముల బారగజూచియు వానికొన్నిటిన్
జేసితి పద్యరూపముగ చెల్వుదలిర్పగ తేటదెన్గునన్
వీసములేదు చేతులను వీలెటుగల్గును ముద్రితంబు కు
ల్లాసముతో సహాయముని లన్నొనరించుము రామ
[యాహ్వయా॥

కవితమొనర్చ వైద్యమున కష్టతరంబని పండితోత్తముల్
వివరమెఱుంగఁబల్కెఁ గడు వేడుక గ్రంథములెల్ల జూచుచున్
నవి ప్రచురించ వైశ్యకుల మంతకు వన్నియువాశిగాఁదె స
ర్వవిధసకార్యసాధనము సల్పుము యన్నను రామ
[యాహ్వయా॥

వైదికులు.

దెలసికొనంగ వేదముల దేవుఁడొసంగెను సర్వభారతీ
యులకిది ధర్మమౌనుడువ నొప్పనె బ్రాహ్మణ
[హక్కుగాను యా
తొలిపలుకుల్గ్రహించకను దోషములంటిన వారెశూద్రులా
సలలితభక్తితో జదివి సారమెఱింగినవారె బ్రాహ్మణుల్॥

కోపముబూని వైదికులు కుచ్ఛితబుద్ధిని యాజకత్వమున్
బాపలలోనియోగులకు బాల్పడదంచును జెప్పుచుండె సం
తాపము జెంది కర్మలను సల్పుచునుండిరి వారివారిలో
నే ? పగదీర్ప వైశ్యులకు నేర్పుదురే పల్నాటివైదికుల్॥

బెదరక వైశ్యజాతి నిల భీతినిబెట్టుచు కుత్రిమంబుచే
వదజులలోనగల్పగ ను పాయముఁజేసి పురాణమంత్రముల్
చదివిన వైదికోత్తములు చక్కగ వృద్ధినిబొందరేయొడన్
పదవిని గోలుపోవుటకు బట్టిరధర్మపు మార్గమిట్టులన్॥

ధనమును దీసికొంచు మది ధర్మమువీడుచు శూద్రకర్మలన్
దనరగసల్ప వైశ్యులకు? దప్పనె పాపము వేదశాస్త్రముల్
కనివడిజూచి కుత్రిమము భావములందునదాల్చి వైదికుల్
ఘనతవహించునే ధరణి గౌరవమంతయు గ్రుంగు నెప్పుడో॥



పగలు దివాంధసంతతులు బాధలుబెట్టును కాకజాతి నా
పగలు.దొలంగ గూబలతి పట్టుగ వాటిని చెండుచుండు నే
తెగలను బాధబెట్టిదమొ ధీరతనట్టుల వారిచేత నే
దిగువకు ద్రొక్కగాబడును దేవుని కెల్లను నొక్కటేగదా॥

వ్యాజ్యములందు పెద్దలయి వాస్తవమంతయు దాచి పొట్టలో
రాజ్యమునందు భూరియప రాధముల న్బరికొల్పి డబ్బుకై
ఆజ్యముద్రాగి వేడ్కవిక లాంగుల బిచ్చకు నడ్డమొందగా
పూజ్యముగల్గునే ప్రజల పూర్ణముగా మన విప్రపాళికిన్॥

మును రామానుజమధ్వశంకరులు సద్బుద్ధిన్
[భారతాఖ్యావనిన్
ఘనులై వ్యాపనజేసి సన్మతములన్ గాంచెన్ ధరన్ముక్తి నా
వెనుకన్బిరము లట్లొనర్చకను ప్రా వీణ్యంబుతో విత్తమున్
గొనుచు న్దల్పక వర్ణధర్మముల వేగూర్చున్ సదా భేదముల్॥

అధికారంబు వహించినట్టులను గర్వాంధంబునన్ జిక్కి స
ద్విధులన్మీరి యహంబు దాల్చి గతుల న్వీక్షింపకే శ్రీయుతు
ల్బుధులన్ దిట్టుచు దేశభక్తులను పాపుల్గానులోనెంచుచున్
దధి దుగ్ధాదిన భక్ష్యభోజ్యయుతులై దర్పంబునన్ గ్రుమ్మరున్॥

అన్యమతప్రచారకుల హర్నిశమున్మతబోధజేసి సా
జన్య సుశీలముల్గరపి సర్వుల గల్పుక వృద్ధిజేయుచున్
గణ్యత బొందుచుండ నది గాంచుచు సిగ్గును బొందకెంతయున్
ధన్యులమంచుబల్కు యతి తామసులన్మది మెత్తురే ప్రజల్॥

బోడుల జేతురా విధవ బోటులఁగొన్ని మతంబులందునా
జాడలఁబోక కేశములు చక్కఁగ నుంతురు వైష్ణవోత్తముల్
చేడెల వర్తనంబులను చెందును కీర్త్యపకీర్తులెంతయున్
బోడులు నీతివంతులన బోలునె చిత్తము కారణంబిలన్.

వేదము లేరి సొమ్ము! గన విప్రుల ద్రవ్యమటంచు నెంచుటల్
కాదది ధర్మమెప్పటికి గల్గును పాపము మాయ జేసినన్
సోదరులన్ని నీచులుగ జూతురు మోక్షము కెల్ల రర్హులా
వేదములన్ని పాఠముచు వేడుక జేసిన వారె విప్రులా॥

ఉదయమునన్ రహస్యముగ యోగిరమున్ గొని బీట బెట్టుకన్
వదలెను భోజనంబనుచు వాకిటముందర విగ్రహంబులన్
కుదురుగ నిల్పి మిర్యముల గూరిచి మంత్రములన్స్మరించగా
బెదరుచు ద్రవ్యమిత్తురిల బీదలు ధర్మమె సన్న్యసంబునన్॥

కరులను ముంగిటన్ నిలపి గల్గగ జేసి భయంబు వేగకొం
దరి కడవిత్తమున్గొనును దండన జేసెదమంచు కొందరన్
సరిగ నొసంగకున్నదగ శాపము బెట్టెదమంచు కొందరిన్
కరుణయొకింత లేక యిటు కష్టముతోడ యతుల్గడించెడిన్॥

యతులకు పంచ భక్ష్యపరమాన్నములన్గుడిపించి రేని దు
ర్గతులను గూర్చు నాశ్రమము గైకొను వారికి నేవిబెట్టగా
హితమగు? నింద్రియంబు మద మెచ్చగ జేయ వెభక్ష్యభోజ్యముల్
గతిగన కాత్మగైకొనిన గాంతురు పాపము సన్న్యసంబునన్॥



భటులును మంత్రులున్గలిగి బండ్లును గుఱ్ఱము లెద్దు లేనుగల్
పటుతర డాంబికంబుగను బల్లెము లీటెలు కత్తికర్రలున్
దిటముగ గల్గి గ్రామముల దిర్గుచు భీతిని బెట్టి పౌరులన్
కుటిలతనంబుచే ధనము గూర్తురు నూ ? యతిలక్షణంబులే॥

నమలుచు పక్కలాకుల ననారతమున్ధరియించి కావి వ
స్త్రములను సుందరంబుగను తల్ప మొనర్చుక తూగుటుయ్యాలల్
ప్రమదముతోడ సర్వవిధ పాకములన్గుడుపార మెక్క ధ
ర్మమచర మాశ్రమంబులకు మన్నన జేతురె శాస్త్రపుంగవుల్॥

కపటముబూని మంత్రముల కల్పన జేసి పురాణఫక్కిగా
నెపుడు వణిగ్జనంబుకవి ద్రోహితమంచును జేయుచుండిరో
తపములు సత్యశీలములు దారిదొలంగెను విప్రులందు పె
క్కు పరిభవంబు లెల్లడల గూడుచు నుండెను గల్గునింకయున్

జనుల సమానభావమున చక్కగ జూచినవారు భక్తితో
గనుదురు లేని చోనటుల గాంచరు క్రిందికిలాగి వైవగా
మనముల యోచనంబులను మాయల బన్నుదు రిట్టిచైవులన్
దనరవు సౌఖ్యముల్గదు నిదానము బూనుచు నున్నతంబునే
గనవలె బ్రాహ్మణత్వమున గల్గరు పిమ్మట; బొందగావలెన్॥

వేదము లెల్ల శాస్త్రములు విప్రుల సొమ్మని వ్రాసి గ్రంథముల్
వాదములాడుచుండుటలు వర్ధిలు మార్గముకాదు జూడ ఋ
గ్వేదమునందు బ్రాహ్మణము వేమహిదాసుడు బ్రాహ్మణేతరుం
డేదగ వ్రాసినాడు గద డెందములందుగనంగ సత్యమా॥

దుహితల విక్రయంబులకు దోడ్పడి కొందరు నాకరీలనే
అహరహమాచరించుచు జనాళికి గూర్చుచు వైరభావముల్

దహనముమాని లింగముల ధారణజేయుచు జందెమేయుచుం
మహిమలగోలుపోయెజనమండలి భూసురులౌచు బ్రాహ్మణుల్॥

జైలునకుగూర్చి వ్రాసిన పద్యము.

సీ॥ ప్రజ్ఞావిరాజిత భావచిత్రిత దివ్యగ్రంథవిలేఖన బంధిఖాన
ఆహారనియమ సదారోగ్యసౌఖ్యత, రజలదావాంబు కారాగృహంబు
వ్యసనవస్తువిచార వాంఛావిదూరనిర్మలతత్వశాలధర చరసాల
పుస్తకపఠనసత్పుణ్యలభ్యమొసంగు, పట్టుతామసగుణ కట్టుకొట్టు
గీ॥ స్ఖలనరహితవిశేషశ్రీకరముమిత్ర।తతిసుబోధనకుశల విస్తారప్రేమ
మగుణదీపితభవదోష శోకహరము।భక్తిలభ్యమునకు వీలు రక్తిజైలు॥

శ్రీమద్దుందుభివత్సర ఆశ్వీజ శు ౧౪, ౧౫ బ ౧ లు క్రీ. శ. 1922 సంవత్సరం అక్టోబరు 4, 5, 6 తారీఖులందు సోలాపూరుజిల్లా పండరీపురమందు జరిగిన అఖిలభారతవైశ్యపరిషత్‌నందు చదువబడిన పద్యములు.

నిరతము మౌనివర్గములు నిర్మలమానసులౌచు భక్తిని
వ్వారిగనగోరుచుందురు దివంబున దేవతలెల్లబూని సు
స్థిరహృదయారవిందముల సేవలొనర్తురొ వాడు పండరీ
పురఘనవైశ్యసత్సభను బ్రోచు దయామతి సార్వకాలముం॥

తరణిశశాంకతారకలు దారిదొలంగక నెవ్వరాజ్ఞలం
దిరుగుచు నుందురెల్లపుడు తేజము దప్పకనట్టి శ్రీపరా
త్పరుడు బుధేంద్రవందితుడు పాపవిదూరుడు పండరీపురిం
జరిగెడు వైశ్యసత్సభను సర్వశుభంబులొసంగి బ్రోచుతన్.

వరములొసంగి భక్తులను బాపియఘంబుల ప్రేమజూచునో
శరణనివేడువారలను సత్వరబ్రోచెడి దీక్షబూనెనే



దురితహరుండు వాడు వరదుందుభివత్సరమందు పండరీ
పురివర మార్య వైశ్యసభ పూర్ణదయున్గని వృద్ధిజేసెడిన్.

శ్రీరక్తాక్షినామసంవత్సర భాద్రపద శు౧౨-౧౩-౧౪లు (10-9-24) పల్నాడుతాలూకా రెంటచింతలగ్రామమున జరిగిన గుంటూరుమండల ప్రథమార్యవైశ్యసభయందు జదువబడిన పద్యములు.

శ్రీసదయాంతరంగ సురసేవిత దివ్యపదారవింద యు
ల్లాసచిదాత్మసుందర విలాస వికారవిదూర భూరి సం
తోష నిరామయాఖిల దోషవినాశనలోక రక్షకా
భాసిలు రెంటచింతల సభన్గురు వైశ్యుల కోర్కెలివ్వవే॥

జలజభవుండు దేవతలు సర్వమునీంద్రులు దిక్పతుల్మనం
బుల నెవనిన్ దలంతురు రుపూర్ణతరంబుగ భక్తినెల్లవే
ళలనల దేవుడెంతయుని లన్దనరారగ భూరిరెంట చిం
తలపురవైశ్యసత్సభను ధర్మమెలర్పగగాచి బ్రోచెడిన్॥

నిర్మలమొప్ప విద్యలను నేర్చి తిరంబుగ శాస్త్రపుంజముల్
మర్మమెరింగి నిత్యమును మానకసంధ్యనువార్చి భక్తితో
ధర్మము దప్పక న్విశులు దాన మఖాధ్యయనంబులాదిస
త్కర్మలొనర్చి సోదరులు గాంచుడు సత్పథసౌఖ్యపుంజముల్॥

దినములుబుచ్చకెంతయును దీనతనుండెడి సోదరావళిన్
కనికరమాత్మలో నిలిపి గాంచుచు భూరికులాభిమానముం
దనరగబూని విత్తము ముదంబుగగూర్చి కలాగృహంబులన్
పనివడిబెట్టి విద్యలను బాలుర దీరగ జేయగావలెన్॥

మిగులునె సర్వదానములు మేదిని విద్యకుజూడ నాత్మకో
తగినటువంటి ధర్మమిది తథ్యము చోరులపాలుగాదు ఘో
పగతురచేతులన్బడదు బాధలగూర్చదు యింటగెల్చి ర
చ్చగెలువగానగు న్దరవిచార మొనర్చి జయంబుగూర్చనా।

సికింద్రాబాదులో రామగోపాలుగారి దర్శించుటకు వ్రాసిన పద్యములు. ముస్త్యాలవారికి వీరికి యుండబడిన వైమనస్యభావములో సత్కరింపబడలేదు. 2.10-22.

సీ॥ గట్టించినావు జగన్నాథ సత్యనారాయణదేవళాల్ రాజిలంగ
బెట్టించినావు సత్ప్రీతి సంస్కృతపాఠశాలల బాలురు చదువునటుల
గావించినావు విఖ్యాతదానంబుల, విప్రులకెన్నియో వివిధగతుల
పూజించినావు సంపూర్ణ భక్తిజెలంగ, నిష్టదైవంబుల నెంచిమించి

గీ॥ కోర్కెలనుదీర్చి యాచక కోటికెల్ల। కల్పభూజంబుగాఖ్యాతి గాంచినావు
యీవుజేయని ధర్మంబు లేవిగలవు। భవ్యగుణజాల రామ గోపాలశీల॥

సీ॥ యాత్రికులకు రైలుకగు ధనమొసగుచు, బ్రాహ్మణవితతుల బంపినావు
జేరివేడిన బ్రహ్మచారులకును వేడ్క,మించి పెండ్లిండ్లు జేయించినావు
కాలంబునను జన్నిగట్టుల తిలకించి, యెంచి వద్దుల నొనరించినావు
బాటసారులుదిగ పాకవసతులకు, మంచిసత్రముల గట్టించినావు

గీ॥ భాసురపురంబు బెజవాడ పట్టణముల। కాశిరామేశ్వరంబుల ఖ్యాతివెలసె
నిసువుకైనను దెలసును నీదుపేరు। రామగోపాలగుణజాల రమ్యశీల॥

గీ॥ ధర్మరక్షణమున ఖ్యాతి దాల్చెమున్ను
రామచంద్రుండు గోపాల రాయులెలమి
శీలవర్తనమునగొని చెలువుగాను
బోలుదువునీవు రెంటికి జాలకున్న
రామగోపాలనామము రాదునీకు॥



గీ॥ వైద్యగ్రంథంబు లొకకొన్ని వ్రాసినాను
వాటి ముద్రణకై బూని వచ్చియుంటి
ధనసహాయము జేయుచు దయనుగనుమ
పరమగుణధామ రామగోపాలనామ॥

అయ్యగారి కామరాజుగారినిగూర్చి (పెదగాడవిల్లి, అమలాపురంతాలూకా) వరంగల్లులో వీరి స్నేహితము. 1-11-22.

వరహార్షంబున బంధువట్లగనుచు న్భత్యాదులన్బట్టి స
త్కరుణన్ జూచెను యోరుగల్లునగరీ ధామంబునన్ జక్కగా
మరియాదన్గొనియాడ నాకు దరమే మాయయ్యగార్వంశజన్
గురుతుల్యంబుగ కామరాజునెద సంకోచంబులేకెంచెదన్॥

బాబని కామరాజుగురు పత్నిని బిన్నగబిల్వ మించుగా
రాబముతోడ జూచుచు తిరంబగు బుద్ధినివెల్లడించుచున్
జాబులవ్రాయుమంచు సరసంబుగ దెల్పెను వచ్చువేళ వి
ద్యాబలమొప్ప వారి వనయంబును మానసమందునెంచెదన్॥

అనయము నేర్పు సేవలభయంబునజేయుచు భాషలందు స
ద్వినయము జూపుచున్ మదిని దేవునిగా దిలకించుచున్వెసన్
కనులకు జబ్బుజేసిన సుఖంబుగ పోషణజేసె భర్తనా
వనితను సుబ్బమాంబ నతిభక్తినిజాతును పిన్నియంచెదన్॥

కులమభివృద్ధిజేయు నెద గోరుచు మానయుగంబుబుచ్చిన
బిలువరు భోజనంబునకు బెద్దలు వైశ్యసమాజమందున
న్నలరుచు కామరాజు మరియాదగజూచెను నోరుగల్లునే
వలనరుణంబుదీర్తు మరువంగమది వారల జీవితంబునన్॥

తనువున ప్రాణముల్గలుంగ దైవముతోడ్పడనేని కోర్కితో
జని పెదగాడవిల్లికిల చక్కగ వారినిగాంచి వేడ్కలో
చనములు తృప్తిజెందునటు సల్ప నమస్కృతులేను భాగ్యమం
చనిహృదయంబునన్దలతు నాదరమొప్పగగాంతు సేమముల్॥

నంబూరిలో మాబాలురకు మొదట నుచితముగా నాంగ్లము గరపిన విద్యార్థినిగూర్చి (యీ బాలుడు నంబూరి పానయ్యగారి కుమారుడు)

తృటికాలంబు వృథానొనర్చకను బుద్ధిన్విద్యకే నిల్పుచున్
హాటముజ్జేయక తల్లితండ్రుల సదా యానందమేపారగా
పటుభక్తిన్ గనుచుండి స్వర్గమరిగె న్బాలుండు నంబూరి వేం
కటరంగాఖ్యుడు చిత్తమందలపు రాగం దుఃఖమెట్లాపెదన్॥

శ్రీయుత దర్శి చెంచయ్యగారు కారగార విముక్తులై గుంటూరు వచ్చినపుడు చదివిన పద్యములు. 30-1-20 సిద్ధార్థి నామసంవత్సరం.

శ్రీమహితాత్ములై ప్రజల సేమమె జూచుచునుండు నెవ్వడా
స్వామిదయాపరుండు గుణ సాగరుడవ్యయుడాదిమూర్తి ని
న్నేమరు సేద్యవృత్తులను వృద్ధినొనర్చగ జేయుచున్నదా
ప్రేమనుగాంచుగాతదగు పెంపునుబొందగ చెంచయార్యయా

నాలుగు వత్సరంబులు మనంబలరంగను దీక్ష సేద్యవి
ద్యాలయమందు జేరి విబుధాళులు మెచ్చగ నభ్యసించి వా
చాలుడటంచు పేరుగని చారుగుణంబుల వన్నెకెక్కితా
రోలలితాత్మ చెంచయ్య విశోత్తమ మిత్రజనంబు లెంచగన్

ఖేదము జెందకన్మిగుల క్రిందటి ధైర్యము వీడకెంతయున్
మోదముతో ప్రవాసమును బొందియునోర్చుచు కష్టకాలమున్



నీదగు మానసంబునను నేర్పుగజూచుచు ముక్తినొందితి యా
ర్యా? దయచేసితీ విటకు యార్యులు మెచ్చగ చెంచ
[యార్యయా॥

తెలుపక దోషమెంతయును దృష్టివిచారణజేయకేయెదన్
కలవరమంది బట్టి నిను కాశ్యపిపాలకు లట్టె బంధిఖా
నలో బడవైచి కష్టముల నంతముబెట్ట జలించకెంతయున్
కులమునకున్ యశంబు నొనగూర్చితివయ్య జయంబునీకగున్

సిరతము శిక్షచే మిగుల నేరిచి నేరుపుతోడ నగ్రిక
ల్చరు విజయంబునొంది దగ చక్కగ బాలురు సంతసించగన్
నిరుపమ మాతృభూమికి మనీషను జేరితివయ్య జేరి యా
దరమున మాదు విన్నపమె దంగని యొప్పవె సంతసంబునన్

ఆర్జనజేసికీర్తి విబుధాంధ్రులు మెచ్చగ మానసంబు లా
ఘూర్జరవైశ్యరత్నమతి కోవిదగాంధి మహాత్ము నట్టులన్
దుర్జనపాళి నంపగను దోడ్పడి నీదగు శక్తిమించ వి
స్ఫూర్జిత దివ్యభావము విశోత్తమ చెంచయగుప్తసోదరా॥

జాలినిబొంది బీదలను చక్కగ గాచుచు నుండునట్టి పాం
చాల విశోత్తముం డెటుల శక్తినిజూపుచు కష్టపుంజముల్
కాలము వెంటబొందె నటు గాంచితి వెంతయు సుస్థిరంబు నా
ర్యా? లవమాత్రమేని మరి యాదగనుంగొన మాకు శక్యమా

స్వచ్ఛపు వర్తనంబున నసాధ్యపు బాధలనెల్లబొంది నీ
సచ్చరితంబు దేశముల సర్వముజూపుచు శాంతమూర్తివై

వచ్చితివయ్యా? యాంధ్రజన వైశ్యులఁజూడగ జన్మభూమికిన్
మెచ్చితి మంతరంగముల మిత్రులమందర మార్యశేఖరా॥

జదివిన విద్యశద్ధతుల చక్కఁగ కర్షకపాళి కంతకున్
వదలక నేర్పి నూత్నమగు బైరులు బెంచి ఫలంబు నొందగన్
కొదువలు లేక యుండునటు గూర్చియనారత మాంధ్ర
[ మాతకున్
ముదము నొసంగుమయ్య పరిపూర్ణ చిరాయువు గాంచి
[ భూస్థలిన్॥

ఆర్యవైశ్య యువకుల సాహితీ, సంఘము. నవమవార్షికోత్సవము
ప్రార్థన పద్యములు.

సవనములేమహేశ్వరుడు సంతసమందగ జేతురో ద్విజుల్
దివిజులు సంతసంబెవని దివ్యపదంబుల పూజసేతురా
భవహరుడేయెడన్ కరుణ బాయక జూచెడుగాక వైశ్యస
ద్యువకుల సాహితీసమితి నొప్పుగ వృద్ధిజెలంగ నేయెడన్॥

రవిశశు లెవ్వరాజ్ఞ నిల రాత్రి దివంబుల సంచరింతురో
లవమును మీరకా జలధి లక్ష్యముజూపును యే చరాచరా
త్మ విభుని శాసనంబునకు ధర్మముబూని మెలంగు వైశ్యస
ద్యువకుల సాహితీసమితి నొప్పుగ నాతడు జూచి గాచెడిన్॥

భువి నభము ల్వెలుంగు పరిపూర్ణతరంబుగ నెవ్వరాస్వయం
భవుడు పురాణపూరుషుడు భవ్యఘృణామయుడౌచు వైశ్యస
ద్యువకుల సాహితీసమితి నుర్విని బెంపొనరించి సంతసం
బు విమల భారతాంబ నెద పూజలసల్పెడి బుద్ధినిచ్చెడిన్॥



సీ॥ వైశ్యకులంబున వైభవోపేతమౌ, వంశంబునను బుట్టి వన్నెమీర
నాంగ్లభాషాదుల నభ్యాసమొనరించి, న్యాయవాదిగనుండి హాయిమీర
ప్రాడ్వివాకుండౌచు ప్రజ్ఞావిశాలుడై, తీర్పులజేయుచు దివ్యగతిని
ధర్మశాస్త్రంబుల దారిమీరకొకింత, సత్యమేజయమని సంతతంబు
గీ॥ ప్రజలమన్నన కెంతయు పాత్రుడగుచు
నార్జనమొనర్చుచుండెనో యనవరతము
కీర్తినంబూరు గోపాల కృష్ణరాయు
నలర బ్రోచెడి సర్వేశు డమిత కరుణ॥

ప్రవిమలకీర్తిచే వెలిగి పాఠనజేయుచు పత్రికాతతిన్
నవరసభావముల్గలిగి నవ్యతరంబగు విద్యలందు స
ర్వవిధుల భారతాంబ పద పద్మములెంచుచు భక్తితో వణి
గ్యువకుల సాహితీసమితి యొప్పెడి గొప్పనుగాంచి యెల్లెడన్

రక్తాక్షి నామసం॥ ఆశ్వీజ శు ౭ లు శ్రీమద్గుంటూరు చలమయ్యగారి సత్రమున విద్యావాచస్పతి సాహిత్యసరస్వతి బాలకవిశిఖామణి శతావధాని శ్రీయుత దోమా వెంకటస్వామిగుప్తగారు అష్టావధాన మొనరించినపుడు చదివినపద్యములు.

హితమా ధారణశక్తినంతయును సాహిత్యంబు దత్తాక్షరీ
గతియున్నట్లు సమస్యపూరణలు సద్గ్రంథార్థబోధాళి స
మ్మతి జెందెన్ బుధవర్గమెంతయును దోమా వెంకటస్వామినీ
చతురత్వంబు నుతింపగాదరమె వాచాపూర్ణ సంపత్ ఖనీ॥

కవులెవ్వారలు ప్రస్తుతంబు మనలో గాన్పించరెందున్ బుధ
స్తవుడౌ మామిడి వెంకటార్యులరిగెన్ స్వర్గంబుకున్ వైశ్యక
ర్మవిధానంబుల దెల్పి చక్కఁగను దోమా వెంకటస్వామి నీ
వవధానంబులొనర్చి యూరుజులలో ఖ్యాతిన్గడున్ బొందితౌ॥

సామాన్యుండని యెంచితింతకును నీ సంపూర్ణ పాండిత్యముం
ప్రేమంజూచియు సంతసించితి నహా పెంపొందుచుం గీర్తినే
వేమారున్నతిదాల్చి పండితులచే విత్తంబు చేకూర్చుచుం
దోమా వెంకటసామి ధర్మములకుం దోడ్పాటు గావింపవే॥

సీ॥ సార సుధాధార సరణిమించగను సద్యోవర్ణంబున నొప్పినావు
పూరించితివి కష్ట ముప్పడకెంతయు నవలీలగా సమస్యాద్వయంబు
నధికప్రసంగంబు లాకాశ పౌరాణి కములగెల్చితివి యాగంటలందు
దత్తాక్షరీ నిషిద్ధాక్షరి యందున లోపంబుగా ప్రజ్ఞ జూపినావు

తే॥ మరియు దాగ్ధశ్రీతమించి విమర్శనాగ్ర।విషయముల నెల్లదేలుచు వేడ్కమీర
జయము బొందితివయ్య పూజలనొనర్తు।పద్యపంచక సుమముల బాగుమీఱ

గీ॥ ఆర్యవైశ్యులలోన శతావధాను
లగుపడని కొరతదీర్చితి వప్పనీవు
సంతసించితి హృదయ సత్సారసమున
మరువనెన్నడు వెంకట స్వామిగుప్త॥

జమీన్దారు శ్రీయుత మోతే గంగరాజుగారిని దర్శించుటకు వ్రాసినపద్యములు
8—10—24

కులముం గౌరవమందజేయుటకు సంకోచంబునుల్లేక వి
ద్యల వృద్ధిన్దనరార బాలురను కావ్యంబుల్పఠింపించగా
వలయున్నట్టుల దేశభాషలను భావ్యంబౌను నేర్పించ వ
ర్తిలసన్మార్గమునందు పేరుగన మోతేగంగరాజాగ్రణీ॥

పరమప్రీతిని నిన్ను జేయుచును నాభావంబులన్దెల్పి స
త్వర పొత్తంబుల ముద్రితంబునకు విత్తంబుల్దగం గూర్చి భా



సురమైయొప్పు యశంబునొందదగు సంశోధించుచున్పండితుల్
స్థిరతం దప్పులదిద్ద సత్కృపను మోతేగంగరాజాహ్వయా॥

మనవైశ్యాళిని పండితోత్తములు సామాన్యంబుగా లేరు శో
ధనజేయం గవులంతకన్న యరుదా ద్రవ్యంబు ప్రాధాన్యమా?
గొనరెవ్వారలు సత్కృతుల్ క్రమముగా కోర్కెల్దగన్మించి శ
క్తిని రామేశము తిప్పయల్లలరు మోతేగంగరాజాహ్వయా॥

నిధియై విద్యనుబుచ్చి కామకవి నేత్రావధానంబులం
విధియుక్తంబుగ జేసి మెప్పుగొనుచుం వృద్ధాప్యముం జెందె స
త్ప్రధితాత్ముల్మన వైశ్యసంఘమున దూరస్వారయుం లేరు ఖ్యా
తిధనంబులగూర్చి జెందుదురె మోతే గంగరాజన్మణీ॥

సామాన్యంబుగ నూటికొక్కకవియు న్సాధించగాలేరు సూ?
మామిత్రుండును బాలసత్కవియు దోమా వేంకటస్వామి స
త్రేమోద్దీపితు డొక్కడుండె నిచటం బెంపొందుచుం [వైశ్యులం
ధీమంతుల్గన చోద్యమా మిగుల మోతేగంగరాజోత్తమా॥

ఏవంకన్గన వైశ్యజాలమున నెందే జూచినం సత్కళల్
భావింపన్మరి గానమందునను సత్పాండిత్యమందు న్ఫిడేల్
ప్రావీణ్యంబు మృదంగవాద్యమున సారంబెంచగం నున్న మో
తే వంశాగ్రణి దివ్యసద్గుణ సుధాబ్ధి గంగరాజన్మణీ॥

వశమానన్నియు శిక్షణంబు సరిగా భావించి గావించినం
దిశలన్వెల్గరె విద్యలాంగ్లమున సందేహంబునం దీర్చరే

పశివారిన్నెటుజేయ నట్లగుసు రేపట్లఁదరన్ జాతులన్
త్రిశరాబ్ధంబుల పట్టుబట్టదగు మో తే గంగరాజార్యమా॥

రక్తాక్షినామవత్సర ఆశ్వీజమాసములో శతావధాని దోమా వెంకట స్వామిగారు శతావధాన మొనర్చినప్పుడు చదివిన పద్యములు.

దోమావంశపవిత్రసారగుణసం దోహాబ్ధి శ్రీవెంకట
స్వామీ నీదుశతావధానమెలమిన్ సంతుష్టిగావించె స
త్కామంబుల్ఫలియింపజేసెడిని సీతారాముడెంతేకృపన్
సేమంబుల్గనుగాంచగన్ వి బుధులాశీర్వాదముజ్జేసెడిన్॥

18-10-24 తేదీన బెజవాడలో జరిగి అష్టావధానాంతమందు చదివిన పంచరత్నములు.

సుకరశతావధానియను శోభిలు బిర్దముదాల్చితీవు బా
లకవిశిఖామణీయనెడు లాలితనామముబొంది దేవతా
నికరగురూత్తమాఖ్యసరణిన్గొని విద్యనుభూరివేడ్కమీ
ర కవులుమెచ్చ సాహితిసరస్వతియంచును పేరుగాంచితో
ప్రకటనజేతు వైశ్యకవిరత్నమటంచును యీ సభాస్థలిన్
నొకబిరుదంబుగైకొను మహో? ధర వెంకటసామిగుప్తరో॥

సీ॥ ధృతిబూని యా తిరుపతివేంకటేశ్వర, కవులవద్దను నేర్చె కవితమెవడు
ఘను డింద్రకంటి వేంకటసుబ్రమణ్యా, పండితుజేరి గ్రహియించె ధృతినెవండు
విబుధుడౌ వనుముల విశ్వనాథాహ్వాయ, సన్నిధిగనె విద్య సరవినెవడు
బాలకవిశిఖామణీలలితఖ్యాతి, దాల్చెను వైశ్యుల దలపనెవడు
గీ॥ అంచితాష్టావధానశతావధానములను జయమొంది పతకముల్బొందెనెవడు
యతడు దోమాకులాబ్ధిసుధాంశుడైన। వేంకటస్వామిగుప్తదీపించుగాత॥



సేమంబుల్పొసగించి భక్తులను సుశ్రీమంతులన్జేయుచున్
వేమారున్నుతిసల్పు మానిసులకున్ వేల్పుల్బుధుల్భూరిహ్రా
ద్ధామంబందున సంతసంబుగను నాదైవంబువాత్సల్యతన్
దోమా వెంకటసామికెల్లపుడు సంతోషంబులన్గూర్చెడిన్॥

క॥ శ్రీమంతుడవై సిరతేటు
క్షేమంబున నుండుమయ్య జెందుము సుఖముల్
దోమాసత్కుల వెంకట
స్వామీ సత్కవనధుర్య సన్నుతచర్యా॥

క॥ ఏవిభుకటకుడం చని
యేవేళ నుతింత్రు మానులెంతయు భక్తిన్
ఆవరధిష్ణుడు శ్రీదో
మా వెంకటసామినీకు మంగళమిడుతన్॥

శ్రీమద్రక్తాక్షినామసంవత్సర ఆశ్వీజ శు ౧౨ లు (9-10-24) ద్వాదశీ పారణకు వెళ్ళినప్పుడు గొర్లమంద సుబ్బదాసుగారినిగూర్చి చెప్పినపద్యత్రికము.

ఫలముల్గోరక దేవతార్చనమునన్ ఫాలాక్షునిన్ పార్వతిన్
జలజాతోద్భవుడైన బ్రహ్మపతి యౌ సారస్వతీదేవినిన్
జలజాక్షుండగు విష్ణుమూర్తికములన్ సత్పూజలం గొర్లమం
దల సుబ్బార్యుడొనర్చు నేత్రములసంతస్సించి యుప్పొంగితిన్॥

పాయక వేదపన్నముల పారణజేయుచు భక్తితో నుపా
ధ్యాయులవద్ద చక్కగను బాత్తసుదాత్తములన్గ్రహించుచున్
ధీయుతులౌ ననంగ మరి దృష్టిగబూనుచు బ్రహ్మచర్యమున్
జేయుచు ద్వాదశీవ్రతము చెల్వవహించితివయ్య వైశ్యులన్॥

ఘనతఁ యాత్రలనన్ని సల్పుచు వెసఁ గాంక్షించి
[ముమ్మారు ద
ర్శనముఁజేసితివయ్య యాశ్రమములఁ సన్యాసులఁ యోగులఁ
తనివిఁదీరగ దేవపూజల సదా ధన్యత్వముఁ జెందితీ
వనఘా వైశ్యకులోత్తమామహిత యా ర్యా
[సుబ్బదాసాహ్వయా॥

సీ॥ యజ్ఞదానాధ్యయ నాదుల కధికార,మునుగల్గి వెల్గు నే ముఖ్యకులము
సన్మంత్రకర్తలౌ సంకీలవత్సథ,లందు లేజాతినిం పొందనైరి
చల్లనిగతులొప్పు జైవాత్సకబుధాదు, లేవంశమున జనియించి నారు
కావ్యంబువ్రాసిన ఘనుడు మాఘాహ్వయు,డెందులబుట్టె కవీంద్రులెన్న
గీ॥ వెలయజనియించె నేది ఋగ్వేదమందు
ప్రౌఢిమముగాంచె సైద్ధాన భట్టిమంత్రి
గుప్తరాజులు బుట్టిరే కులమునందు
నట్టి సద్వైశ్యవర్ణ మెం తొప్పారు నెందు॥

శ్రీయుతమై నిరంతరమ శేషహితార్యజనాళిసేవ్యమై
కాయజవైరి పూజలురు కాంక్షితమై వరధర్మమార్గబో
ధాయతమై ప్రశస్తనుగుణార్ణవమై దనరారు దివ్యమై
శ్రేయసగోత్రమెంతయు నదీ నదపుణ్యజలప్రపూతమై॥

అందు

మాటలలోన బొంకక న మానుష మొందక వర్తకంబునఁ
కోటులగూర్చి నాణ్యముల కొల్లగ నర్థులకిచ్చి బోచుచుఁ
సాటియొకింత లేక బుధ సంఘమునందున పేటలందు మా
జేటిసువంశ మొప్పు సుఖ జీవనరాజితమాచు నాంధ్రులఁ॥



మహి మాజేటిసువంశమందు బొడమెఁ మర్యాద
[లన్నించి స
ద్విహితుల్మెచ్చగ పానకాలు ఘనులౌ విద్వాంసులౌ నానవఁ
మహి లక్ష్మాంబను భార్యగాగొనియె ప్రేమన్బుత్ర
[కాంక్షార్థియై
తుహినాంశుం డల రోహిణీవిధమునఁ తుష్టిఁ మదిఁ
[బొంగుచుఁ॥

కాలము వెంటబుత్రులను గాంచెను మువ్వుర కీర్తికాములఁ
శీలుడు వీరయాహ్వయుడు సింధుసమానగభీరు డొంచ ము
త్యాలుసహోదరుండు బుధ తండహితుండుగుణోత్తముండు శ్రీ
శైలము ధీరశైలము వ శంకరశంకర భక్తు డిమ్మహిఁ॥

సీ॥ సోదరుల్మువ్వుర భేదంబు లేక వ్యాపారమందున వన్నెకెక్కి
అవిభక్తలౌచు మర్యాదను గడియించి, ద్రవ్యార్జన మొనర్చి తరుగులేక
గురుతర మంగళ గిరి సమీపము చేత,పూడిలో మాజేటి ముసలయ ప్ర
తిష్ఠ సోమేశ్వర దేవాలయంబును, పునరుద్ధరించిరి భూరిభక్తి
గీ॥ కోరికలరగ నాయేటు కూరి ప్రజకు। మేలుజేయగ దలచి శ్రీశైలఘనుడు
దివ్యజలపూరకూప ప్రతిష్ఠ యొకటి।జేసె పుణ్యంబు చేకూర శీఘ్రగతిని॥

గీ॥ దనరముత్యాలు సోమార్య దత్తసూను
డగుచు సంతోష ముప్పొంగ మగువ నాగ
మాంబ భార్యగ జేకొని యంబికేశు
కరుణ సంతానమునగాంచె గారబమున॥

సీ॥ సతతము ప్రాణేశు నతిభక్తి సేవించు, వేడ్కలుప్పొంగగ వీరమాంబ
సోమాహ్వయుడు తను శోభితుడౌ వెంక టప్పాఖ్యులరిగ నీ యవనివిడచి

గురుతర సద్దానపరుడు ధర్మాత్ముడను, గురవయార్యుడు హితగుణయుతుండు
కాత్యాయనీపూజ గావించు సద్భక్తి, రాజీవలోచని రంగమాంబ

గీ॥ భూరి విద్యాధిపుడు నాగ భూషణుండు
చనియె బారట్ల జరుపుచు జనులదోర్లి
ధీయుతుండగు హనుమంత రాయుడెలమి
మేలుగోరెడి సుబ్బాంబ మీనసేత్రి॥

నిరతంబున్ గిరిపుత్రికన్ గొలుచు మా ణిక్యాంబ గర్భంబునన్
వరకీర్తుల్ నృసింహాఖ్య సుగుణ సుభద్రాంబ నాసుందరిన్
గురవయ్యార్యునకు భార్యగా పడసె సంకోచంబునున్ లేక నా
తరుణీరత్నము పుణ్యసాధ్వి కలిగె నైపంబుగా నెంచెడిన్॥

సీ॥ పుట్టిన కోడూరు పురమున గావించె, వైభవమలరగా వనప్రతిష్ఠ
వేణుగోపాల కోవెలయందు దీక్షతో దారుధ్వజంబును దనరనిల్పె
వీక గుంటూరు తటాకము చెంతను, వీరాంజనేయుని వెలయజేసె
ధర్మమే తోడని దలచి మనంబున, బేదసాదల నతి ప్రీతి గాంచు

గీ॥ మిత్రజనములు కోరిన మేలుగూర్చు
సాయమొనరించు విద్యార్థి సమితికెపుడు
బంధుగులలోన మర్యాద బడయుచుండు
గురయాహ్వాయు డెన్న సద్గుణయుతుండు॥

... ... ... ...

శ్రీమద్గుంటూరు శారదానికేతనవార్షికోత్సవమున జదివిన పద్యములు

సరణిన్ దక్షిణ దిక్ప్రశస్తములలో సర్వేశునాజ్ఞన్ సదా
జరియించున్ రవిచంద్ర లోపుగను నక్షత్రంబులల్లేదగన్
శరధుల్ మీరక నేరి శాసనమునన్ స్థానంబులందుండునా
కరుణాస్వాంతుడు శారదానిలయమున్ గాపాడునెల్లప్పుడున్



స్థానంబున్ త్యజియించికోర్కెననుసంతాపంబునున్ బొందకన్
బూనన్. సంస్కరణంబులాత్మగురు సద్బోధంబులెంతేనియున్
సానందంబున నట్టి యున్నవకులున్ స్వాంతంబుదీపింప ల
క్ష్మీనారాయణునేలు నీశ్వరుడు లక్ష్మీబాయమాంబాసతిన్.

దనరెడి చిత్రలేఖన విధానము సంస్కృత శిక్షణంబునున్
ఘనతరగాన సుస్వర వికాసము కుట్టుపనుల్ క్రమంబు వ
ర్తనములలంకరాకృతులు గమ్యతరంబగు ప్రేమునల్లికల్
మనమున సంతసంబొదవ నేంటల కోటలు బాలికల్గనన్.

వంశవృత్తము. పికాంత దూరుండగు విశ్వనాథుడై
హితాసు సౌఖ్యంబుల నించుచున్నదా
వికాసమందన్వర వేద్యశారదా
నికేతనంబున్ గను నిత్యలంబుగన్.

పంచచామరం శుకాది మౌనిలోకమెల్ల జాతురాత్మదేవతా
నికాయమెల్ల భక్తిబూని నేర్పుతో నుతింతురా
ప్రకాశమానుడైన భక్తపాలుడోము శారదా
నికేతనంబు బాలికాళి నీతిగాంచి సర్వదా.

రక్తాక్షివత్సర ఆశ్వీజ బ 3 లు బుధవారం

శ్రీమద్రక్తాక్షినామ సంవత్సరాశ్వీజ శు ౧౫ లు శ్రీమత్కన్యకా పరమేశ్వరీ జాతీయకళాశాలలో ఉపాధ్యాయులుగా ప్రవేశించినపుడు వ్రాసిన సన్మాన పద్యములు.

దనరకన్యక దేవిగేహమున శాస్త్రంబులన్ జేసియున్
వెనకాడన్ గురుధైర్యమూనుచును ప్రావీణ్యంబుగాపాఠశా

ల నుపాధ్యాయునిగా నొనర్చితివి యే లానీఋణం బేను దీ
ర్తును జన్మంబున రేకపల్లికుల సద్గుణాబ్ధితారాపతీ
జనునా భాస్కరరాయ డెందమున నీసాహాయ్య మెల్లప్పుడున్

సీ॥ బాల్యంబునను పేరు బడసిన, యుప్పుటూర్వేంకటపున్నయ్య శంకలుడుప
వైష్ణవోత్తములని వైశ్యకులంబున, బరగునమ్మాళ్వారు సరణిదెల్ప
ధర్మకార్యంబుల దనరిన గుంటూరు, నరసింహరాయఁడాదరముఁజూప
పోలిశెట్టికులాబ్ధి పూర్ణరాకాశశి, యాదినారాయణ మోదమొసగ

గీ॥ దాస్యవృత్తియటంచని దలచినట్టి భావమును మార్చికొనుచు నుపాయమునను
కన్యకాపరమేశ్వరీ ఘనకళాల, యమునజేరితి బోధకత్వమువహింప.

గీ॥ కార్యదర్శులనట్టుల ఘనతమించు
ధాన్యవాణిజ్యసమితి సౌజన్యమొప్ప
సకలకల్యాణ వరదాత సత్యమూర్తి
కలుషదూరుడు కరుణతోఁగాచుగాత।

కవులున్నారని వైశ్యులందుదెలుపన్ గ్రంథంబులన్ వ్రాసితిన్
నవిముద్రించను బూని మిమ్ములను సాహాయ్యంబునుం గోరగా
చెవులన్బెట్టరు సత్కరింపరెవరున్ సిగ్గున్మదిన్ జెందకే
లవమున్బానితి జాతిసేవకది యెల్లన్ తప్పుగాదో చెడెన్.

ఇష్టముగాని కార్యమున కేనుగడంగుట బుద్ధిహీనమే
స్పష్టము? యూరకుండనను బైటికిలాగుచు మిత్రవర్గముల్
తుష్టిని గూర్చిసంఘమున దొల్గకనుండగ చక్కజేతురా
పుష్టిని జూచిగంతులకు బూనుదు వెఱ్ఱియటంచు నెంచకన్



జాతికి సేవజేయుటకు సంతతమున్ శ్రమకోర్చిదిగ్గుచున్
బ్రీతిని జీవనంబునకు బేరముసారముమానినందునన్
చేతుల దమ్మిడిన్గనక చెందగకష్టములయ్యె లేనిచో
తాతల తండ్రులట్టులనె దాల్చి ధనంబుల సౌఖ్యమందనే॥

కీలుగ్రహించి వాదనల గెల్వగబూనియు పుస్తకంబులే
వేళనుజూచి ఖండనల వేడ్కలిఖించితి మాని బేరమున్
పోలితి నింకనేమియును శోధనజేయగ లేనునిక్కమీ
కాలమువ్యర్థమైచనెను గౌరవమైనను జెందనైతినా।

భయమునులేక వైశ్యజన పాళినొనర్చెడి దూషణంబుల
న్నియునవలీలఖండనల నేర్పునజేయుచు శక్తిజూపి యెం
తయు మరిసాయమెవ్వరును ధైర్యముతో నొనరించకుండినన్
దయగని విత్తమైననొక దమ్మిడొసంగిరు వైశ్యపుంగవుల్।

ద్వాదశవైశ్యమహాసభ గుంటూరు 5-12-24 ప్రారంభపద్యరత్నములు.

శ్రీరమణీయమైదనర సృష్టి విచిత్రముగా నొనర్చుచున్
నేరుపుమీర జీవులను నిర్మలమొప్పగఁగాచి పెంచునే
ద్ధీరుడు లోకరక్షకుడు దీనజనావనుడాదిమూర్తి గుం
టూరు వణిఙ్మహాసభ పటుత్వజయంబు వహింపజూచెడిన్.

బేరములందువర్తిలుచు పెంచుచునెప్పుడు నాలమందలిం
పారగ సేద్యమున్గని దయామయులై ప్రజలెల్లవిద్యలన్
నేరిచి దానధర్మముల నిర్మలమొప్పగ నాచరించ గుం
టూరు వణిఙ్మహాసభ మహోన్నతరీతులబోధ జేసెడిన్.

వేదహితుండు దివ్యతర వేలుపువిశ్వమయుండు రక్షకుం
డాదిమమూర్తి సర్వసచరాచరనాథుడు దీనపోషుడీ
ద్వాదశవైశ్యమండలిని ధర్మవిధానుకమానుచు వర్తిలన్
మోదముతోడగూర్చెడిని భూరికృపామయుడౌచుమాయెడన్

మాసమునుండి సౌఖ్యములమానుచు కష్టముకోర్చి వేడ్కతో
జేసెను మద్దివంశమణి శ్రీయుత వెంకటసుబ్బయార్యుడా
హా? సమకట్టి రందరు సహాయముజేయగ మీదపూనికన్
భాసిలెసభ్యవర్గముల పండితమండలి చేతనింపుగన్.

దగపలునాడుసీమనురు ధైర్యముమీరగబూని కోర్కెతో
నిగమవిధానకర్మలను నిర్వహణంబొనరించి ముందు బం
దుగులకుదెల్పి శాస్త్రముల దృష్టినిగాంచుచు నన్నశ్రాద్ధముల్
సుగమమటంచుజేసె ధర సూరెకులీనుడు శేషయార్యుడెం
చగ నిటుసల్పమార్గమగు సర్వవణిగ్వరు లూర్జితంబుగన్॥

సలిపిరి సంతసంబునను సర్వభరంబునుదాల్చి రెంటచిం
తలపురవైశ్యులెంతయును ధర్మములన్గ్రహించ భూరిమం
డలప్రథమార్యవైశ్యసభ డంబుగ నీపురిజేయబూనె వై
శ్యులు గడురమ్యమొప్పుచును శోభిల దివ్యముగామహాసభన్

తృటికాలంబున శాస్త్రచర్చలను సందేహంబులన్దీర్చగా
పటిమంబున్గలయట్టి పండితుడు సత్ప్రాజ్ఞుండు శాస్త్రంబులన్
ఘటికుండౌ నురుధైర్యవంతుడిల సత్కార్యంబుల న్గ్రంథి వేం
కటగోపాలుని నాయకత్వమిట సంకాశంబునున్ జెందెడిన్॥



బాలారిష్టములెల్లదొలగెనిక సంభావించగా నేటితో
మేలున్గూర్చుచు వైశ్యమండలిని సమ్మేళంబునున్జేసి సు
శ్రీలన్దాల్చుచు భారతంబునను దారిద్ర్యంబులన్బాపుచున్
వాలాయంబువణిఙ్మహాసభ గురుత్వంబొప్పి చెన్నారెడిన్॥

గీ॥ అతులదూరమునుండి కులాభిమాను
లగుచు విచ్చేసినటువంటి యార్యవైశ్య
జనములకు నెల్ల సోదరీ మణుల కిచట
వరసభానాయకునకు సుస్వాగతంబు॥

౧౨ వ వైశ్యమహాజనసభలో జదివిన పద్యములు.

గీ॥ శ్రీరమేశుడు భక్తవశీకరుండు
వేదవేద్యుడు రక్షకు డాదిమూర్తి
ధర్మముల బెంపుగాంచెడి దారిజూపి
గర్తపురివైశ్యసత్సభ గాచుగాత॥

ఖద్దరుగూర్చి.

విద్దెలనేర్చి పాటలను వీనులవిందుగ బాడనేర్చుచున్
రొద్దిక శాకపాకముల నొప్పుగజేయ గ్రహించి మిన్నగన్
ముద్దియలెల్ల రాట్నమున ముచ్చటగా దగనూలుదీయుచున్
ఖద్దరుగట్టవేడెదను కాంతులు మించి సుఖంబులిచ్చెడిన్।

సభా కలకలము.

వినుకును జెందె మద్దికుల వేంకట సుబ్బయగుప్తశర్మ్ల సం
తసమును వీడెనాయకుడు ధర్మములన్వినకుండ వీనులన్

మసలుచు గంద్రగోళమును మాటికి మాటికిఁ జేయుచుంటచే
పసగనుడయ్య సభ్యులిక భక్తిని చర్యలమాని మాటలన్॥

శ్రీయుత నాళము రామలింగయ్యగారినిగూర్చి

బాలవితంతువర్గముల బాధల దీర్పగ స్వాపతేయమున్
వేలును లక్షలిచ్చుచును వేడుకశాలను నిల్పి ప్రేమతో
పాలనజేయుచుండె దయ భాగ్య మనందగు వైశ్యజాతికిన్
నాళము రామలింగము ఘనంబగు శాశ్వితకీర్తి మించెడిన్॥

మహారాజశ్రీ తూనుగుంట్ల నాగరత్నముగారినిగూర్చి.

శ్రీకరుడౌచు గర్తపురి చిన్నతనంబున బేరుగాంచుచున్
ప్రాకటధీరమొప్ప పురపాలకవర్గమునందు నెన్నికన్
జేకొని సభ్యసత్పదవి చెల్వుగ నిప్పుడు తూనుగుంట్లవం
శీకుడు నాగరత్నము వశీకృతుడై ప్రజమన్ననంబులన్॥

శ్రీయుత పైడా వెంకటచలపతిరావుగారినిగూర్చి.

దయతో మిక్కిలి దానధర్మములు మోదంబొప్ప [గావించుచున్
నయమున్బ్రాచుచు కాకినాడపురిలోనంనిల్పె మేల్బాల సం
శయముల్దీర్చెడి పుస్తకంబులను సచ్ఛాత్రంబులన్గూర్చె నా
పయిడా వేంకటచలపతిన్దలచ సామాన్యుండె వైశ్యాళిలోన్॥

శ్రీయుత సాలస బాపనయ్యగారినిగూర్చి

సలుపుచు సేవ జాతికిని సర్వవిధంబుల శక్తిమీర వి
ద్యల జదువంగ బాలకులు ద్రవ్యము మిక్కిలి సేకరించునే



సాలససువంశవారినిధి సోముడు ధీరుడు బాపనయ్య న
ద్విలసితకీర్తికాము డురు వీరుడు కార్యములందు వైశ్యులన్॥

౧౨వ ఆర్యవైశ్యమహాసభలో శ్రీయుత మోతే గంగరాజు
జమిన్దారుగారినిగూర్చి చదివిన పద్యత్రికము.

కులమున్ గౌరవమందజేయుటకు సంకోచంబులున్లేక వి
ద్యలవృద్ధిన్దనరార బాలురను కావ్యంబుల్పఠింపించగా
వలయున్నట్టుల దేశభాషలను భావ్యంబౌను నేర్పించవ
త్రిల సన్మార్గమునందు పేరుగన మోతే గంగరాజాగ్రణీ॥

ఏవంకన్గన వైశ్యజాలమున నెందేజూచినన్ సత్కళల్
భావింపన్మదిగాన మెందునను సత్పాండిత్యమందు న్నిఖేల్
ప్రావీణ్యంబు మృదంగశబ్దముల సారంబెంచగన్ నున్న మో
తేవంశాగ్రణి దివ్యసద్గుణసుధాబ్ధి గంగరాజన్మణీ॥

వశమా నన్నియు శిక్షణంబు సరిగా ప్రాల్మాలకన్జేసినన్
దిశలన్వ్యాల్గరె విద్య లాంగ్లమున సందేహంబునున్దీర్చరే
పశివారన్నిటు జేయ నట్లగుదురే పట్లన్ధరన్ జాతులన్
త్రిశరాబ్దంబులపట్టుబట్టునగు మోతేగంగరాజార్యమా॥

గుంటూరు టౌన్ హైస్కూలు ఉపాధ్యాయులగు మ॥ రా॥ శ్రీ॥ మేడూరి
విశ్వనాథంగారినిగూర్చి వ్రాసిన పద్యములు. 1925.

శ్రీపరమాత్ముడవ్యయుడు సేవితమౌనికులుండు లోకర
క్షాపరు డాదిదేవుడు దిశాంపతిదేవనుతుండు భక్తసం
తాపహరుండు భూరిగుణ ధాముడు వేదహితుండు సర్వదా
పాపములెల్ల బాపుచును పాలనజేసెడి విశ్వనాథమున్॥

శీలము శాంతము న్విమల శేముషి సద్గుణరాశి నెన్నగా
జాలము నీదయారసము సాధుతనంబును మానమంబులన్
బాలుల సేమమే మదిని పల్మరుగోరుచు నేర్పుతో టవున్
స్కూలుకు వన్నెదెచ్చితివి నూ? వరగర్తపురంబునందునన్॥

సుగంధివృత్తము॥ విశ్వనాథుడైన శౌరి వేదధర్మబోధచే
విశ్వమెల్ల బ్రోచెమున్ను వృద్ధిజెందనెల్లరన్
విశ్వసంబుజూపి యట్లె వేడ్క పాఠశాలపై
విశ్వనాథ మీవుమమ్ము విద్యలందు దేల్చితా

సుగంధివృత్తము.

సారమొప్పు వాక్యచయము సంతసంబు గొల్పుచున్
దారిజూపి బాలకులను దారబుద్ధిదేల్చెడిన్
పారమార్థికంబె నీదు బాటయౌను మానమ
సాకారములను గొనుము వేడ్క కనికరంబు మీరగన్॥

పరమానందముతోడ బాలవితతిన్ పల్మారు వీక్షించి సు
స్థిరప్రావీణ్యుల జేయుచుండుదువు దృప్తిన్ధర్మమార్గంబులన్
వర మేడూరి కులాబ్ధి సోమగురు సద్భావజ్ఞ ధీరోత్త మా
సిరులన్గాంచుము శేముషీయుతుడవై శ్రీవిశ్వనాథాహ్వయా॥

శ్రీయుత పురుషోత్తమదాసు టాండన్ గారు శ్రీ కన్యకాపరమేశ్వరీ జాతీయపాఠశాల. దర్శించినపుడు జదివిన పద్యములు.

బత్తినిబూని దేశమున బాధలదీర్చను యాత్మబూని యు
త్యుత్తమపద్ధతుల్గని మహోన్నతి బొందగ భారతీయసం



పత్తువిశాలచిత్తమున బాగుగజూచుచు నుంటివయ్య పు
రుషోత్తమదాసటాండన సహోదరపాళినుతించ నెంతయున్।

గీ॥ చెలువుమీరగ యుష్మదాశీర్వచనము
గనుచు వృద్ధిని జెందెడి కన్యకాప
ఠనగృహము కీర్తిమించుచు టాండనుపురు
షోత్తమా దేశభక్తమహోపకార।

క॥ నిరతము భారతసేవా
పరతను జరియించి జనుల బాధలదీర్చన్
స్థిరమతిబూనితివయ్యా
పురుషోత్తమటాండనాఖ్య భూరిమనీషా॥

24—1—25.

1925 సం॥ ఫిబ్రవరినెలలో పంజాబునుండి హరినామసింగుగారు గుంటూరుకు వచ్చినపుడు చదివిన పద్యములు.

సీ॥ సకలదేశములుం మీ శాంతోద్యమ,జయంబునకును వహ్వాయను చాత్మలలర
సర్వమతంబులు స్వాంతంబులందు మీ,సత్యాయుద్ధమునకు సంతసిల్లె
వీరపుంగవులు మీ విజయంబు వీనుల, వినుచు సెబాసని వేడ్కజెందె
యోగిజనములు మీ త్యాగంబు పల్మారు,దలచి యుప్పొంగుచు ధన్యులనిరి

గీ॥ ధనికులందరు మీదగు దారిగాంచి। విస్మయంబును బొందిరి విబుధవరుల
కాలిసోదరులును మెచ్చె ఘనతమీర। వేమరు నుతింతుమో హరినామసింగు॥

పరమతబోధనుల్గనిన భవ్యనిదానముబూని సత్యమున్
మరువక మానసంబులను మార్షలు రౌలటుశాసనంబులన్
వెరుకగనెంచి ధర్మవిధి జేరును గాంచితిరయ్య వేడ్క సో
దరులు నుతించ నీసుదు ముదంబు నొనర్చెడిగాత నెల్లెడన్॥

దెబ్బల నెన్నియోదినుచు దేలుచు మూర్ఛను కోపమందక
నిబ్బరమూని చిత్తముల నిల్చిరకాలి జనంబులెల్ల మీ
కబ్బె యశంబు దేశజుల హా యని మెచ్చుచు సంతసంబు చే
యుబ్బెస్వరాజ్య మిత్రుల నహో యనగూడదెయంచు ధీరులై

రక్తాక్షి సం॥ మాఘ శు ౧౩ లు (8-3-25) నంబూరులో బచ్చు శ్రీరాములు పెండ్లి సదస్యమందు జదివిన పద్యములు.

శ్రీసకలాత్మ్యుడార్యజన సేవితు డుజ్వలభాను తేజు డు
ల్లాససమన్వితుండు జన లాభములందనివాడు యత్రిదు
ర్వాససనందనాదిముని వందితు డాదిమ వేల్పు ప్రేమతో
భాసిల నీవధూవరుల భాగ్యములందగజేసి బ్రోచెడిన్॥

చిన్నతనంబునుండి బుధ సేవలొనర్పెడి భక్తిబూని వి
ద్యోన్నతిగాంచి నిత్యము సహోదరులంచు జనంబులందరిన్
కన్నులగాంచి దేశమున కాటకమంతయు బోవునట్టి యా
తెన్నులగాంచుమయ్య మది దృప్తిని దిన్నగ బచ్చువంశజా॥

అరయుచు గాంధిబోధలర హాస్యములెల్లను జాగరూకతన్
భరతముబొందుచున్న గురు బాధలుదీరెడి దివ్యసూత్రముల్
నిరతము యూహజేసి మది నేర్పుజలంగగ సంగ్రహించి స
త్వరనవి దెల్పి సోదరుల ధన్యులజేయవె రామయాహ్వయా॥

బూటకముల్వచింపకను పూనుచు నీదగుదేశభక్తినిన్
కాటకమంతదీరగను కాలముసర్వము శక్తికొద్ది వే
పాటలుపాడుచుండగ కృపామయుడా జగదీశు సత్కథల్
రాటమునందు దారమును రంజిలదీయుము సోదరీమణీ॥



ధీరముతో పతివ్రతల దివ్యగుణంబుల నభ్యసించి వే
డ్కారగ భర్తదైవమని యోపిక సేవలొనర్చుచున్ సదా
తీరికయున్న దారమును దీయుచు నిత్యము రంగవల్లి తా
యారనుపేరు సార్థకమ హాగనుమమ్మరో సోదరీమణీ॥

కొరళ్ళ భావనారాయణవదాన్యునిగూర్చి వ్రాసిన పద్యములు.

సీ॥ వస్త్రహీనులజూచి వలువలొసంగుచు, గాపాడుమాన మే కనికరుండు
కష్టకాలంబున గంజినిబోయించి, క్షుద్బాధదీర్చె నే సుజనఘనుడు
పాఠశాలలనిల్పి బాలులు చదువగా, జేసెను నిరతంబు చెలువుమీర
నిరుపేదజనముల కరుణతో వీక్షించి, బాయకసల్పు సాహాయ మెపుడు

గీ॥ గుప్తదానంబులను దెల్ప నాప్తులకును। దెలియసాధ్యముగాదెందు దృప్తిమీర
కలిత కొరళ్ళవంశసాగరశశాంక। భావనారాయణాహ్వాయ భవ్యశీల॥

సీ॥ గ్రంథముల్గొనియిచ్చి గారవింతువు బీద,విద్యార్థివితతులు వేడ్కనొంద
జీతంబులొసగుచు బ్రీతితో కొందరి, నాదరింతువుసదా ననుపమగతి
పండితపిండుల పద్యవాక్యంబుల, చెవులొగ్గివినుదు వచ్చెరువుదోప
గణుతిజేయక నన్ని కార్యధర్మంబుల, సాధ్యమేరికిగాదు సత్యశీల

గీ॥ వితరణంబున నీకంటె బెద్దలేడు। ధనికవర్గములున్నట్లు దలపవచ్చు
ధర్మమూర్తివటంచు సద్బిరుదునిత్తు। భావనారాయణాహ్వాయ భవ్యశీల॥

సీ॥ ద్రావగా నీరము లావులుతొట్లను, వేయించితివి మార్గ వితతులందు
బావుల చెర్వుల బాగొనరించియు, సలిలసమృద్ధిని సల్పినావు
పానీయశాలికల బాటల వెలయించి,గ్రోల జనంబులు గూర్చినావు
మండువేసంగుల మార్గంబులను, చలివేంద్రల బెట్టింతు వేడ్కమీర

గీ॥ భవ్యగుంటూరుపట్టణ వైశ్యులందు।రత్నముగ నిన్ను జెప్పగారాదెదలప
దివ్యకొరళ్ళవంశసందీప్తహేళి।భావనారాయణాహ్వాయ భవ్యశీల॥

సీ॥ నీయట్టిధర్మాత్ము లెందువసింతురో, ప్రజలకు కష్టముల్ బాయకున్న
నీయట్టిసత్పుణ్యు లెచ్చటనుందురో, యట సౌఖ్యముల్ప్రజ లందుచుండ్రు
నీయట్టితెగవరు లెచ్చటనుందురో, కాటకంబులమాట గాంచబోరు
నీయట్టిసద్దాత లెచ్చటనుందురో, యాచకబృందము లగుపడరటు
గీ॥ గాంచ నీసాటివారలుగలరు నాటి।కొక్క రఖిలసద్గుణరాసి నిక్కముగను
సత్యవర్తన వైశ్యస సాధుమూర్తి।భావనారాయణాహ్వాయ భవ్యశీల॥
సీ॥ కాలంబువెంటను గావింతువొప్పగు, దానధర్మంబు లుదారబుద్ధి
బీదజనంబుల నాదరించుటయందు, సరిలేరు గుంటూరు జనులలోన
జాత్యభిమానము సామాన్యమేనీకు, నెల్లవర్ణముల ప్రేమించుకతన
సారట్లు మోటార్ల సంచారమొనరించ,గోరవు డాంబిక గుణముబూని
గీ॥ త్యాగబుద్ధిని పూర్ణని దానమునను।దీనులను ప్రేమజూచెడి మానసమున
యీడులేరెవ్వరును నీకు జాడగాంచ।భావనారాయణాహ్వాయ భవ్యశీల॥

శ్రీమత్క్రోధన వత్సరారంభమున వ్రాసిన పద్యములు.

సనకస్తుత్యచరాచరాత్మ పరమేశా సత్యసంచారశో
భనరూపా కరుణాకరా గురువరా భావప్రదీపాఢ్య స
జ్జనరక్షాతురనిత్యనిర్మలసదాచారా సురాధీశ క్రో
ధనసంవత్సరమందు నెల్లపుడు సద్వ్యాపారముల్ జూపుమా॥

భయముజ్జాపక ధైర్యసాహసముల్ ప్రావీణ్యబుద్ధిన్నిరా
మయగాత్రంబును దేశనాయకుల సన్మంత్రోపదేశంబులన్
దయదాక్షిణ్యములాత్మనిశ్చలము పెద్దల్సేవ నాకిచ్చి వే
జయముల్గూర్చుము క్రోధనాబ్దమున యీశాలోకరక్షాహరీ॥

చనె రక్తాక్షిశరీరబుగ్మ్రతల వేసారంగచిత్తంబు యా
శని రాజౌట భరించ కష్టములు దేశంబంతటన్గల్గె నో



యనఘా కల్మషదూర వేదహిత నిర్వ్యాపార విశ్వేశ కాం
చనముల్ద్రవ్యముగోర క్రోధనమునన్ సద్బుద్ధి నాశించెదన్॥

15-6-25 తారీఖున శ్రీమాన్ మాడభూషి వేదాంత నరసింహాచార్యుల గారి యాజమాన్యమున చిత్తరంజనదాసుగారి పరలోకయాత్రనుగూర్చి యొనరించిన సభలో జదివిన పద్యములు.

విని కర్ణంబుల గాంధిబోధన లిలన్ విశ్వాసముల్ జూపి నీ
పనులన్నింటిని మానివైచి ధనసంపాదత్వమున్వీడి వే
దనమున్బాపగ భారతాంబకు మదిన్ దర్కించి మార్గంబులన్
గని బోధించితివయ్య దానగుణ సంకాశా బుధోత్తంసమా॥

ఘనతర దేశభక్తి మది గాఢముగానిడి సేవజేయుచున్
ధనముల లెక్కజేయకను ధర్మము మానసమందుబూని నే
ర్పును దగ రాజకీయమున బుద్ధిని నిల్పి స్వరాజ్యపార్టి స్థా
పన మొనరించి స్వర్గమున బల్కగనేగితొ చిత్తరంజనా॥

జనకుడు నష్టముల్గలిగి సాధ్యముగాని ఋణంబు జేసినన్
మనమున కోపమందక నమానుష మంచెదనెంచి దీర్చి కీ
ర్తిని గడియించితీవు తగు రీతిని యప్పులవారి బిల్చి యే
తనయులు దీర్తురప్పు నిల దానగుణాంచిత చిత్తరంజనా॥

గినియక దూరదృష్టి గురు కీర్తిని గాంచగ వేడ్కతోడ శా
సన సభలందుజేరుచును సంతతవాదములాడి సత్యముల్
పనివడి వెల్లడించగను బంపగ సభ్యులనేర్పరించ వే?
పనుల భరించలేక నిల బాయుచు స్వర్గముజేరితో హితా॥

పరమానందముతోడ సర్వసుఖముల్ బాటించకే ధీరతన్
చెరసాలన్వసియించినావు గురువా శిష్యార్చ్య నాళికేష గా
ర్నరులే నీదగుఖ్యాతిమెచ్చెదరు యన్నా దివ్యసంబోధ లే
దరికిన్ జొచ్చెను స్వర్గమేగితివె యోదాసాఖ్యసత్సోదరా॥

రామాయణము వ్రాసిన ఆకుల పూర్ణానందగుప్తనుగూర్చి.

క॥ శ్రీకరవైశ్యకులీనా
ప్రాకటకవితావిరాజ భవ్యసుశీలా
ఆకులవంశమణీ నీ
పోకడ కవితంబుగంటి పూర్ణానందా॥

కవులోన నిద్దరున్నలిగి గాంచగ వైశ్యుల నిట్టిగ్రంథముల్
భవములనంగ వ్రాయరు శబాసన నిర్వచనంబుగా గవి
త్వవిభవమొప్ప వ్రాసితివి పాపములెల్లదొలంగు నందు రా
ఘవుచరితంబు సౌఖ్యముల గాంచనొసంగును చెవులకింపగున్।

ఓపికమీర పద్యముల నొప్పుగ వ్రాసెను మొల్లమాంబ నం
క్షేపముగా జెలంగనటు చెల్వుగ మేలగు శైలిగుల్క శ్రీ
కాపతిదివ్యసత్కథ ముదంబున వ్రాసితివయ్య, పద్యముల్
దీపితమై ధరిత్రి నిది దివ్యతరంబుగ నుండు గావుతన్।

వెనుక కరాలపాటి కుల వేంకటరంగయ పండితుండు సా
ధన మొనరించి వ్రాసె కవితంబును భూతపురీమహాత్మ్యమున్
యనఘునిబోలి పిమ్మటిల నాంధ్రులుమెచ్చగ వైశ్యమండలిన్
గనరు కవిత్వసంపదను గాంచితి విప్పుడు వేడ్కసోదరా॥



వ్రాసెను బుచ్చికామకవి వాసిజెలంగగ నిట్టిపాత్రముల్
భాసురకావ్యసంచయము బల్కెను కొప్పరపుప్పయాఖ్యు డా
శా సుధలొల్క నిచయంబుల నింపుచు రాము సత్కథన్
వ్రాసితివయ్య శైలి సులభంబుగ నొప్పగ వైశ్యభూషణా॥

21-6-25.

పాపాయిఅను గ్రంథమునకు బంపిన అభిప్రాయము.

క॥ శ్రీయుత నాళము కృష్ణా
రాయాహ్వాయ నీవు వేడ్క రంజిలుకృపతో
నీ యెడ పేబంపిన పా
పాయి గృహంబునకు జేరి పావనమయ్యెన్।

పాయును పుత్రశోకమెద పాపములెల్లదొలంగు వెంటనే
పాయును సర్వబుగ్మతలు ప్రాణికి పాయినిగూర్చు నెంతయున్
పాయు ధనాశపూర్ణముగ బట్టువడున్ సుగుణంబులెల్ల పా
పాయిని గాంచ నిర్మలిన భావము బొందుట నిశ్చయంబగున్।

క॥ పాయును భవదోషంబులు
పాయును లుబ్ధత్వమెల్ల ప్రజ్ఞ జనించున్
పాయు నసత్యము మీపా
పాయి గనుంగొనిన హాయి ప్రాప్తించుదగన్॥

ఆశుకవిత్వ నేత్రావధాన నిపుణులగు గాడె పాపరాజు వీరబ్రహ్మయ్య సోదరులు 9-7-25 తారీఖున గుంటూరుచలమయ్యగారి సత్రములో నేత్రావధాన మొనర్చినపుడు చదివిన పద్యము.

ఘనతన్కట్ట కడల్గణించగ తెలిగ్రాపుం బలే శబ్దమై
దనరున్భావమునెల్ల గుర్తెరుగ సందర్భంబు లేకెందులన్

కనుసైగల్దెలుపంగ గుర్తులను సాంగంబద్యరూపంబుగా
వినదం బేమియులేక దెల్పితి రహా నేత్రావధానంబునన్॥

16–8–25 శ్రీయుత దర్భి రంగయ్య బి. ఏ.,బి. ఎల్, గారి అధ్యక్షత
క్రింద జరిగినసభలో జదివిన పద్యములు.

శ్రీమధుసూదనుండు. రిపుసేన జయించెడివాడు సద్గుణ
స్తోముడు ధీరమానసుడు సూరిజనావనుడాదిమూర్తి యు
ద్ధామ గదాధరుండు హరి తామరసాక్షుడు వేడ్క వైశ్య వ్యా
యామకళాసుశాల నన యంబును బ్రోచెడి బెంపుచెందగన్॥

వేమరు గాత్ర పాటవము వృద్ధిని జేసి బలంబుగూర్చి సు
త్రామునికైన జంకకను ప్రాణనెదిర్చెడి శక్తినిచ్చి శ్రీ
రాముడు సర్వకాలము విరాజిల దేహబలంబు వైశ్యవ్యా
యామకళాసుశాల నన యంబును బ్రోచెడి కీర్తిమించగన్॥

రాముని దూతయైన కపి రాయుని బోలిన దివ్యశక్తి వి
ద్యామహిమంబు గాత్రరుచి ధైర్యము శీలము మల్లవిద్య నా
భీముని మెచ్చుకుండునటు పేరు నెసంగుచు శూలి వైశ్య వ్యా
యామ కళాసుశాల నన యంబును బ్రోచెడి మించు వేడుకన్

22–9–25 వేటపాలెం సారస్వతనికేతనముయొక్క సప్తమవర్షంత్యో
త్సవమున జదివిన పద్యములు.

శ్రీయుతలోకవందితుడు చిన్మయుడాదిమవేల్పు యత్రిజో
ధాముని కణ్వకాంచన సదాల్భ్య శుకాదినుతుండు భూరియా
మ్నాయహితుండు భక్తజనమానసవాసుడు కేశవుండు సు
బ్రాయమహాల్గ్రామంబుగను భాసిల జేసెడుగాత క్షేమతన్॥



పరమేశుల్ స్థిరభక్తినెంచగ కృపాపారీణులైన వేడ్క సో
దరులన్గాంచగ దేశభక్తినెద నిత్యంబున్దగన్నూన మే
దుర ధైర్యంబును సాహసంబుగన నిర్దోషాత్ములై మించగా.
వరసుబ్రాయమహాల్ ప్రచార సమితిన్ వర్ధిల్లగా జేసెడున్॥

సరిగా భారత భక్తిబోధల సదా సారంబునన్దీయగన్
దరికిన్జేరిచి పంచమాదుల లసద్ధర్మంబులన్దెల్పగా
నిరతంబున్బ్రచరించి పత్రికల వానిన్దెల్ప గ్రామంబులన్
ధరసుబ్రాయమహాజ్జెలంగుచు సదా దార్ఢ్యంబుచే నొప్పెడిన్॥

శ్రీయుత నడింపల్లి నరసింహారావుగారినిగూర్చి

అసహాయోద్యమమందు జేరుచును బారత్సాదగన్నామముచున్
వినువుం జెందక దేశసేవలను ప్రావీణ్యంబునున్జూపి సం
తస మాపంచమసోదరాళి గనునో దారిద్ర్యముల్ బాపగన్
వెస లక్ష్మీనరసింహరాయు నెపుడా విశ్వేశుడోముద్ధరన్॥

వర గుంటూర్పురపాలనాధిపతియై వాసిన్దగన్గాంచుచున్
నరసత్వంబున బీదవారల సదా సంతృప్తితోజూచు నా
ధరణీదేవుని నడ్మిపల్లికుల రత్నంబైన లక్ష్మీనృసిం
హరసజ్ఞున్ బ్రోచెడి విశ్వనాథుడెలమిన్ హర్షంబు దీపింపగన్

చెన్నపురిలో వ్రాసిన పద్యములు.

ప్రేమన్మిత్రులతోడ శాసనసభన్ భీతిల్లకన్ చర్చలన్
ప్రామాణ్యంబులతో నొనర్చుచుదగన్ ప్రావీణ్యమున్ [జూపుచున్
వేమారున్గురుకార్పొరేషను పనుల్వీక్షించునో సభ్యుడై

సామీ వంశపవిత్రుని స్సద్గుణమణిన్ సంతోషమే పారగా
రాముఁడోముత వెంకటాచలమునిన్ రంజిల్లుగా నెంతయున్॥

శ్రీవిభవంబు లొప్పుచును చేరినవారిని సత్కరించుచున్
భావములెల్ల గాంచుచును బాగుగ సూచనలిచ్చి కన్యకా
దేవి ధనంబు నిత్యమును దృప్తిగ పాలన జేయునట్టి వా
సావరదాఖ్యునాశివుడు సర్వశుభంబులగూర్చి బ్రోచెడిన్॥

సారెకు మందహాసమున సారముదీయుచు సూక్ష్మధర్మముల్
పారులు జెప్ప నెప్పుడును బ్రౌఢతనంబును లేకయుండు నా
ధీరుని గర్రె వంశమణి దృప్తినొసంగుచు పార్థసారథిన్
భూరి సుఖంబులిచ్చి హరి పోషణజేసెడి మానసంబునన్॥

ముత్తాతల్తరియించ విద్యల లసత్పూర్ణంబుగా నేర్చియున్
సత్తాబూనుచు న్యాయవాది వితతిన్ సాధించి శాస్త్రంబులన్
విత్తోపార్జన జేసి చెన్నపురిలో విఖ్యాతినిం గాంచితో
ముత్తావేంకటసుబ్బరాడ్గుడు యశో మూర్తీ కులోత్తంసమా॥

ఆర్యుల్మెచ్చగ వర్తనంబుల సదా హైకోర్టునన్ జడ్జివై
ధైర్యంబున్దగబూని తీర్పుల లసద్ధర్మంబు దీపింప చా
తుర్యంబొప్పగ పేరుగాంచితివి సింధోరాసులన్మీరి ధీ
వర్యా వేంకటసుబ్బరాడ్గుణమణీ వైశ్యోత్తమా రత్నమా॥

పునరుద్వాహ మొనర్చ బాలికలకున్ పుణ్యంబటంచున్మనం
బున దర్కించియు సంఘసంస్కరణల న్ముఖ్యంబుగా బూని సా
ధన గావించితివట్లు భీతివడకన్ ధన్యుండ వీవెంతయున్
ఘనతన్ వృద్ధినొనర్చగాదగును యిక్కార్యంబుల న్ధీమణీ॥



పెంపును జెందభక్తులను బ్రేమతో గాచుచు నాత్మయందు రా
ణింపగజేసి వర్తనల నిత్యుడు సర్వమయుండు బ్రీతితో
తుంపుడివంశ్యు దుష్టజన దూరుని శ్రీభగవంతగుప్తునిన్
సంపదలిచ్చి గాచెడిని సంతత భాగ్యములిచ్చి హెచ్చుగన్॥

పరిచయమైనకొద్ది పలుభావములొప్పగ భాషణంబు లా
దరమొనరించుచున్నతి యుదారముజూపుచు వ్రాయనున్నగ్రం
థరచన పూర్తిజేయగ పథంబుల సూచనదెల్పునో వెసన్
వరదుడు సర్వరక్షకుడు వర్ధిలజేసెడి బచ్చుపాపయన్॥

బుధులౌనౌనన వొంగవోలున పెరుంబూదూరు యాతిర్పతిన్
విధియుక్తంబుగ ధర్మశాలలను ప్రావీణ్యంబుతో నిల్పి స
త్పథికుల్ నిల్వగజేసి పుణ్యమును సంపాదించినావయ్య వా
రధి మధ్యంబున గల్గుదేశముల ధీరంబొప్పగా జూచి నీ
వధికానందముతోడ వచ్చితివి యయ్యన్నార్య పౌత్త్రా వం
శధునీశాబ్జ వణిగ్జనోత్తమ సదా సంతోషమున్బొందుమా॥

నెమ్మిన్గాంచుచు జాతినెల్లను సదా నీతిం దగన్బూని స
త్యమ్మున్ దాల్చుచు కన్యకాలయములో ధర్మంబులన్నడ్పు ని
త్యమ్మున్ బుద్ధినిజొన్పుచున్ సరిగ పెద్దల్మెచ్చవర్తించు నా
తోమ్మంద్రంకుల రాఘవాహ్వయుడు సంతోషంబులన్
[బొందెడిన్॥

ఉల్లాసంబునబోవ హార్మ్యము గనన్ యుక్తుల్ బ్రయో
[గించరన్
సల్లాపంబుల ప్రొద్దుపుచ్చుచు కృపాస్వాంతంబునన్ జూచి సం

ఢిల్లిఁ జేయుచు కామితార్థముల నేధీరుండు బంపించు నా
కొల్లా రాఘవు నేలుగాత కరుణన్ గోర్కుల్ శివుండిచ్చుచున్
మాటల్వీనుల నేర్పుతో వినుచు సన్మానంబునున్ జేసి మీ
మాటంబించుక లేక దోచినటు లన్మర్మంబుబోనాడి నా
కోటు ల్దెల్పిన కార్యసంచయములన్ పూర్ణంబుగా సల్పు నో
కోటా రంగయగుప్తనో మెడిని యాగోవిందు డెల్లప్పుడున్ ।
దాత ల్గాంచగ నాంధ్రమండలిని శ్రీ ధన్యాబ్ని సాయంబునన్
బ్రీతిన్నీవలె జేయువార లరుదా విద్వాంసులన్ జూడగన్
నాతా నాగయ ధర్మశీల వరసా నందాత్మ వైశ్యోత్తమా
ఖ్యాతిన్గాంచుచు ధాత్రినింక. మనుమా సంకల్ప సిద్ధుండవై॥

7–10–25 క్రోధనసంవత్సరము.

వీణె ఫిడేలు తంతెలను బ్రీతిని హెచ్చును తగ్గుగల్పుచున్
లీనముజేసి గాన మవలీలగ జేయుచు నాదమెంతయున్
వీనుల విందుజేసితిరి పెద్దలబిల్లలకెల్ల నాదు స
త్సానము లన్గళంబునను శోభిల గూర్తుధరించు డెంతయున్
యేనొనరించు సత్కరము లింతియె గావున శర్మసోదరుల్
మానసమందుమెచ్చనగు మాన్యులు మీరలు బాలకాగ్రణుల్ ।

సీ॥ పూర్ణంబుగా బిఠా పురవరాధిపుచేత, మెప్పును గంటిరి మిత్రులార
బొబ్బిలి మందస పుడమిరేడులచేత, పూజింపబడితిరి పుణ్యులార
సత్కారంబులను విజయనగరేశుని, చేగాంచితిరి గురు శీలులార
కంకణములొసంగి కర్ణాటకేశుడు, సన్మానమొనరించె సరసులార
గీ॥ తమిళ కన్నడరాష్ట్ర భూధవులచెంత। బొగడబడితిరి మేల్మేలు బుధులలార
ఆంధ్రమండలికెల్లను హాయశంబు। గూర్చితిరి యింకమీదట గూర్చగలరు॥



గీ॥ బ్రీతిగా బాడునట్టి సంగీతమునకు
సర్వవితతులు గోవులే సంతసించు
పరగ వేంకటవేణుగోపాలశర్మ
శక్తిబరగు కామేశ్వర శర్మలార
విన్నవారలు దనియరే వీనులందు
అవని దేవుడు బ్రోచు దీర్ఘాయువొసగి!

7-10-25 క్రోధనసంవత్సరం.

శ్రీ క్రోధన సం॥ ఆశ్వయుజ బ ౭ (7-10-25) శుభలగ్నమున చెన్న నగరంబున శ్రీయుత వాసా వరదయ్యగారి కుమారుని అక్షరాభ్యాస మొన రించునపుడు జదివిన పద్యములు.

అమరగురుండటంచు జను లాడగ బుద్ధి నొసంగి వేడ్కను
త్యము భరతాంబసేవల ముదంబున జేయగ పూర్ణభక్తి సు
స్థిమితమొసంగి శంభుడిల శ్రీముని వెంకటబాలసుబ్రమ
ణ్యాము నతిప్రేమజూచెడి ధనంబుల నాయువు గూర్చి సంపదల్

సీ॥ రాణింప లజపతి రాయిగుణంబుల, వర్ధిల్లి వేడ్కతో బరగుమన్న
మత సమానంబుస మ్మతిబూని, హిందూమహమ్మదు క్రీస్తుల నరయుమన్న
దేశదారిద్ర్యము దీర్చగ బూనిన, గాంధిమార్గంబుల గాంచుమన్న
పరదేశములకును బంపక ద్రవ్యము, ఖద్దరు వస్త్రము లట్టుమన్న
గీ॥ వేదహితమార్గధర్మముల్ వెదకి వెదకి। వాని హితులకు దెల్పగా బూనుమన్న
సుగుణ మునిబాల వేంకటసుబ్రమణ్య। గుప్తనామక సౌఖ్యము గూర్చుమన్న॥

గీ॥ జిహ్వయందు సరస్వతి జేరినిలచి
సర్వభాషల జయమును సలుపుగాత

సోదరులభంగి జనముల జూచునటుల
సర్వసముడగు దేవుడు సాకుగాత॥

11—10—25 కలోల్లాసినీ సభవారు కీచకవధ ప్రదర్శించినపుడు వ్రాసిన పద్యములు. చెన్నపట్నం.

శ్రీసదయాంతరంగుడు వి శేషగుణాఢ్యుడు నిర్మలుండు స ద్భాసితమందహాసు డురు భక్తవశీకరు డవ్యయుండు ప ద్మాసనవందితుండు సద యాత్ముడు ధీరుడు ప్రేమతో కలో ల్లాసినినాటకాళిసర ళంబగు ప్రజ్ఞనొసంగి బ్రోచెడిన్॥

వికచాంభోరుహనేత్రుడా హరి జగద్వీరుండు ముల్లోకర క్షకు డానందమయుండు భక్తజనసాక్షాత్కారు డక్షాలార్కతా రకతేజంబుల వెల్గువాడు దయతో రక్షించు నేప్రొద్దునన్ స, కలోల్లాసిని నాట్యరంగమును తత్సంబంధులన్బంధులన్॥

భాసిల నీతిసత్కథల ఫక్కిని బూనెడి నాటకంబులన్ వ్రాసినవాని నేర్పుచును బాడుచు పద్యము లుత్తరీతులన్ వాసి రసంబులన్గనుచు వర్ధిలపాత్రల నీశుడీ కలో ల్లాసిని నర్తకాళిని విలాసములొప్పగ ప్రేమజూచెడిన్॥

మునగాల జమిన్దారుగారికి బంపిన విజ్ఞాపనము. పంచరత్నములు

క॥ మునగాల ప్రాంతాధిప
గనుమా మీ బీదహితుని కార్యభరంబున్
ధన సాయం బొనరింపుము
చనువున నెబ్భంగినైన సంతోషమునన్॥



క॥ హాయిగను రామమోహన
రాయుని కడ నేర్చినాము రంజిలు వేడ్కన్
ఛాయాపటముల నెత్తగ
నాయని వంశాబ్ధి బుక్కునాయక రాజా॥

క॥ జేయుము ముద్రణకును ధన
సాయము దయబూని నెదను సఖుడని ప్రీతిన్
నాయని వేంకట రంగా
రాయాహ్వాయ సుగుణధామ రాజలలామా॥

క॥ శ్రీయుత మీదర్శనమున్
జేయదలచి వేడ్కమీర చెన్నగరునన్
గేయము కేగిన లేరట
నాయని సద్వంశహార నగరాడ్ధీరా॥

క॥ పొంకమగు పొత్తమును ము
ద్రాంకిత మమరంగ జేయుమని గోరితినే
వేంకటరంగారాయా
శంకరుడెద సంతసించు సల్పుము కరుణన్॥

విప్రులనుగూర్చిన పద్యములు.

వెనుకన్నుందర జూడకే కవులు ప్రావీణ్యంబుతో గల్పనల్ దనరన్ వ్రాసిరి బుస్తకంబులల సద్ధర్మంబు బాటించకన్ జననం బేదగు జాతి నిర్ణయము యోజంబెల్ప రెవ్వారలున్ ఘనలన్నిల్పుకొనంగ బాపలిపుడే గాక్షించి తర్కించెడిన్॥

కొందరు పాకయాజులురు క్రుద్ధులు చైనులు పౌండరీకులున్ కందుచు గీతయందు గుణ కర్మవిభాగశ కృష్ణబోధమున్

తందరఁ జెంది చిత్తముల దార్కొనఁ జేయుదురా మనుస్మృతిన్
ముందట వెన్కలన్ గనక బోధనొనర్తురు యగ్రజన్ములున్ ।
గనకన్పూర్వ పరంబులన్ స్మృతులలో గారించి సందేహముల్
ఘనతన్నిల్పు కొనంగ జూచెదరు ప్రాకట్యంబుగా జన్మమే
దనరు న్వర్ణము రాదు సద్గుణలసత్ప్రజ్ఞానమున్గల్గ నెం
దున యంచున్వచియించు విప్రకుమతుల్ దోసంబు
[బాటించరన్ ॥

వ్యాసపరాశరాది ముని వర్గము మిక్కిలి సత్తపంబులన్
జేసి మనో నివాసుగని జెందిరి యున్నత బ్రాహ్మణత్వమున్
దోసమటంచు దెల్పె ధృతితో తపమున్సలుపంగ పాదజుల్
వాసనలందు దేలి గరువంబున సత్యము బాసి వ్రాసెనో ॥

మతమభివృద్ధి జేతుమని మాన్యధనంబుల గూర్చి బీఠకుల్
సతతము బంధుసోదరుల సన్నిధినుంచుక పోషణంబునున్
హితమని జేయుచుండెనిక నెవ్వరి జేర్చక మర్త్యులందునన్
గతులను దెల్ప రేమి ఘన కల్మషమంటరె కాలుడెంచడే ॥

ముప్పాళ పుష్పగిరి పీఠము వచ్చినపుడు వెళ్లి వ్రాసిన పద్యములు.

క॥ గోపాలుని శివుబోలుచు
గోపాలుని వంశమందు గుణయుతుడౌచున్
దీపించె రామలింగయ
సాపాటిడు నెవరికైన సదనమునందున్ ॥

స్వర్గస్థుడైన కారుమాను రామసుబ్బయ్యను గురించిన పద్యత్రికము.

క॥ అతిథిజనంబుల కభ్యా
గతులకు నన్నంబు బెట్ట గలిగినవరకున్



సతతము భార్యాతిలకము
పతియాజ్ఞ దొలంగ దెపుడు భావమునందున్ ॥

క॥ ధృతి ముప్పాళపురంబున
హితులేతెంచగను వారి కింపుగ బెట్టున్
కతిపయదినముల నిల్పును
బ్రతిమానులు ప్రేమమీర బంధుగులట్లన్ ॥

క॥ అతులితధర్మాత్ముండగు
మతిమంతుడు జూడ కారుమానుకులజుడా
క్షితిలోన రామసుబ్బయ
వితరణుడై స్వర్గమరిగె విధినెటుదాటున్ ॥



ఓమ్.

# విష్ణుపూర్వాశతకము.



(రెండవ భాగము)

శ్రీ లక్ష్మీనారాయణ
కాలజ్ఞానప్రకాశ కల్మషనాశా
లీలామానుషవేషా
వేలాయుత తల్పదేవ విధినుత విష్ణూ॥

రా రాఫణితల్పశ్రుతి
సారాముని జనవిచార సర్వాధారా
ధీరా శాంతాకార
యారాధన జేతుఁబ్రోవు మరయుచు విష్ణూ॥

మా నితసద్గుణజాలా
దానవజిత ధర్మచేల ధార్మికశీలా
గాన విలోల జనార్దన
దీనావన చక్రపాణి ధీహిత విష్ణూ॥

శు భదాయక దామోదర
యిభరాడ్వరదా హరీ ఫణీంద్రశయానా
అభయమొసంగుచు నాదగు
యభిమతముల దీర్చువేగ యతిహిత వి॥

భ జియింతురు నీనామము
త్రిజగములఁ భక్తవరులు త్రికరణ శుద్ధిఁ
గజరాడ్వరద ముకుందా
సుజనామర భూజసుగణ శోభిత వి॥

మ ధుసూదన వామనహరి
విధి పురుహూతాదిదేవ వినుత దయాబ్ధీ
బుధజనపరిపోషణ స
ద్విధులను బూజింతుగావు వేడుక వి॥

స్తు తిపాత్రపాపహరణా
వితరణగుణ పూర్ణభక్త వితతి విచారా
శ్రుతిహిత గోవింద హరీ
సతతము నీనామభజన సల్పెద వి॥

క॥ వార్ధిక్యముగాంచుచు పర
మార్థముకై పద్మనాభ హరి యనకున్నఁ
గార్ధభములు వారెన్నఁగ
తీర్థపదాభవ సురాళి దీపిత వి॥

ఓం కారమాదినిడుచును
సంకర్షణనీదునామ చయమునుడివినఁ
సంకటములన్నిదీరును
పంకేరుహనయన సుజన పాలనవి॥

న గధరభవహరహరిప
న్నగరాజశయాన వేణు నాద యుపేంద్రా
నగవైరివినుతపద తి
న్నగదయజూడుము మదిని స నాతనవి॥

మో క్షమొసంగను కడపట
సాక్షాజ్జగధీశ నిన్ను సన్నుతిజేతుఁ
దీక్షహృదాబ్జమునందున
యక్షీణకటాక్ష దేవ యమినుత వి॥

నా రదసన్నుతచరణా
నీరదసమగాత్ర శౌరి నీరజనేత్రా
శారదచంద్రికహాసా
భూరిదయాపాంగ భక్త పోషణ వి॥

రా జీవపత్రలోచన
భ్రాజితసద్గుణసుశాల భావవిశాలా
ధీజనమండలిపాలా
పూజితమానీంద్ర పరమ పూరుష వి॥

య మివరమానసవాసా
కమలదళవిశాలనయన కంధిశయానా
సుమనసవందితచరణా
రమణీయగుణాసముద్ర రాజిత వి॥

ణా ◆ నాజీవసుపోషణ
దీనావనతీర్థపాద దిక్పతివినుతా
నీనామసుధను భక్తులు
పానంబును జేయుచుండ్రు పావన వి॥

◆ ణనయోరభేదః



య తులకు మోక్షమొసంగవె
గతులనుజూపుచును భక్తగణములబ్రోతిఁ
సతతము రక్షణజేతువు
అతులితకరుణాసమేత యవ్యయ వి॥

క॥ ఆర్జించుచు విత్తంబును
వర్జించక దుర్గుణముల వనితలపొందుఁ
గర్జించి దిరుగువారలు
నిర్జరలోకంబుగనున నీల్గిన వి॥

న రహరిశౌరిజనార్దన
కరుణాబ్ధిరవిమానోద ఘనతరమోదా
శరణార్థిపోషణా నగ
ధరహరి పరమాత్మగావ ధన్యుడ వి॥

మ హితగుణాకరనిర్జర
విహితాపరవాసుదేవ వితరణభావా
అహిరాడ్తల్పఘనాభా
తుహినకిరణమౌళివినుత దోర్బల వి॥

శి తికంఠాదులువేడుక
సతతముభజియింతురెలమి సారసనేత్రా
ధృతశంఖచక్రపాణీ
కుతుకంబున నన్నుగావ కోరిక వి॥

వా రణదుఃఖనివారణ
నీరదసన్నిభశరీర నిగమవిచారా

పారావారగభీరా
సూరిస్తవగుణవిశేష శోభిత వి॥

య దుకులవంశపవిత్రా
మదనజనకపరమపూర్ణ మాధవశౌరీ
సదమలరూపజనార్దన
వదలక దుర్గుణములన్ని బాపుము వి॥

క॥ నిర్భయముగాను పెద్దల
దుర్భాషలుబలుకునట్టి దోషులభువిలో
నిర్భాగ్యులగుచు తినుటకు
గర్భములకు లేక క్షుత్తు గాంతురు వి॥

గు రువేబ్రహ్మమటంచును
గురువేపరమేశుడనుచు గుణయుతులెంచెన్
గురువు పరమాత్ముడెన్నగ
గురువగుదువు నీవు దేవ గోకుల వి॥

రు ణముసలుపంగనయ్యాది
రణమనివచియించెమాని రాజులువెనుకన్
మణిమయమకుటవిరాజా
ఫణిరాట్శయనాబుధేంద్ర పాలన వి॥

నా దబ్రహ్మమునీవే
భేదవిరహితుండవీవె పీతవసన నా
భేదములబాపి శ్రీదా
మోదర రక్షించనీకు యుక్తము వి॥



ధే నురాడ్వాహవందిత
కాననమున సుజనులెల్ల గననీయాపున్
పూనితపమాచరింతురు
పానీయంబులను గ్రోలి బాగుగ వి॥

శ్వ పచుడుహీనుండైనను
తపమొనరించగను వాని ధన్యునిగా స
త్కృపతోడ గాతువెంతయు
విపరీతముగాదలంత్రు విప్రులు వి॥

ర మ్యాచరిత్రవిరాజిత
సమ్యగ్గుణదేవవేద సార యుపేంద్రా
ధామ్యాదులునీకతలను
సామ్యంబులజెప్పచుంద్రు సరవిగ వి॥

దే వతులందరుసతతము
భావింతురు హృదయములను భక్తిజెలంగన్
శ్రీవిభవంబులగాంచను
త్రైవిక్రమనెంతవాడ దలచగ వి॥

వా మన శౌరి జనార్దన
సామజవరదాప్రమేయ శార్ఙ్గ ముకుందా
భీమాహవ రిపుభంగా
పామరుడను బ్రోవు లోక పాలన వి॥

ల లితానంతశయానా
జలజాక్ష ముకుంద సర్వ జంతునివాసా
జలధర సన్నిభ దేహా
అలుకవహించకనుబ్రోవు హరి శ్రీవి॥

య మరాడ్భీతిని బొందను
సుమహిత నీభక్తకోటి జూచినమదిలో
కమలహృదయాబ్జభృంగా
కమలదళాయతవినేత్ర ఘనతర వి॥

ము కురమునబింబమట్టుల
సకలాత్మలనున్నయట్టి స్వామివినీవే
వికచాబ్జలోచనా నే
నిక నీపాదములవిడువ నిలశ్రీ వి॥

క॥ సద్భావంబున నిను యా
పద్బాంధవ వాసుదేవ పరమపురుష వే
యుద్బోధ జేయకను నీ
రోద్భవవైరిసుతు డూర కుండునె వి॥

భ ద్రేభవరదమాధవ
సద్రత్నస్థగితమకుట సారసనయనా
కాద్రవేయారితురగా
క్షుద్రజనవిదూర దివ్య సుందర వి॥

రత్నమయహారలక్ష్మీ
పత్నిహితోక్తులు జలంగ ఫణితల్పముపై



నూత్నవికాసము జూపుచు
యత్నముగా జనులగాచు హరి శ్రీవి॥

త లపగ నీవే యన్నిట
వెలయుచు సాక్షిగను దేవ విలసితమగుచున్
పలుజీవరాశిబ్రోతువు
జలజాక్షా భక్తపక్ష సదయుడ వి॥

మా ధవ కేశవ శౌరి ర
మాధవ సురహిత హరే యుమాధవవినుతా
వేధాదిసుపర్వాణులు
శ్రీధర పూజించుచుంద్రు సేవిత వి॥

త పనీయదివ్యచేలా
తపనసమానప్రకాశ ధర్మవిచారా
తపము సలుపగను వశమా
కృపతో రక్షించు నీకు గీర్తిర వి॥

కు ధరసుతేశ్వరపూజిత
విధి పురుహూతాదివినుత విశ్వాధిపతీ
సుధలొలుకు వాక్యపుంజము
లధికానందం బొసంగు మవ్యయ వి॥

జై మను జేశ్వరవందిత

భీమాహవరిపుకాలా
సామజవరదా సుశీల సమ్మత వి॥

శ్రీ లక్ష్మీనారాయణ
పాలితజగదేకవీర భక్తవిచారా
నీలఘనాభశరీరా
పాలకడలిశయన లోక పాలన వి॥

శ్రీ నారాయణ శౌరీ
దీనావనవాసుదేవ దివ్యవిలాసా
నానాజీవసుపోషా
సూనాంచితమాలగాత్ర శోభిత వి॥

శ్రీ ... ... భూనాయక
ఆశ్రితరక్షక ఫణీశ యానవిశేషా
విశ్రాంతితపోధనులే
యాశ్రయమును గోరుచుంద్రు హాలికుల వి॥

గాం తురుపరమాత్మగవే
దాంతులు హృత్కమలమధ్య యగ్నిజ్వాల్గ
చింతింతురునినుభక్తులు
స్వాంతమునందెపుడు బూని చక్కగ వి॥

ధీ రులవీరులబీరుల
శూరుల విద్వాంసవరుల శోధింతువుగా
వారలు కష్టముకోర్చిన
కోరికలన్నీర్తువపుడు గుణహిత వి॥



మౌ నులుచింతలువిడచుచు
.కాననమందునతపంబు గావింతురుగా
పూనికపరమాత్మా నిను
మానసమందునను గాంచ మాధవ వి॥

ని ఖలకలుషాబ్ధిశోషణ
శిఖివాహన జనకవినుత సింధుశయానా
సుఖదాయకపాండవసుత
సఖ దామోదర దయాబ్ధి సదమల వి॥

జై నారాయణకేశవ
దానవమదభంగదివ్య థామవికుంఠా
జ్ఞానానందమయాంచిత
మానసకరుణాసమేత మాధవ వి॥

క॥ ఆజ్ఞాపించెను వేదము
యజ్ఞోవైవిష్ణువనుచు నమరులకెల్లన్
ప్రజ్ఞానులైనవైశ్యులు
యజ్ఞములొనరించవలె ద యాకర వి॥

క॥ పూర్ణమగు భక్తితో దు
గ్ధార్ణవశయనా కమలద ళాయతనయనా
దుర్ణయులైనదలంచ సు
పర్ణతురగ బ్రోతువీవు బాగుగ వి॥

వం దేశీనారాయణ
వందేజగదేకవీర వందేశూరా

వందేకరుణాపూరా
వందేరాక్షసవిదూర వందే వి॥

దే వాధిదేవకేశవ
పావనసుచరిత్రవిమల భావాతీతా
సేవకమానవపక్షా
తావకపదములనునమ్మ ధన్యులు వి॥

మా మక ప్రార్థనలను విని
కామితములదీర్చు వేగ కారుణ్యనిధీ
రామామణి లక్ష్మీధవ
శ్యామలమృదుదేహా దేవ సన్నుత వి॥

త గునాగావకయుండుట
నగరా పెరవారువిన్న నగధర శౌరీ
పగవాడన జూడుముమది
ఖగవాహన శార్ఙ్గపాణి గనుమా వి॥

రం గ కరుణాంతరంగా
సంగీతవిలోల వేద సార రమేశా
శృంగారవేషభాషా
మంగళదాయక రమేశ మాధవ వి॥

క॥ నిర్జరవందితచరణా
పర్జన్యశ్యామవర్ణ భావవితీర్ణా
అర్జునసారథివేమచు
నార్జింతురు నీదుపదవి నమరగ వి॥



గ్రం థంబులుజదువగ భవ
బంధంబులు వీడవెందు పాపముబోదో
బంధురతేజ సభక్తిని
బంధంబులు తెగును గాంచ బాగుగ వి॥

ధి మికిటకిట్టకయనుచును
క్రమముగ నాట్యమును భక్త గణములుసలుపన్
తమమా రవిగని తొలగు వి
ధమున కలుషములు దొలంగు దలచగ వి॥

వెం డిబంగారురూకలు
దండిగగలవారినెదను దలచవుగావే
దండనుత భక్తమండలి
రండని జీరుదువుప్రేమ రంజిల వి॥

క రిరాజ పోషణా హరి
శరణాగతరక్షదీక్ష సజ్జనపక్షా
కరుణాకర రిపుశిక్షా
ధరితాఖిల మనుజరక్ష భవహార వి॥

టు మటమ ఢంకా గొట్టెద
కమలాధిప నీరుసాటి గన లేరనుచున్
సుమనస వందితసత్పద
కమలా నన్బ్రోవువేగ కరుణను వి॥

ను రుచిరమేఘశరీరా
పరమపురుష వేదసార భక్తవిచారా

ధరణీధర సమధీరా
శరధిగభీ రాత్మవాస శరణుర వి॥

బ్బా బాయని బిలతునునే
దేబితనంబంతవిడచి దీనావననీ
కేబరువు లేదుగావర
నాబలమునశించె ప్రార్థ నముగను వి॥

రామా జననుత సద్గుణ
ధామా భక్తజనకామ దానవభీమా
కామారి వినుతనామా
సామజవరదా సురేశ సాకుము వి॥

యమునాతీర విహారా
యమినుత ప్రజ్ఞావిశేష హతరిపు శూరా
విమలాంతరంగసారా
సుమహిత ననుకరుణమీర జూడుము వి॥

గుప్తముగా యోగాగ్నిని
తప్తముగావించి కర్మ తతిసర్వంబుల్
లిప్తముజేసి మనంబున
నాప్తహితా నిలుపధన్యు లౌదురు వి॥

కవి జన వందితపోషా
భవహార గోవింద పాప వారధిశోషా
నవమే నీవనియెంతురు



దవిలి యొనర్చిన జనములు ధన్యులు వి॥

క॥ యత్కించ భక్తితోనా
పత్కాలమునన్ హరే కృపామయ దలచన్
పూత్కార యముఁ డోలుచు
సత్కారము జేతువీవు సరసను వి॥

క॥ వందే నీరదసదృశా
వందే పాపౌఘభంగ వరద శుభాంగా
వందే లక్ష్మీకాంతా
వందే కమలదళనయన వరగుణ వి॥

క॥ వందే శాంతాకారా
వందే భుజగేంద్రశయన వారిజనాభా
వందే యమరాధీశా
వందే విశ్వస్వరూప భవహార వి॥

క॥ గనువందన మోజిష్ణూ
మునిచిత్తధ్యానగమ్య మురహరశౌరీ
ఘనతర భవ భయహరణా
యొనరింతు నమస్కారముల యోప్రభు వి॥

క॥ వందే త్రిజగాధీశా
వందే కమలాత్మవాస వరదముకుందా
వందే మంగళవిగ్రహా
వందే జగదేకవీర భవహార వి॥

దేవాలయములు

క॥ కుగ్రామంబుల బాపను
లాగ్రహమును జెంది జాతు లందున నేరీ
ఉగ్రాయని నీరంబుల
జాగ్రతగా బోయనివరు సరసమ వి॥

క॥ శ్రీశైల మహానందిని
కాశీ గోకర్ణములను గైకొని జలముల్
హాశివయని యభిషేకము
వాశిగ వర్ణములొనర్త్రి వరలగ వి॥

క॥ స్వాముల మంచు ప్రసాదము
ధామములకు జేర్చి మెక్కి తనవిని దీరగ
పామరులకు మెతుకైనను
ప్రేమంబున బెట్టరెట్టి పెద్దలొ వి॥

క॥ అనఘులగు రామకృష్ణుల
కు నివేదన మాచరించి కుడిచే వారల్
దిన రేల క్షత్రియాన్నము
ఘనధర్మమె బ్రాహ్మణులకు గాంచగ వి॥

క॥ నగరేశుడు లేనిది నెం
చగ కన్యార్పణముగాని సాదము గొనగా
తగవుగాదనుచు బల్కను
నిగమంబులుజూచు విప్ర నేతలు వి॥

క॥ చదువగ రాదట వైశ్యులు
ముదమున సన్మంత్రపువ్వు మును గుడులందున్



బెదరింతురు గ్రామంబుల
వదలరు దుర్మార్గచయము బాపలు వి॥

క॥ అమిత దురాచారంబుల
తమి హీనస్త్రీలనుంచి తద్దినముల నే
రముగను బెట్టని బాపలు
సమమే సచ్ఛూద్రులకు విచారము వి॥

బీజప్రాధాన్యము.

క॥ బీజప్రాధాన్యము మును
తేజమెసగ బుట్టుచుండె ధీరులు ఋషులున్
పూజిత భగవద్భక్త వి
రాజిత యుత్తములు సుగుణ రమ్యులు వి॥

క॥ క్షేత్ర ప్రాధాన్యముగా
సూత్రములను వ్రాసె ఋషులు శోభిల్లగ స
ద్గోత్రజులట్లే నడువగ
పాత్రతయని దలచిరెల్ల భరతము శౌరీ॥

పరిపాలన

క॥ ప్రజల కష్టముల దీర్చుచు
గజిబిజి లేకుండ రాజు గాపాడవలెన్
ప్రజలు నృపభక్తి గల్గియు
నిజమున వర్తింపవలయు నిత్యము వి॥

క॥ ప్రజల తమ సౌఖ్యమునకై
సృజియించెను బమ్మటంచు చెప్పగనగునా

ప్రజలగాపాడ రాజ్యము
సృజియింపగనయ్యె నృపులు చెప్పర వి॥

క॥ పచనము సరిగాలేకను
రుచియించని విధముగా ని రూఢత లేకన్
సచివులకు హక్కు లేనిది
రుచియించునె పాలనంబు రూఢిగ వి॥

క॥ ప్రజలును పాలితులును ధర
నిజమగు మైత్రిని మెలంగి నియతి నిలుతురో
గజిబిజులు లేకయుండును
సుజనులకున్ సంతసంబు సూ॥ గురు వి॥

ఆచారములు.

క॥ మడియంచు నీళ్ళుబోసుక
తడిగుడ్డలతోడ వంట తగునే చేయన్
పొడివస్త్రములే శుభముల
తడివస్త్రము లశుభకార్య తతులను వి॥

క॥ ఉత్తమమౌ కార్యంబులు
మృత్తికపాత్రలను వాడ వేద హితంబా
ఇత్తడి పాత్రలవాడుట
ఇత్తరి ధర్మంబుగాను హెచ్చెను వి॥

క॥ తండులముల దోషంబులు
కుండల వండినహరించు గుణమును వేకుల్



వండిన ధాన్యపురాసుల
మెండుగ భూపుటములిడుట మేలగు వి॥

క॥ రాగి వినిర్మిత పాత్రల
బాగుగదా వాడనెందు పానీయములన్
త్రాగగ మలినము బాపును
రోగక్రిములను హరించు రూఢిగ వి॥

వివిధ విషయములు.

క॥ కొబ్బరి లేతది మెక్కిన
జబ్బుల నన్నిటిని బాపు జాటుదు ఢంకా
దెబ్బలు గొట్టుచు నెల్లెడ
అబ్బుర మొందంగనేల యవ్యయ వి॥

క॥ యతిపీఠంబులు దిరిగెడి
సతతముమతబోధ లేవి సల్పకపురముల్
వెతకి ధనికులబట్టుక
శత దశకంబులను లాగ శక్తిని వి॥

క॥ మర్మములేమియెరుంగని
కార్మికులను బాధపెట్టి కర్షకుల కెటన్
ధర్మముగాదుదలంపగ
నర్మిలిజూడంగనగును యవ్యయ వి॥

క॥ జాడలెరుంగక బీదల
కోడిగమాడుదురు ధనిక కోటితలచతా

* భూపుటము=సారెరబెట్టుట.

మాదున వే దబ్బరలగు
వీడునవే సుగుణసత్య వితతులు వి॥

క॥ పాటుగ పంటలు పండిన
కాటకమే బోదదెట్టి కాలము దలపన్
మేటి నాకరులు గాంచుచు
బూటకములు వల్కుచుంద్రు పుణ్యామె వి॥

క॥ కోటలుగలినవారలు
పేటలు లేపంగవలసె పెద్దలుదూరన్
దాట సిరివాడుబడు న
ప్పాటులు గననగును దీన పాలన వి॥

క॥ కలమాడుకొంత దేనికి
చెలువుగ బ్రాహ్మక్షత్త్ర్యవైశ్య జీవితములమం
డలినొకటి పూర్తిజేసెద
కులజులుసాయంబొనర్చిగోరిన వి॥

క॥ రుక్మిపరాభవధుర్యా
రుక్మిణిమానససరోజ రోలంబేశా
రుక్మాంగదసంపూజిత
రుక్మాంచితచేల హారణ రుగ్మత వి॥ 100

క॥ ధామంబులుభక్తజన
స్తోమంబులు సుగుణజాల శూరులకెల్లన్
భీమంబులు త్రేతాగ్నుల
ధూమంబులు శుద్ధిశేయ దోషుల వి॥



క॥ సారంబులు వేదవచో
పూరంబులు సచ్చరిత్ర పుణ్యావదీన
స్సీరంబులు భవభయహార
ధీరంబులు దివ్యకథలు తిరముగ వి॥

క॥ దండంబులు గురుజనులకు
నండంబులు పక్షిజాతి కంలెకు గాంచన్
కుండంబులు వహ్నులకిల
పిండంబులు బిత్రుతతికి ప్రియమగు వి॥

క॥ సంకర్షణ మధుసూదన
పంకేరుహనేత్ర తీర్థ పాదయుపేంద్రా
శంకర విధినుత భక్తవ
శంకర శ్రీధర మురారి శాశ్వత వి॥

క॥ వేమరు నిను నుతియించితి
దామోదర నారసింహ ధర్మవిచారా
వామన మధుసూదన నా
కామితముల దీర్చువేగ కరుణను వి॥

క॥ కంఠీరవంబు లదరు నె
కంఠంబులుబగుల శునక కాండమరచిన్
కుంతలకు జంకు నే వై
కుంఠుని సద్భక్తవితతి గురువర వి॥

స్వవిషయము.

క॥ కరదీశ్వరుసత్కృపనం
స్ఫురణంబుల బలికినాడ సత్యంబంచు సు
స్థిరబుద్ధి దోచినంతకు
పురుషులు భావించనగును పూర్తిగ వి॥

క॥ ఝుడియక సర్వేశ్వరుకృప
నుడివితి పద్యముల లలిదె నుంగున నెన్నో
విడతు నికమీద కవితము
గడిపెదకాలంబు వర్తకమునను వి॥

క॥ మిథ్యావాక్కులు బల్కను
చోద్యముగా దెందు హితులు చూడగవలయున్
పద్యంబులల్ల నికశ్రుతి
వేద్యావిపులాంతరంగ విధినుత వి॥

క॥ కర్పూరలిప్తదేహా
దర్పాంతకవినుతనామ దానవభీమా
సర్పారిగమనధుర్యా
అర్పణగావింతుగ్రంధ మవ్యయ వి॥

కాలము.

క॥ మానిని విక్టోరియ త
త్సూనుని పరిపాలనముల జూచితి నిపుడా



రాణీ పౌత్రుని కార్యవి
ధానము లారయుచునుంటి తప్పక వి॥

క॥ క్రమముగ మార్లేసంస్కర
ణములను మాంటాగుశాస నంబుల నటుపై
గమనించుచుంటి ద్వంద్వవి
ధమగు పరిపాలనంబు ధర్మము వి॥

క॥ కంటిని మార్షలుచట్టము
కంటిని కాలటువిధాన కార్యక్రమముల్
కంటి నాంగ్లోతత్వము
కంటిని పాంచాలవధల కాలము వి॥

క॥ ఎనిమిదిశేరుల కష్టము
గను బియ్యము రూప్యమునకు గాంచెడివేళన్
మననైదుగ కంట్రోలం
చని చేసిన బ్రతుకగంటి నరవిగ వి॥

మంగళము.

క॥ మంగళము గాంధిమానికి
మంగళమెపుడగును సర్వ మతసహితులకున్
మంగళము సజ్జనాళికి
మంగళమా దివ్యసుగుణ మతులకును వి॥

క॥ మంగళము భారతాంబకు
మంగళ మా దేశభక్త మండలి కెల్లన్
మంగళము రాట్నములకును
మంగళ మెల్లప్పు డాంధ్ర మాతకు వి॥

క॥ మంగళము భార్గవీపతి
మంగళమో భక్తపోష మాధవ శౌరీ
మంగళము శేషశయనా
మంగళ మెపుడయ్యా నీకు మధురిపు వి॥

క॥ ఈవిష్ణుశతక మెవ్వరు
ప్రావీణ్యముతోడ వ్రాసి బఠియించినచో
దేవతలు మెచ్చి మనముల
దీవింతురు కీర్తివెల్గ దిక్తతి వి॥



ఓం.

# శ్రీ విష్ణోత్తర శతకము.



క॥ శ్రీలక్ష్మీనారాయణ
ఖేలా భక్తజనహృదయ కిల్బిషవిలయా
శూలాయుధనుత సద్గుణ
జాలా వైకుంఠవాస శాశ్వత వి॥

క॥ శ్రీశంఖచక్రపాణీ
పాశాంకుశధారి విష్ణు పతిపూజిత స
ద్యాశాంత విమలయశ లో
కేశా భవబంధనాశ హేహరి వి॥

క॥ శ్రీ క్షీరాబ్ధిసుతాధిప
రక్షాసద్భక్తబృంద రాజీవాక్షా
అక్షీణకృపావీక్షా
శిక్షాదుష్టజన శూర శ్రీహరి వి॥

క॥ శ్రీ గోవింద జనార్దన
భోగీంద్రశయాన భక్త పోషణ శౌరీ
రాగద్వేషవిదూరా
నాగారి తురంగ వినుత నారద వి॥

క॥ శ్రీపరమాత్మ కృపామయ
పాపౌఘవినాశ తీర్థ పాదబుధేశా

తాపసవందితచరణా
నీపాదంబులను మదిని నిల్పర వి॥

క॥ సృష్టిని జగములొనర్చుచు
నిష్టముగా బెంచి నడచు నవ్వాండీ వే
దుష్టుల శిక్షనొనర్చుచు
శిష్టుల పాలించుగాదె శ్రీధర వి॥

క॥ నారాయణుడన లక్ష్మీ
నారాయణుడనగ సత్య నారాయణ నీ
వే! రాజీవవిలోచన
భూరిదయాపాంగ భక్త పోషణ వి॥

క॥ అబ్జోద్భవాదిసురనుత
కుబ్జావక్రత్వరహిత కుండలిశయనా
అబ్జధరవినుతనామా
యబ్జాక్ష వికుంఠవాస యమిహిత వి॥

క॥ గీర్వాణ కవిప్రముఖుల
సర్వాంధ్రకవీశవితతి సంస్తుతి జేతున్
దుర్వార వాగ్విజృంభణ
సర్వజ్ఞుల దలతునెందు సరసుల వి॥

క॥ మాత కస్తూరిబాయిని
ప్రీతాత్మ వసంతదేవి బీయమ్మను వి
ఖ్యాతిని సరళాదేవిని
నీతిదలంతును సరోజిని న్మది వి॥



క॥ మొల్లాంబను వేడుక నా
యుల్లంబున సత్కవిత్వ మొప్పగ బొగ్డ
ఫుల్లాబ్జాక్షిని వెంగమ
తల్లిని నుతియింతు విద్య దాల్పగ వి॥

క॥ భక్తిరసామృతమును స
ద్యుక్తిక సాధనముగాగ ముగుదవ్రాసెనో
శక్తికొలందిని నెంచెద
వ్యక్తత కవయిత్రి సత్యవతి నిల వి॥

క॥ తలచెదను దేశబంధుని
దలతును నేదేశభక్త ధను నెదలోనన్
దలతును దేశోద్ధారకు
తలచెద నేనాంధ్రరత్న ధన్యుని వి॥

క॥ తలచెద గాంధిమహాత్ముని
దలతాలీ సోదరులను ధన్యులమదిలో
దలచెద నజ్మలఖానుని
దలచెద లాజపతిరాయి తప్పక వి॥

క॥ క్రమముగ ఖురాను కర్థము
నమరగ వచియింప గల్గు సట్టి హితాత్మున్
ఉమరాలీషా సత్కవి
ప్రముదంబుననెంతు నాంధ్ర పండితు వి॥

క॥ పంకము లెరుగని ఘనని
శ్శంకమతి న్గాంధివంశ సంభవుడధరన్

వెంకట సుబ్బారాయుడ
శంకరు మదిదలచువాడ సత్యము వి॥

క॥ మా పెద్దలు దృఢకాయులు
సాపాటుకు కొదువలేక సతతము వెల్గ౯
నా పాటవంబు వ్యాధుల
చే పీడనమొంది చెడియె శ్రీధర వి॥

క॥ బలికెద సంస్కారణంబుల
తిలకించుచు శాస్త్రజనులు దిట్టినగానీ
కులపెద్దలెల్ల నవ్విన
జలజాక్షుముకుంద శౌరి చతురత వి॥

క॥ క్రోధన వత్సరమందున
బాధించ చలిజ్వరంబు పద్యశతకము౯
శ్రీధరు సంబోధించుచు
సాధించితి పెద్దలెన్న సకలము వి॥

క॥ శీతజ్వరమున ముంచియు
భీతిని గలిగించి మిగుల బెదరించిన నా
చేతనైనంతవరకును
చేతన సంరక్ష దలతు చిత్తము వి॥

క॥ వెలయించి పద్యశతముల
గెలచితి మును మిత్తి నిపుడ గెలువగలేనా
జలజాక్ష మాటిమాటికి
పలుబాధలు బెట్టి వేచ భావ్యమె వి॥



క॥ వరలక్ష్మీనారాయణ
గురునాథేశ్వరుని దివ్య కోవెలయందు౯
కరుణించను సద్భక్తుల
స్థిరముగ వెలసితివి దేవ చిన్మయ వి॥

క॥ గుళికపురంబున బాగుగ
విలసిల్లెడి తిలకుపేట వెలసితివౌరా
సలలిత గురునాథుని దే
వళమున లక్ష్మీసమేత వామన వి॥

క॥ చావన్న నాత్మలోనే
నావంతయు భీతిజెంద నవనీస్థలిలో
జీవులు తిరముగనుండవు
చావునుగనుటేనిజంబు సర్వము వి॥

క॥ ఎప్పుడు రోగంబులచే
తిప్పలు బెట్టుటయు నీకు దృప్తియగున నా
తప్పులు మన్నించుము కృప
నప్పా ముల్లోకనాథ హరిశ్రీ వి॥

క॥ బాధలు బెట్టుచు నిప్పుడు
సాధించిన నాదుభక్తి సల్పనుదేవా
యాధారమౌచు జీవుల
కాధారముగావె నాకు యవ్యయ వి॥

క॥ బోయిరి విడచియు సహాసా
కాయులు కలినుండ వెరచి కావిగ నెటకో

కాయము లస్థిరమంచని
హాయిగ నేనెపుడు గలతు నట హరి వి॥

క॥ ఒకయపరాధ మొనర్చితి
నిక జేసి యెరుంగ దెలసి యెవ్వియు ధాత్రిన్
సకలంబు నీకు దెలసును
యకలంకుడ నిర్వికార యచ్యుత వి॥

క॥ కందములు జెప్ప కవియగు
కందంబులు వ్రాయ సులభ కార్యమ దలపన్
కందంబులు జూడగ మా
కందంబులుగావె పద్య కాండము వి॥

క॥ నిజమే బాణోచ్ఛిష్టం
సజగత్సర్వంబను ఘన సామెత వినమే
గజదొంగవాడు పూర్వక
విజన పదంబులు హరించ వినుమా వి॥

క॥ ధీరముతో ధర్మముకై
కారాగారములకేగి గనిరో కీర్తిన్
వారల నుతిజేతును వే
మారుమదిన్ దేశభక్తి మరువక వి॥

క॥ మాతభరతాంబ భర్తుడు
పూతచరిత్రుండు గొల్లపూడి కులజుడున్
సీతారామ ఘనాహ్వయు
ప్రీతిని మనమందు దలతు శర్మని వి॥



క॥ సత్యానారాయణాహ్వయ
నిత్యము నీసేవజేతు నిర్మల భక్తిన్
ప్రత్యక్షమౌచు బ్రోవర
భత్యము నేనేమిగోర భవహార వి॥

క॥ సత్యాగ్రహవిజయంబును
ప్రత్యక్షము జేసికొనిరి భరతసుతులలో
ముత్యములకాలిజనములు
ప్రత్యేకము హరిదలతు భవహార వి॥

క॥ సరసీరుహపత్రేక్షణ
కరుణాకర దీనపోష కల్మషనాశా
పరమానందంబున నిను
శరణంటిని గావవేమి స్వామీ వి॥

క॥ అవ్యయ పరమానందా
దివ్యాభరణంబులను గోర దీనదయాళో
నావ్యాధి దోలి వేగమ
సవ్యంబుగ బ్రోవు మికను సద్దయ వి॥

క॥ పాత్రంబులు భక్తజన
క్షేత్రంబులు సుఫలతతిని సేకూర్చగ స
ద్వేత్రంబులు ఖలజనులకు
శాత్రంబులు రిపులద్రుంచ చరితలు వి॥

క॥ ప్రేమంబులు నీ దృక్కులు
నీమంబులు సత్యవాక్య నియుతులు దెలపన్

భీమంబులు రిపువితతికి
సామంబులు దివ్యబోధ చయములు వి॥

మతములు.

క॥ లింగంబులు ధరియించుక
జంగములై వడుగుమాని శైవమతమునన్
లింగంబులుంచి బ్రాహ్మణ
భంగము గాకుండ బూని వడుగుల వి॥

క॥ వన్నిద్దరు భక్తులు యే
వెన్నని గుడియందు వేడ్క వెలయగ నుంద్రో
ఎన్న దగదంటు నచ్చట
తిన్నగ వైష్ణవులుబల్కు తీర్పుల వి॥

క॥ కులముల జూడగ వేవి
ప్రులుగారు పవిత్రులగును బోయవొకండా
ఇల మాలకులజు డొక్కడు
పలుజాతులు గలరు దివ్య భావులు వి॥

క॥ శ్రావక మహిమ లెరుంగక
భావమునన్మాలడంచు భక్తిహీనులై
శైవులు శఠగోపంబును
ఏవిధి తలనిడగనొప్ప రెప్పుడు వి॥

క॥ లింగం బూడెను దారక
యంగనలన్ గూడ శివుడు నద్దానికిమే
మొంగి దండంబు లిడమని
రంగుగ వైష్ణవులు చెప్ప రానిల వి॥



క॥ నిర్బంధ పదములొక్కట
గర్భములన్పెరుగకుండ గట్టుట సరవిన్
యర్భకులస్తునిలొక్కట
నిర్భాగ్యుల నమ్ముటొకటి నిక్కము వి॥

క॥ మతబోధ జేయు కెంతయు
యతిపీఠములెల్ల పల్లెలందు దిరిగడిన్
కుతికలనిండగ మెక్కుచు
సతతము ధనములనులాగ జనముల వి॥

సంస్కరణలు.

క॥ బాలవితంతు వివాహము
వేలీలను సల్పబూన హేళనసల్పన్
జాలినిబొందరు లేశము
కూలిన నరకంబునందు గోకుల వి॥

క॥ అక్షతయోని వివాహము
లక్షణముగ జేయ యుక్తమని శాస్త్రంబుల్
దీక్ష నుపదేశమిచ్చిన
దాక్షిణ్యము లేశమైన తల్పరు వి॥

క॥ పీటగల పూలపల్లకి
లోనునిచియు వేడ్కమీర నుత్తరదిశకున్
పూనికను బంప మోక్షము
మానగ బొందంగనౌనె మాధవ వి॥

క॥ గతులకు బుత్రుల వడసియు
సతి నష్టుండైనవాడు సౌఖ్యముకొరకున్

హితమౌనె బాలికామణి
సతిగా జేకొనగ మరల శాశ్వత వి॥

క॥ పరిశోధన మొనరించియు
విరివిగ శాస్త్రముల బాల విధవలకెల్లన్
మరల వివాహము మేలని
వరయీశ్వరచంద్రుడటుల బలుకడె వి॥

క॥ మోసమును జేసి విధవలు
వాసమునందే వశించి వాదునణంగన్
జేసినను భ్రూణహత్యలు
దోసములన్నెంచ రెవరు దుష్టులు వి॥

క॥ తలిదండ్రులు వంటలు విధ
వలచే జేయించుకొనుచు బరగుచు సుఖమున్
దలపున బెట్టరు కష్టము
లిలపాపముదలచ కేమి యిసకుల వి॥

క॥ మగలిడిన సొమ్ములెల్లను
తెగనమ్మికతినుట మరగి దిట్టి విధవలన్
పగలును రేలును చాకిరి
తగజేయించుకొను తల్లిదండ్రులు వి॥

క॥ యవ్వన విధవల కేశము
లెవ్వియు లేకుండ గొరుగ నెంచిన పెద్దల్
యవ్వనదూరుల ముసలుల
కవ్విధి జేయంగనేల ఘనమా వి॥



క॥ భ్రమబుట్టింపని ముసలుల
క్రమముగ జేయంగ కేశఖండనమేలా
భ్రమబుట్టించెడి యవ్వన
కమలముఖుల జేయగాను కార్యము వి॥

క॥ ఏడిచెదరనుచు నిల నా
చేడియలకు గొరుగలేక సేవజెడినచో
బోడుల జేయుట భావ్యమె
మాడును రుద్దినను బట్టి మంగలి వి॥

క॥ క్షురకర్మ విధవలకు నే
గురుశాస్త్రములందుజెప్పె గుణయుతులెన్నన్
వరులంతరించ మీదట
పరపురుషుల దేరిచూడ పాపము వి॥

క॥ మంగలి తలరుద్దుచు గొరు
గంగను మరి సిగ్గుగాదె కాంతలకే యా
మంగలి వృత్తిని నేర్పిన
రంగుగ కీడందు మేలు రాజిలు వి॥

క॥ కుంతలములు దీయించిన
యింతుల కంటెను దలంచ నెలమిని మేలా
కుంతలములు దీయించని
యింతులు శూద్రాదులేమి యెరుగరు వి॥

క॥ పరిపూర్ణ యవ్వనంబున
పురుషుల భ్రమపెట్ట నేవి బోలవు స్త్రీకిన్

కురులేన దిక్కు వసితకు
పురుషులు భ్రమియించుటకును పూర్ణత వి॥

క॥ తిరుపతి మొదలగు యాత్రల
కురులను మ్రొక్కుల కొసంగి కొప్పనిడంగఁ
సరితూగువరకు దంపతు
లిరువురు కూటంబుగారె హితవుగ వి॥

క॥ కేశములు లేక యుండిన
యాశలు జనియింపకున్న యుంగజారతికిఁ
దేశమునందున విధవల
కేశము సద్బుద్ధిగనని లింపులె వి॥

క॥ తైలము గావలె బూయగ
పేలుబడఁ గోకికొనును పెచ్చుడియేలా
చాలాచిక్కులు గల్గును
యీలాటి ప్రయాణంబు విధవ కేలను వి॥

క॥ తలకును నూనియ గన మం
గలికిని మరిఖర్చుగాదె కడునీచంబా
దెలసిన ధర్మంబట్టుల
బలుకరు విధవలగురించి బాముల వి॥

వివాహములు.

క॥ మూల్యమగు సంధ్యాలందున
కల్యంబుల దీర్చలేని కాలమునందుఁ
బాల్యంబని దలచకనే
కల్యాణమొనర్చ బాగుగాదుర వి॥



క॥ వైవాహికముల జేతురు
దేవాగారముల నొక్క దివసమునందే
దైవజ్ఞ విప్ర వైశ్యులు
యీవిధి వేదంబు దెలుప నెంచుని వి॥

క॥ అరువైయేడులు దాటిన
వరుడై కన్యకలగోరి వైభవమొప్పఁ
పరిణయమందును నిల నె
వ్వరు దూషింపరు దలంప వాశియె వి॥

క॥ ఇడి పటముల మందిరముల
వడుగుల పెండ్లిండ్లుజేయ వచ్చునె దలపఁ
పుడమిని శాస్త్రము లొప్పునె
గడబిడలే జేయరెవరు గాంచగ వి॥

క॥ జరిగిన యుపనయనం బిల
గురుకులమున వటువు విద్య కొరకును ధరణిఁ
స్థిరుడౌచు బ్రహ్మచర్యము
జరుపగవలె శాస్త్రమొటుల జాటును వి॥

క॥ కరి తురగారోహణముల
వరులకు గూర్చకను పూల పల్లకులంచుఁ
సుర వాహనముల కొన్నిటి
గిరగిర ద్రిప్పంగనాన కేరుచు వి॥

క॥ గుడి కట్నంబుల బాధలు
కుడలేకను యుండ్లయందు పటములుంచుచుఁ

గడియల పెండ్లి నొనర్పుట
బడి శాస్త్రిలు తప్పటంచు బల్కారు వి॥

క॥ కటముల బెట్టుచు పెండ్లిని
పెటపెట జేయగను నగర పెద్దలు నగరే
యటుజేయ బాలవిధవల
పెటపెట దిట్టుదురు రేగి వృద్ధులు వి॥

క॥ అక్షతయోని వివాహము
లాక్షేపము లేదటంచు యమివరు లెంచెన్
దీక్ష నొనర్చిన వారికి
మోక్షము తప్పక లభించు మురహారి వి॥

క॥ ధనమున్న ముసలివానికి
గని కన్నియ నిచ్చి తాలి గట్టించుచు వా
తని చావు గోరుచుందురు
గొని ద్రవ్యంబంతదినగ కోరిక వి॥

క॥ పదిరెండు వర్షములకే
కుదురుగ పరిణయ మొనర్చ గూడదు దలచన్
వదలక బాలగ్రహములు
బెదరించుచు విరచి తినును బిడ్డల వి॥

క॥ బాలారిష్టంబులు జను
కాలముగని పెండ్లిమీద గావించుట యో
మేలగు నెందుల బిల్లల
స్త్రీలకు నటులే దలంచ చెలువగు వి॥



క॥ పదిరెండు గ్రహంబులు భువి
పదిరెండగు వర్ష మాస వారములందున్
యుదలించి మొక్క శిశువుల
వదలును యామీద భూత బాధలు వి॥

క॥ కన్యావిక్రయులను మరి
సన్యాసముదాల్చి వేడ్క సౌఖ్యముగోరే
మాన్యజ్ఞానుల జూచెద
పణ్యస్త్రీలటుల భక్తపాలన వి॥

క॥ మును సహగమనంబుల ని
ల్పెను శాస్త్రంబులనుజూచి పెద్దలు దిట్టన్
ఘనరామమోహనుడు సా
ధనగావించియును మంచి దారిని వి॥

క॥ కన్నెలనొసగ కులీనుల
పున్నెమటంచనుచు నొక్క పురుషునికె దగన్
పన్నిద్దర పైగట్టరె
మున్ను బలే వంగరాజ్యమున హరి వి॥

క॥ నరసిండ్లును గంగా జా
తరలను గావించుటెల్ల తప్పని బాగా
మొరవెట్టె రామమోహన
గురుడా పెను దేశమందు గుణమగు వి॥

క॥ ఇట్టి దురాచారంబులు
పుట్టి వినాశనము పుణ్య పురుషులచేతన్

వట్టుగ నగుచుండును ధర
పుట్టలచదలల్ల పరమ పూరుష వి॥

క॥ తలపై శఠగోపము శై
వులు నిడరొప్పరటులను భవుపద యుగంబుల్
సులభముగా వైష్ణవులకు
తలపై బెట్టగను పెద్ద తప్పగు వి॥

క॥ వెధవకు దండము బెట్టిన
ప్రధితంబుగ తన్నబోలి బ్రతుకుమనును యా
విధమున చెడి తా మితరుల
వృథగా చెడగొట్టె విప్రవితతులు వి॥

క॥ తెల్లని మాదిగవానిని
నల్లని బ్రాహ్మణుని భువిని నమ్ముదురా యం
చెల్లెడ జెప్పెడి సామెత
కల్లో నిజమో గ్రహింప గా నగు వి॥

క॥ గద్దియ యతులకు దగరట
విద్దెగల నిరోగులెవరు వేదహితంబౌ
శుద్ధులుగను వారొందురు
పెద్దలు వైదీకులంత పీటకు వి॥

క॥ వధజెంద నొకనిచేయుతి
విధిలేక రహస్యముగను విప్రయువకులిల్
బుధులాశ్రమ మిచ్చిరటా
ప్రథితాత్ముడుగాకయున్న ఫలమా వి॥



క॥ వైదీకుల కధికారము
లేదని శైవులు వచింత్రు లింగాదిప్రతి
ష్ఠాదుల జేయుట నెచ్చట
వాదము లోకజాతియందె బరగెను వి॥

క॥ మోసమొనర్చిరి బాపలు
దోసముబాటించ కేమి దూరము గనక
భాసుర భారతదేశము
కాసుకు గాకుండజేసె కర్మము వి॥

క॥ పైపులు పంచములంటిన
సైపుదు రది వల్లపడదు సరసుల దారిన్
కాపుల కరణాల్జేరుచు
నేపుకదిను చోద్యమగును హే! గురు వి॥

క॥ కాలేజిలందు బాపన
బాలకు లామాలవారి పక్కచదువగా
వీలగును వీధులందున
చాలాదూరంబు తొలగి చనవలె వి॥

క॥ వేదంబులు చదివిన యా
వైదికులే కన్యకలను వర్తక సరణిన్
మోదమున నమ్మసాగిరి
కాదన నెవ్వారివశంబు గాంచగ వి॥

క॥ తెలు పెరుపు పసపు నల్పుల
పలువలగట్టంగ నాల్గు వర్ణములకగున్

నలుపును గట్టగరాదని
తెలియరు బ్రాహ్మణులదేల ధీరము వి॥

క॥ సాయమొనర్చెను నీయాం
గ్లేయోద్యోగంబులందు గెలచిరి విప్రుల్
సాయము పాచ్ఛావరులకు
హాయిగ నొనరించె వెనుక వరయగ వి॥

క॥ మతముల నన్నిటి నిల్పిరి
మతిమంతులు బ్రాహ్మణులిల మాన్యులు సుగుణుల్
సతతము వాదింతురు యే
హితమో నెత్తినిడ దింప హీనము వి॥

క॥ మోదంబున నియోగులు
వేదంబులు చదివిరేని వీనులునిండన్
వైదికులు వినసహింపరు
భేదంబే విప్రులందు పెరుగుట వి॥

క॥ పదమూడేడులు గడచిన
పదమూడగు వందలకును బాలికలమ్మన్
యిది పాలఘాటువారలు
మొదలిడ నాంధ్రులకు మిగుల మోదము వి॥

క॥ రాజుల భజనలొనర్చిన
పూజల నభిషేకములను పూర్తిగజేయన్
భోజనములు గావించిన
వేజనరే కూలిగొనక విప్రులు వి॥



వైశ్యులు.

క॥ పరదేశంబున జదివియు
బరతెంచినవారి వైశ్య వరులెదలందున్
పరమానందముతో గల
సిరి శాస్త్రహితంబటంచు పెద్దలు వి॥

క॥ పడినీమనాటుకత్తులు
గడబిడ లొనరించి ముదిమి గాంచిన పెద్దల్
యడరక నిలచినవారల
కుడుపుకు రాకుండజేయ గొట్టిర వి॥

క॥ పరదేశీయులు మనదగు
భరతము పాలించుచుండ ప్రజలచటికి నే
ర్పరులౌచు బోకనదినే
తరి తప్పుగ దలచరాదు తథ్యము వి॥

క॥ ఆమొనరించెడికార్యము
లేమాత్రము శాస్త్రహితము నెంచరు వైశ్యుల్
వేమారు దుర్వ్యయంబుల
ధామములందున నొనర్త్రు దల్పగ వి॥

క॥ తురక గంగమ్మ నెత్తిన
చరణములిడ కాపుజేరి చాటినరీతిన్
దరి మాల లుంచ బాపలు
గురితో వైశ్యులకుదెల్పె గొలగ వి॥

క॥ సాయమొనర్చరు వైశ్యులు
వ్రాయగనే గ్రంధములను నాసమునందే

హాయిగ జీరము మేలగు
జేయుము కవినింక నొకరి చెలువుగ వి॥

క॥ ధృతికోలాటము వైచుచు
బతకమ్మను నవమరాత్రి పండుగలందున్
అతివలు దిరుగుచు గొలచుట
వెతుకగ గోమట్లయందె వెలసెను వి॥

క॥ వరకన్యాశుల్కంబులు
సరె గర్భాదానములకు శౌరీల్గోరన్
వరధర్మమగునె వైశ్యులు
భరియించుడు పాపమెటుల భరతము వి॥

క॥ ఉపహారము పల్లింబుల
విపరీతముగాను నగర వీథుల ద్రిప్పన్
చపలాత్ములంటిరా యే
చపలంబగు వైశ్యులందు సత్యము వి॥

అస్పృశ్యత.

క॥ పెంటదినునట్టి కుక్కల
నంటుచు ప్రేమించవచ్చు నటు పంచములన్
యింటికి రానిచ్చినయెడ
అంటట చోద్యంబుగాదె హరిహరి వి॥

క॥ గలపిరి రైళ్లను యంటును
నిలపక దొరతనమువారి నిందింతురుగా
గలపిరెవరు తిరుణాళ్లను
పలుజాతుల మైలనెల్ల భావ్యమె వి॥



క॥ తురకలు మాలలనేతుల
ధరతక్కువగాను దీసి దాని మరల స
త్పురవాసుల కమ్మినగొను
దురు విప్రులె చవికి మెచ్చు తుష్టిని వి॥

క॥ పంచమసోదర నేతులె
గాంచగ నాహుతులవెల్గు కార్యములందున్
మించిన రుచ్యమొసంగును
మంచి సువాసనల గ్రమ్మి మానుగ వి॥

క॥ బుద్ధిని గరుపగ ప్రజలకు
గద్దెల శంకరుదునిల్పె కర్మలదెలుపన్
పెద్దలిపుడెంచియతులకు
బుద్ధివిగరుపంగవచ్చె పూర్తిగ వి॥

క॥ పద్దములన్నిటియందున
గొద్దిగ రత్నములు దొరకు గుణముకలవిగా
పెద్దగను లందు వెదకిన
శుద్ధమైన వజ్రమొకటి చూపడు వి॥

క॥ మంగళము రమానాయక
మంగళమో భక్తపోష మంజులవేషా
మంగళము వేదవేద్యా
మంగళమో నిర్వికార మాధవ వి॥

క॥ స్వస్తిగోవర్ణములకును, స్వస్తియగున్ ప్రజలకెల్ల సంయమితతికిన్
స్వస్తిసత్పాలనమునకు, స్వస్తిజగత్తులకు భరత సంతతికపుడున్ వి॥

# శ్రీ విష్ణుతారావళి.

క॥ దశరూపధారి విష్ణూ
దశవదనాంతకవిశేష దర్పసుదీప్తా
దశరథవంశపవిత్రా
దశలన్దీపించుదేవ తాను తశౌ(రి)

క॥ సురలను సంరక్షించగ
నరదాత బలీంద్రుకడకు నిర్మలమతితో
నరగి యాశోణనగరికి
నుగుదానము వేడవే వ(టూ)త్తమ వి॥

క॥ దేవా పరిశీలించిన
భావంబున పాపజాతి వాడ జనుండౌ
నావార్తలు త(ప్పు)గదా
గావుము క్షమియించి విశ్వ కారణ వి॥

క॥ దిననాథో(ఉ)జ్వలతేజా
దిననాయకవంశభూష దీనసుపోషా
దిననాయకసుతమిత్రా
దిననాయకపుత్రనుత సు ధీవర వి॥

క॥ (శ్రీ)విశ్వంభర కేశవ
భావాతీతాదిదేవ భవ్యప్రభావా
సేవాప్రియ దామోదర
పావనచారిత్రభక్త పాలన వి॥



క॥ (వేం)కటచలపతివీవని
శంకరుడని విష్ణువనుచు శక్తికొలది ని
శ్శంకనుతియింత్రు భక్తులు
సంకటహార దివ్యవేద సన్నుత వి॥

క॥ కరిరాజ వరద చక్రీ
కరుణా(క)రదీనపోష కల్మషనాశా
శరణాగత రక్షణగిరి
ధరణా రక్షించవేర ధన్యాఢ్య వి॥

క॥ శంకర శివ ముని సేవిత
పంకజభవ వినుత భవ్య పాదసరోజా
శంకర విసంక(ట)హారను
పంకజదళనేత్ర పరమ పావన వి॥

క॥ సూరిజనస్తవ చరితా
దారిద్ర్యతమోర్కబింబ ధర్మవిడంబా
వారిదతుల్యశరీరా
భూరి కృపాపాంగభక్త(పు)ంగవ వి॥

క॥ అయ్యా! నా మొరలను వినరా
వయ్యా! కారుణ్యసాంద్ర హరిశౌరీ యీ
వయ్యా! నీభక్తినిగడు
వెయ్యారులువద్దునాకు విధిగ(న్నయ్యా)

క॥ భక్తియుతంబుగ పూజా
సక్తిని దగ షోడశోప చారవిధులచే
శక్తి కొలందినొనర్చితి
వ్యక్తినొసంగుచునుగావు వరదా వి॥

షోడశోపచారపూజ.

క॥ భావాతీత జనార్దన
సేవాప్రియ వాసుదేవ చిన్మయరూపా
దేవాదిదేవ శౌరీ
ఆవాహనజేతు రా దయాకర వి॥

క॥ వ్యాసాది మౌనివందిత
భాసురవైకుంఠవాస వామన శౌరీ
దాసజనామరభూజా
ఆసనమర్పింతునే దయాకర వి॥

క॥ ఆద్యంతశూన్య నైగమ
వేద్యా భవరోగహరణ విశ్రుతలోకా
రాధ్య రమామణినాయక
పాద్యంబునుగొనుము భక్త పాలన వి॥

క॥ దుర్ఘటసంఘవిదూరా
నిర్ఘాతుకజనులబ్రోచు నిర్మలచరితా
దీర్ఘాలోచనవిజ్ఞా
అర్ఘ్యంబిదె గొనుము దేవ యతినుత వి॥

క॥ వాచామగోచరా భవ
ఖేచర గంధర్వ వినుత కిల్బిషహార్వై



రోచన పుత్రధ్వంసక
ఆచమనము ముంజకేశ యదుకుల వి॥

క॥ జ్ఞానానంద దయామయ
దీనావన యజ్ఞపురుష దివ్యవిలాసా
పానీయంబుల శుభ్ర
స్నానం బర్పింతునీకు చక్కగ వి॥

క॥ శస్త్రాస్త్ర చాపకుశలా
శాస్త్ర విచారణ విశాల సన్మనసాజ్ఞా
సుస్త్రీ సమాజ పోషణ
వస్త్రంబుల గొనుముమౌని వందిత వి॥

క॥ యజ్ఞమయ యజ్ఞరూపా
యజ్ఞేశ పురాణపురుష హరి జగదీశా
సుజ్ఞాన మౌనివందిత
యజ్ఞోపవీత మొసంగె దాభవ వి॥

క॥ గంధేభ పోషణా పరి
పంధి విరహిత జగదీశ పాపవినాశా
సింధుకుమారీధవ
గంధంబును గొనుము కార్య కారణ వి॥

క॥ తాంత్రిక పర్వతభిదురా
తంత్రీప్రావీణ్యా గాన సార సుహర్షా
యంత్రమనోహరశౌరీ
మంత్రసుమసమర్పణంబు మాధవ వి॥

క॥ శ్రీపతి విశ్వంభర సం
తాపహరణ శార్ఙ్గపాణి తార్క్ష్యతురంగా
భూపేంద్ర వినుతనామా
ధూపంబును గొనుము కుజన దుస్తర వి॥

క॥ పాపౌఘ విపినకీలా
ఆపద్బాంధవ రమేశ యజ్ఞపురుషయో
తాపసవందిత పాదా
దీపంబదె గొనుము మిగుల దృప్తిని వి॥

క॥ దేవాదిదేవ కేశవ
పావనచారిత్ర తీర్థ పాదరమేశా
సేవాప్రీత జనార్దన
నైవేద్యము గొనుము వినుత నైగమ వి॥

క॥ అంబుజనాభ జనార్దన
శంబరరిపు జనక చక్ర శార్ఙ్గ ధరానీ
లాంబర సోదర కేశవ
తాంబూలముగొను మిదే గదాధర వి॥

క॥ విమలగుణసాంద్ర కేశవ
కమలాచిత్తాబ్జభృంగ గరుడతురంగా
సుమనసవందిత రంగా
ప్రిమదనమస్కారములివె భవహర వి॥

క॥ సాధ్వీమణి శ్రీలక్ష్మీ
హృద్వన సంచార పూర్ణ హేతువిచారా



అద్వైత ద్వైత రక్షణ
ఉద్వాసన మప్పు హరి గుణోన్నత వి॥

క॥ మృత్యుంజయాది నిర్జర
స్తుత్యా వేదాంతవేద్య దుర్మదభేద్యా
సత్యప్రియ సకలేశ్వర
నృత్యమిదే యర్పణంబు హేగురు వి॥

క॥ విద్యాధురీణనుత శ్రుతి
వేద్యా విశ్వస్వరూప వేణువినోదా
ఆద్యంతరహిత కేశవ
వాద్యంబిదె మోదమందు వామన వి॥

క॥ పాతక హరసద్భక్త
వ్రాతస్తుత నిగమవేద్య వందితసాధ్యా
చేతనరక్ష మురారీ
గీతం బొనరింతు గొనుము కృపతో వి॥

క॥ సామాది వేదవందిత
సామజసంస్తుత్య వేద సార ఘనాభా
శ్యామ కుశేశయనయనా
చామర మర్తింతు వినుత సంయమి వి॥

క॥ దస్యుభయంకర హరి సుమ
నస్యఖిల గుణాబ్ధి పాప హరణ మురారీ
హాస్యజన వర్గనాశన
దాస్యసమర్పణము వర గదాధర వి॥

క॥ స్వారాజ్య దీప్తకుశలా
వైరాగ హృదాబ్జవాస వారిజనేత్రా
సారాచార విచారా
నీరాజన మర్పణము ము నివిహిత వి॥

క॥ శత్రుమదభంగ లోక ప
విత్ర భవలతాలవిత్ర విమలచరిత్రా
చిత్రపరివర్తనా ఘన
ఛత్రంబిదె గొనుము వేద సంస్తుత వి॥

యతిహిత నవరత్నములు.

యతులకు బెట్టగూడని పదార్థములన్గుదువంగ బెట్టి దు
ర్గతుల గృహస్థులందరును కాలుదుతప్ప క్షమించ డెంతయున్
అతిరసభక్ష్యపాయస ఘృతాన్నములన్ కడుపారమెక్కనన్
యతులకు పాతకంబని మహాఋషివర్యులు బల్కి రెంతయున్॥

కన చరమాశ్రమంబునిల గైకొను బాపనశాఖలందునన్
బనివడరంట నాడుల సంబంధము లేనిదె బీరమెక్కగా
ఘనతర సన్యసంబు దగ గాంచిన వారికి భేదమేలనో
జనులడుగంగ బాధ్యతను చక్కగగాంచ విధానమాగదా॥

మరిచంబుల్గొని ముంగిటన్నిలచుచున్ మంత్రింతుమంచున్స్వర్
కరులన్ద్వారము కడ్డుగానిల్పుచున్ గంపంబు నొందించుచున్
గురుశాపంబును బెట్ట నాశనమగున్ రొంపల్ధరన్నాలుచున్
వెరపుల్జూపిటు లాగు విత్తమహహా పాపాత్ములై బీరకుల్॥

సిలపిరె శక్తిబూనుచు ననేకులు క్రైస్తవు లౌచునుండగా
గలపిరె మోక్షమార్గముల గాథల నన్యమతస్థు లెందరిన్



నలపిరె యాదిశంకరుని సత్పథమెంచి మతాభివృద్ధిన్
దెలుపుమటన్న బీరములు దేబెతనంబును బూననౌగదా॥

భర్తగతించవేరొకని బాలికనంటగగట్టుశాస్త్రముల్
పూర్తిగ విశ్వసించుచును బోయినవైశ్యుని నాంక్షబెట్టుచున్
కర్తనటంచు బొంగగని గౌరవహానిని కోర్టుదెల్పగా
స్మార్తగురుండు శిక్షబడె శాస్త్రవిరోధము బూన గెల్చునా॥

ధనికుడటంచు గుర్తెరుగ తప్పక నాతనిపక్షమూనుచున్
గనక నధర్మ ధర్మముల గల్పుచు వర్ణమునందుధీరతన్
గొనుచు ననేక కావ్యముల క్రూరమటంచనిజూడ కెంతయున్
మనమునగుందు బీద యవమానమెదన్ దలపోసి దిట్టుచున్॥

బుధవర్గంబులగూర్చి ధర్మముల సద్బోధల్దగన్జేయరే
అధికారంబు వహించి గర్వమును బాహాటంబుగా జూపినన్
విధియావారికి బుద్ధిజెప్పగనిల న్విద్యాధికుల్బూనగన్
ప్రథితంబైన యకాలి ధర్మచయము న్భావింపగా మేలగున్॥

ఘనసౌఖ్యంబుల దేలి బొంగుచును ధిక్కారంబునుజ్జేయగా
అనఘుల్పావని యకాలి సోదరులు చిత్తాబ్జంబులన్గాంచి గ్ర
న్ననసత్యాగ్రహ సద్వ్రతంబుజయసన్నాహంబుకై బూనుచున్
గొనసర్వంబు జనాధికారమునకున్ గూడన్ నదేధర్మమై॥

స్వజనులగూర్చక న్యాయముల వర్తనులౌచు యతీశవర్గముల్
ప్రజలకు ధర్మమార్గముల పాపములెల్ల దొలంగ జెప్పనా
స్వజనులగూర్చి బోధనము సల్పుచు సౌఖ్యములందుచుండినన్
ప్రజలు బహిష్కరించనగు బాపముగాదు దలంచబుణ్యమే॥



ఓమ్.

# కన్యాంబాశతకము.

క॥ శ్రీసర్వమంగళార్యా
భాసురసద్గుణవిడంబ భం పతిబింబా
దాసోల్లాసిని గుంటూ
ర్వాసిని జగదేకమాత వరకన్యాంబా॥

క॥ స్వర్గాపవర్గదుర్గా
భర్గాత్మేశ్వరి యపర్ణ పార్వతి గౌరీ
గర్గాది సర్వతాపస
వర్గస్తుత లోకమాత వరకన్యాంబా।

క॥ ఆగమవిపినమయూరీ
భోగివిభూషణి భవాని పూజిత వాణీ
నాగయజ్ఞోపవీతుం
డౌ గణపతి గన్నజనని హాకన్యాంబా।

క॥ విఘ్న రజనీ ప్రభాకరు
విఘ్నాటవి వీతిహోత్రు విమల హృదాబ్జు
విఘ్నాబ్ధి బాడబాగ్నిని
విఘ్నేశుని వినుతిజేతు వికన్యాంబా।

క॥ కన్నట్టి జనకు బసవయ
నెన్నద వందనములిడుచు నింపుగనటులన్
పున్నయ్యావ్వాయు నాదగు
యున్నను దలచెదను నెప్డు హాకన్యాంబా॥

క॥ దుర్భర శీతజ్వర సం
దర్భమునన్ వ్రాసినాడ తప్పులుగలుగున్
దుర్బలమొప్ప కవిత్వము
అర్భకునటు జూచిమెచ్చ నగు కన్యాంబా॥

క॥ క్రోధనవత్సరమందున
సాధనచే వ్రాసినాడ సమయము హిమమౌ
శోధించి నెరసులుండిన
బాధించక నుండవలయు వరకన్యాంబా॥

క॥ మున్నొక వత్సరమందున
నన్ను చలిజ్వరము పీడ నము జేయుతరిన్
పన్నుగవ్రాసితి పద్యము
లెన్నో నీదయనుగాదె యిలకన్యాంబా॥

క॥ గ్రంధి సువంశజుడను నే
గాంధిమహాత్ముని హితంబు గాంచినవాడన్
కంధి తూణీరు నెంచెడి
గ్రంథంబుల జదువువాడ గన కన్యాంబా॥

క॥ కౌండిన్యస గోత్రుండను
పండిత మండలిని భక్తి బరికించెడి వై



ద్యుండను వైశ్యులలో మా
న్యుండను కాళీ! సురాళినుత కన్యాంబా॥

క॥ వేంకటసుబ్బారాయుడ
పంకజముఖి సుబ్బమాంబ బసవయ సుతుడన్
బొంకని తాతయ్యార్యు ని
స్సంకట దుహితాత్మజుడను సత్కన్యాంబా॥

క॥ కన్నసుతు భంగి ప్రేమను
జన్నిచ్చుచుబెంచె నట్టి సరమాంబను నే
సన్నుతి జేసెద ననుదిన
మెన్నగ నమ్మమ్మనాకు యిలకన్యాంబా॥

క॥ గొల్లనాగార్యుడెలమిని
చల్లగ నీకార్యములను సాధించెను రం
జిల్లగ సంఘాధిపుడై
తల్లీనీకేమి కొదువ తగ కన్యాంబా॥

క॥ చనస్వర్గము నాగాఖ్యుడు
తనయుడు గంగాధరముస తతమొనరించన్
పనులను బూనెనుసంఘము
ననుపెద్దగనుండి వేడ్క నగకన్యాంబా॥

క॥ రోజించగాను సద్గుణ
రాజిత తూస్గుంట్ల నాగ రత్నమాటులనే
మాజేటిపానశాలును.
పూజింతురు దేవళంబు భువికన్యాంబా॥

క॥ పుప్పలవంచు సువంశ్యుడు
ఉప్పలవంచటులగాఁ సురుతర గుణుఁడా
గొప్పగల వేంకటేశుడు
తప్పా! శిల్పజ్ఞుడనుట దగ కన్యాంబా॥

క॥ ప్రేరేపించెను విలస
ద్వీరుండగు మద్దికులుడు వేంకటరత్నం
బోరమణీ నీసత్రము
కోరికల నొసంగు వేగ గుణ కన్యాంబా॥

క॥ మద్దిసోదరులు గట్టుచు
ఖద్దరు విశ్వాసమునను కార్యములందున్
విద్దెలు చదువగ బాలుర
నెద్దిక నొనరించుగాదె యో కన్యాంబా॥

క॥ పాదర్తి శివాఖ్యుడు నా
మోదిత చామర్తిరామ భొట్లును మరియా
హ్లాదుడు యెండూర్లక్ష్మయ
శ్రీదుర్గా సేవజేతు రే కన్యాంబా॥

క॥ దగ నూనె విశ్వనాథము
యొగిసేనుని సుప్రతిష్ట నొనరించెను నీ
దగు కోవెలందు వేడుక
మృగరాడ్గామిని కుమారి విత్కన్యాంబా॥

క॥ వరవిఘ్నేశుని సద్గో
పుర కలశము గొల్లపూడి పుల్లయ ప్రీతిన్



స్థిరముగ నిల్పెను బ్రోవుము
శిరులిచ్చి దయాసమేత శ్రీకన్యాంబా॥

క॥ తుంటరి జననాశని ము
క్కంటి వెలది జగము ప్రీతి గాంచినమాతా
బంటల భాగ్యము గూర్చుము
గుంటూర్నరసింహారాయు కులకన్యాంబా॥

క॥ తియ్యని మాటలొసంగుచు
నెయ్యముగూర్చుచును సుజన నీతులు వెలుగన్
వెయ్యారు లిచ్చిలాభము
బయ్యా బాపయ్య నేలు మాకన్యాంబా॥

క॥ అనిమిష పూజిత చరణా
కనక విభూషణి వరాంగి కార్ముకధారీ
గని నూనె రంగనాయకు
లను గావుము సంతతంబు లలికన్యాంబా॥

క॥ సుంకముల పాలుజేయక
శంకలదొలగించి మద్ది సద్వంశ భవున్
వేంకటసుబ్బయ నేలుము
శాంకరిజిత చంద్రబింబ సత్కన్యాంబా॥

క॥ ధనములొసంగుచు సంపద
లను బొందగజేసి వైశ్య లను కీర్తిగనన్
కొనగండ్ల వేంకటేశ్వరు
ననయము రక్షించు మతిద యుక్కన్యాంబా॥

క॥ కనికరము బూని మనమున
వినుత గుణాపూర్ణ మద్ది వేంకటరామా
ఖ్యుని రక్షించుము నిత్యము
కనకవిభూషణి విశాల కటి కన్యాంబా॥

క॥ యత్నమున మద్ది వేంకట
రత్నమునకు జయము గూర్చి రాజిల్లగ త
త్పత్ని కుమారుల గావుము
నూత్నోల్లాసములొసంగి యో కన్యాంబా॥

క॥ నీదగు గోపురకలశము
మోదముతో బచ్చు నాగ భూషణమెలమిన్
పాదుగ నిల్పెను గాదే
వేదాంత విచారశీల విను కన్యాంబా॥

క॥ నీపేర పాఠశాలను
స్థాపించిరి ధాన్యవణిజ సంఘము బ్రీతిన్
దీపింపగ జాతీయము
కాపాడుము తల్లి దాని గని కన్యాంబా॥

క॥ ప్రతినగరంబున వైశ్యులు
గతులకు దేవాలయముల గట్టుచు వేడ్కన్
సతతము నీపూజల స
మ్మతితో నొనరించుచుంద్రు మన కన్యాంబా॥

క॥ ఎందరు భక్తులు రాళ్లను
పొందుగ పేరులను జెక్కి పుణ్యమటంచున్



సుందరముగ దేవళమున
యిందుధరీ నిల్పెగాదె యిల కన్యాంబా॥

క॥ శ్రీగల్గి జమీన్దారుగ
త్యాగంబొనరించి సర్వ ధనములసుతలన్
వేగొని సన్యాసంబును
యోగానందుని దలంతు నో కన్యాంబా॥

క॥ కృతినందె హారవిలాసము
క్షితి నస్మద్గోత్రజుండు శ్రీనాధునిచే
ధృతి యవచిదేవ యాఖ్యుని
వితరణ గుణముల నుతింతు నే కన్యాంబా॥

క॥ నామలింగముల దెల్పుచు
దా మహిశబ్దార్థకల్ప తరువు రచించెన్
ధీమంతులు భళిరే యన
మామిడివెంకయ్యదలతు మహికన్యాంబా॥

క॥ ఆర్భాటము గావించుచు
దుర్భావముతో జరించు దోషజ్ఞులిలన్
దర్భాసనముల వైచుక
భూర్భువయన సార్థకంబె బో కన్యాంబా॥

క॥ వెదుక పరాశర శుక నా
రద ప్రహ్లాదాంబరీష రాజులు రుక్మాం
గద పుండరీక భక్తుల
నెద శౌనకు దాల్భ్యుల నెంతు హే కన్యాంబా॥

క॥ ఆత్మనివాసుండగు పర
మాత్ముని బ్రీతిగనుజేసె యజ్ఞమునెనరన్
ఆత్మార్పణసింహాధ్వరి
ఆత్మన్గదుభక్తి నెంచ నగు కన్యాంబా॥

క॥ డంబుగపత్రిక వైశ్యజ
నంబుల శృంగేరి పీఠ నాథుడు నిందిం
చం బరపెను సత్సభ నా
డంబళ రాజీవునెంతు దగకన్యాంబా॥

క॥ గుంటూర్పట్టణ వాసిని
గంటిని నీసేవజేయ గణపతి జననీ
జంట నీకెవ్వరమ్మా
గెంటుము నాపాపములను గిరికన్యాంబా॥

క॥ శ్రీత్రిపురసుందరీ హిమ
గోత్రకుమారీ భవాని కోకిలవాణీ
శాత్రవులార్వుర దోలగ
పాత్రునిగా జేయవమ్మ వరకన్యాంబా॥

క॥ అహికుల రాజ విభూషణి
తుహినాద్రికుమారి భక్త దోషవినాశీ
మహిషాసురమర్దని ని
న్నహహా నుతియించగలనె హాకన్యాంబా॥

క॥ రాజేశ్వరి నిన్నెప్పుడు
పూజించిన వానినెపుడు పోషింతువుగా



రాజీవనేత్ర దుర్గా
భూజననీ నన్నుబ్రోవు మో కన్యాంబా॥

క॥ ఓంకారపంజరశుకీ
శాంకరి హిమశైలపుత్రి చండికగౌరీ
హ్రీంకారదనుజనాశని
సంకటములబాపు కాళి సత్కన్యాంబా॥

క॥ ఉపనిషదాటవి క్రీడా
చపలాక్షీ హిమాద్రి తనయ చండికకాళీ
తపనీయ రత్న భూషణి
కృపతోననుగావు గౌరి గిరి కన్యాంబా॥

క॥ హేళీసమభాసిత స
త్కాళీ మేనకకుమారి గమనమరాళీ
పాళీసద్గుణ యాహావ
కేళీ సమదాళివేణి గిరికన్యాంబా॥

క॥ స్వామి కర్ధాంగివగుచును
పాముల తొడవులను దాల్చి పార్వతిదేవీ
వేమారు భక్తకోటుల
కామితముల దీర్తుగాదె గనకన్యాంబా॥

క॥ నీపెనుగుఱ్ఱము సింగము
నీపతివాహనము నంది నీరజనేత్రీ
యేపగిదినుండు మిత్రత
కాపురము సమత్వమహిమ గనకన్యాంబా॥

క॥ ఒకసూనుని తురగము మూ
షకమగు నీదివ్యవాహన సర్పము దివదే
ఒకతనయునెమలి నీఫణు
లకు రిపువై దివకనుండు లలి కన్యాంబా॥

క॥ హా కడు చిత్రముగాదే
నీకడ వైరంబులేక నిలకడ యుంటన్
నీకును నీవేసరి ద
ర్వీకర భూషణి శుభాంగి విట్కన్యాంబా॥

క॥ గోపతి వాహనమాగద
నీపతికిని సింగమగును నీకుభవానీ
ప్రాపున భయమును లేకను
దీపించుట మహిమగాదె తిరకన్యాంబా॥

క॥ గజవైరి వృషభరాజము
భుజగవితానము మయూర మూషికములువే
గజిబిజి లేకుండుట స
ర్వజనని సూచనము దెల్పు వరకన్యాంబా॥

క॥ భ్రమరాంబా నీమృదుపద
కమలంబులు పూజసల్ప కలుషమణంగున్
హిమధామురాక గనుచును
తమము దొలంగిన విధమున దగకన్యాంబా॥

క॥ నీవే గాయిత్రియు మరి
సావిత్రియు నీవె యటుల సారస్వతియున్



భావింపనీవె తల్లీ
కావక మహిమంబులన్ని ధర కన్యాంబా॥

క॥ మాతా నుత మానిజన
త్రాతా కన్యాకుమారి వందిత గుణ వి
ఖ్యాతా సద్భక్తజన
ప్రీతా రాక్షస విఘాత శ్రీ కన్యాంబా॥

క॥ పెనుగొండ పట్టణంబున
ధనికుండౌ కుసుమగుప్త తనయవగుచు నీ
వనయము వైశ్యులబ్రోచుచు
దనరుచు నుంటివి గదమ్మ దగకన్యాంబా॥

క॥ దాక్షాయణి నీరూపము
సాక్షాత్కారం బొనర్చి సర్వవిశాలిన్
మోక్షమొసంగుచు బ్రోచితి
వక్షీణ దయాసమేత హాకన్యాంబా॥

క॥ లగ్నము బెట్టినమీదట
భగ్నంబును జేసివిష్ణు వర్ధనరాజున్
యగ్ని పరిశుద్ధిగావే
యాగ్నజితేజులు శబాసు యన కన్యాంబా॥

క॥ అల విష్ణువర్ధనుడు నిను
దలపును వెట్టుచును గోర తలవ్రక్కలుగా
నిలపై బడ శపియించుచు
జ్వాలనంబున శుద్ధిగావె సత్కన్యాంబా॥

క॥ కుసుమాస్త్రవైరి పత్నీ
కుసుమశ్రేష్ఠికిని ముద్దు కూతుర వగుచున్
కుసుమముల నా జనార్దను
కుసుమాక్షి నుతించితేదె గురుకన్యాంబా॥

క॥ ద్వ్యయుత్తర శతగోత్రజు
లాయుత్తము బూని నీకు యాజ్ఞను వహ్నిన్
బాయక జొచ్చిరి గాదే
హాయని సురలెల్లబొగడ హాకన్యాంబా॥

క॥ బాల వైశ్యులకు భవిష
త్కాలపు ధర్మముల దెలపి కాంతి వెలుంగన్
జాలించితి నవతారము
బాలేందుధరీ కుమారి వరకన్యాంబా॥

క॥ తస్కర మంత్రము లెంచక
భాస్కరుడు పురోహితంబు బాగుగజేసెన్
హాస్కరుడు గాంచగాను తి
రస్కారము మాని వైశ్య రాట్కన్యాంబా॥

క॥ వెలసితివి వాసవాంబా
విలసిత గుంటూరు నగరు వేడుకలూరన్
పలువిధ భక్తులు నీపూ
జలు దేలుచు నుంద్రుగాదె సత్కన్యాంబా॥

క॥ శాంభవి శత్రు నిషూదని
బంభరకులవేణి సత్య వాణి కుమారీ



జంభారి పూజితాంఘ్రీ
దంభంబులనెల్లమాన్పు ధరకన్యాంబా॥

క॥ తన్వీ జ్ఞానవతీ గిరి
ధన్వీ మత్తేభగమన ధన్యచరిత వే
దాన్వయ ప్రావీణ్యత కా
మన్వాదులె జాలకంపు మహిఁ కన్యాంబా॥

క॥ కల్యంబుల వెసదీర్చి స
మూల్యంబగు నీదునామ ముల దలతును యో
కల్యాణి దుర్గినను సా
ఫల్యునిగా జేయు కరుణ వరకన్యాంబా॥

క॥ వీర జపానీయుల బలె
నేరుపవలె నుగ్గుతోడ నిసువులకెల్లన్
శూర ధీరత్వ గుణముల
సారెకు తల్లులు నుతింప సుమకన్యాంబా॥

క॥ అన్నములేకను మాడుచు
నున్నారీ భారతమున నురుకష్టములన్
అన్నపూర్ణాంబవై ప్రజ
తెన్నును గనకుంటివేమి ధీకన్యాంబా॥

క॥ పాములతోడవులు గల్గియు
బాముల బాపుదువు సర్వభక్తులకెలమిన్
పాములకు పాలుబోయుట
బాములు రావెలిచుననియె వరకన్యాంబా॥

క॥ అధ్యాత్మమెల్ల లోకా
రాధ్యుడు నీభర్తవలన రాణించగవే
సాధ్య మొనరించు కొంటివి
బాధ్యత నాకటుల నొసగు వరకన్యాంబా॥

క॥ భ్రామరి గోత్ర కుమారీ
సామజముఖు నేకదంతు జనని వటంచున్
వేమారు పూజ సల్పుదు
కామితముల దీర్చరాదె ఘన కన్యాంబా॥

క॥ భార్గవ వాసర మందున
భర్గాత్మేశ్వరి కుమారి పరమశుభాంగీ
దుర్గా కుంకుమ పూజల
నర్గళముగ సల్పుచుంద్రు నగ కన్యాంబా॥

క॥ భార్గవి భారత దేవీ
వర్గములే మెచ్చుచుంద్రు వరగుణ తతికిన్
స్వర్గీయులు నుతియించెదు
మార్గము నరులంద దరమె మహికన్యాంబా॥

క॥ వితరణ గొనముల బరణీ
పతిదేహార్ధంబు గొనిన పరమేశ్వరి నీ
ధృతి శీలంబుల నెన్నుచు
కుతుకంబున గొల్తు మాత గుణకన్యాంబా॥

క॥ భర్తకర్ధాంగి వగుచును
వర్తిల్లుచు నుందువెపుడు వైభవమొప్పన్



గీర్తించుచుందు రమరులు
వర్తనముల సల్పి భక్తి నగకన్యాంబా॥

క॥ శక్తిత్రయరూపిణి యా
సక్తిని బూజింత్రుగాదె సర్వబుధాళుల్
వ్యక్తులవర్తన సాగున
శక్తియొకింతయును లేక క్షమకన్యాంబా॥

క॥ యుద్వాహము లొనరించిన
సద్విధులను నీదుపూజ సల్పకనున్నన్
యుద్వాసనంబుగాదని
విద్వాంసులు జెప్పుచుంద్రు వినకన్యాంబా॥

క॥ ఉగ్రసతీవనితార
త్నాగ్రణి కిసలయనుపాణి యలికులవేణీ
అగ్రహమెల్లను బాపి య
నుగ్రహమునగావ జేతు నుతికన్యాంబా॥

క॥ ముత్యంబులైన గోరున
కాత్యాయని నీదుభక్తి గాంక్షించితినే
సత్యంబు నమ్ము నాకిల
ప్రత్యక్షము గావె మాత వరకన్యాంబా॥

క॥ దుర్మార్గమెల్లబాపగ
మర్మంబేమియును లేని మార్గమునడువన్
ధర్మంబులూని జేయుచు
కర్మల మీరారకను నుండ గనుకన్యాంబా॥

క॥ గ్రావాత్మజ సురవందిత
దేవీ కమలారిబింబ దివ్యనితంబా
భావాబ్జంబున భక్తిని
సేవింతును గావుతల్లి శ్రీకన్యాంబా।

క॥ భద్రేభయాన గౌరీ
క్షుద్రాసుర మదవిభంగ సుమతి వరాంగా
విద్రుమ మౌక్తిక భూషణి
ముద్రల బట్టుదురుగాంచ భువికన్యాంబా।

క॥ అండాండము బ్రహ్మాండము
పిండాండంబులును నీవె వెలదీమణి ది
గ్మండల దీప్త సుగాత్రీ
కుండలిభూషణి విరాజ గుణ కన్యాంబా॥

క॥ తర్జన భర్జన జేయుచు
దుర్జయమును గూర్తువమ్మ దురమున వేగఁ
నిర్జర వైరుల సింగపు
గర్జనలకు ముందుబారు గదకన్యాంబా॥

క॥ నీపేరు జెప్పి మేకలు
వాపోవగ గోతురమ్మ వంతుల వరుసఁ
యేపాపమెరుగనట్టివి
కాపాడుము కరుణబూని ఘనకన్యాంబా।

క॥ కొలుపుల మేకలగోయుచు
పలుకుమటం చనుచు తలల పట్టినిలపి ము



క్కులతో ప్రాణము విడచిన
బలికెను దేవరయటండ్రు వరకన్యాంబా।

క॥ శోధించితి వధ్యాత్మము
బోధించగ శివుడువేడ్క పూర్ణముగాఁగ
సాధించితి వమరారుల
ధించగ లోకమెల్ల వరకన్యాంబా।

క॥ రామాయణ తత్వంబును
రామామణి నీదుభర్త రాజిలబలుకఁ
వేమారు నాలకించవె
కోమల మృదుగాత్రి గౌరి గురు కన్యాంబా।

క॥ స్రష్టాది సుమనసులు సం
తుష్టిని బూజింతురమ్మ దోషవినాశీ
భ్రష్టుడటంచని గనక న
భీష్టములన్నీర్చు మాత వేకన్యాంబా॥

క॥ భాషాపతినుత సుగుణా
యోషామణి విమలశీల యురగ కలాపా
దోషాటవీ కుఠారీ
పోషిత సద్భక్తజాల భువికన్యాంబా।

క॥ ఏణీలోచని కిసలయ
పాణీ నగరేశు రాణి బంభర వేణీ
వాణీ సన్నుతసుగుణ
శ్రేణీ శుకవాణి శౌరి శ్రీకన్యాంబా॥

క॥ దానవజిత సురసాలా
మానవతీ సుజనపాల మహితసుశీలా
జ్ఞానవతి సుగుణజాలా
సూనాంచితవేణి శైల సుత కన్యాంబా॥

క॥ కింకరజన భయమోచన
శాంకరి జిత చంద్రబింబ చారు నితంబా
ఓంకారకాననశుకీ
శంకింపక ప్రోవవమ్మ సత్కన్యాంబా॥

క॥ వీణా వాదనపాణీ
బాణాసనధారి దనుజ భంగ కుమారీ
వాణీ సన్మానవతీ
వేణీలోచని శుభాంగి హేకన్యాంబా॥

క॥ దాక్షాయణి విమలదయా
దాక్షిణ్యా లసన్మతీ వ దాన్యభవానీ
సాక్షాజ్జగదీశ్వరి య
జ్ఞాక్షిమహేశ్వరి విదారి యరి కన్యాంబా॥

క॥ వితరణ సుగుణాభరణా
జితనీరేజారిబింబ శీలవిడంబా
సతతామర సంపూజిత
ధృతసర్పాభరణ గౌరి శ్రీకన్యాంబా॥

క॥ ధరణీధర వరతనయా
కరుణామయ సత్యవాణి కార్ముకపాణీ



శరణాగత జనపోషిణి
తరుణేందు కిరీటి సుగుణ ధన కన్యాంబా॥

క॥ క్రూరాసుర ఖండన వై
శారద మానీంద్రహృదయ సంతోషిణి వం
దారు నిజభక్తదాయిని
చారుమనీషాబ్ధి దుర్గ సత్కన్యాంబా॥

క॥ కస్తూరి ఫాలఫలకా
మస్తక మణిఖచిత మకుట మండిత గాత్రీ
దుస్తరశాస్త్ర విచారిణి
నిస్తుల సుజ్ఞాన హృదయ నిధి కన్యాంబా॥

క॥ సాంకవ లిప్తశరీరే
శాంకరి లోకైకదీపె సదయాపూరే
పంకజరిపు సద్వదనే
ఓంకారార్చిత సుమోదె హేకన్యాంబా॥

క॥ మునిమానస సంస్తుత్యే
ఘనసార సుగంధలిప్త గాత్రవిరాజే
ధనదేశ మిత్రపత్నే
దనుజాటవి సత్కుఠార ధర కన్యాంబా॥

క॥ అలినీల కుటిల కుంతల
విలసన్మణి హేమభూష విమలసుభాషా
అలకాపతి హితరాణీ
ఖలనాశని విమలశీల ఘనకన్యాంబా॥

క॥ ఇంతీ ఘనసద్గుణముల
దొంతీ చంగల్వబంతి దుర్గుణ హంత వే
దాంతీ వేణీభరచా
మంతీగమనా ! సుదంతిమహిళకన్యాంబా॥

క॥ కోర్కె జెలంగ మనంబున
తర్కించవె సర్వశాస్త్ర తతి పతిచెంతక్
యర్కాదులెల్ల మెచ్చగ
కర్కశము న్బాపిబ్రోవు ఘనకన్యాంబా॥

క॥ భస్మాసుర వరముల గన
విస్మయమగునమ్మ నీదు విభుని చరిత్రల్
కస్మలుడంచు దొలంగక
నస్మత్పాపములణంచు హా కన్యాంబా॥

క॥ తప్పక నినుజింతించెద
ముప్పుల బడకుండ సతత మోదముతోన
న్నెప్పుడు దయతో బ్రోవుము
యొప్పిడి సద్భక్తినొసగి యోకన్యాంబా॥

క॥ పుష్పాయుధ రిపురాణీ
పుష్పాంచిత వేణిసుగుణ భూషణిగౌరీ
నిష్పాపుగ నొనరించుచు
దుష్పరిపంథుల నణంచు దుపు కన్యాంబా॥

క॥ భువనేశ్వరి పరితోషా
ప్రవిమల గుణజాలశైల బాలసుశీలా



సువిశాల హృత్కుశేశయ
భవదోషము లణచు మాత వర కన్యాంబా॥

క॥ భక్తజన పరాయణి స
త్స్వాక్తిని కాసారకేళి సుందర వేణీ
శక్తికొలందిని దలచితి
ముక్తిని దయసేయరాదె భువి కన్యాంబా॥

క॥ కామేశ్వరి భాసిత స
చ్చామీకర రత్నఖచిత చారు విభూషీ
రామామణి దాక్షాయణి
వేమారు నుతింతు బ్రోవవే కన్యాంబా॥

క॥ మృగరాజ గామినీమణి
మృగచిహ్నాంచిత కిరీట మీన వినేత్రీ
మృగరాజమధ్య కానన
మృగమే నినుదలచకున్న వే కన్యాంబా॥

క॥ హిమశైల బాల కాళీ
హిమధామార్ధ వదన భుజగేంద్రాభరణా
హిమవైరి దీప్త నీదుమ
హిమల న్నుతియించ దరమె హేకన్యాంబా॥

క॥ ఆతతచల్లని చూపులు
శీతాద్రికుమారి వగుటచే నీకబ్బెక్
మాతాన్నపూర్ణభక్త
వ్రాతసుపూజిత పదాబ్జ వరకన్యాంబా॥

క॥ దొంగిలు ధనికులు బీదల
కుం గల ధనధాన్యములను గొని మిత్తికి వే
దొంగిలు నటుమును సత్కవి
పుంగవ శబ్దముల కవులు భువి కన్యాంబా॥

క॥ త్రాణగన జగత్సర్వం
బాణోచ్ఛిష్టమని బలుక బడియుండగనె
కాణాచిన సత్కవిపద
మాణిక్యము లంటకుండ మహికన్యాంబా॥

కా రాగారంబులకున్
ధీరతజని కష్టములను ధృతిగాంచిరి మా
భారతసూనులు కొందరు
కోరికలన్దీర్చరాద గురుకన్యాంబా॥

త్యాగము జూపక ధనికులు
బాగుగ దీనులను గనక ప్రాల్మాలినచో
రోగముల బొంది వేమరు
భోగముల న్దూరులగుదు బోకన్యాంబా॥

యతిపీఠంబులు దిరిగడి
మతధర్మంబులను దెలుప మానుచు ప్రజకున్
సతతము భేదంబుననే
గతులను గాంచుదురొవారు గనకన్యాంబా॥



నా రీమణి హిమశైలకు
మారీ సుకుమారి దివ్య మార్గ విహారీ
ఘోరారి మదవిదారీ
సారెకు భజియింతు నిన్ను సత్కన్యాంబా॥

య మినుతసద్గుణజాలా
సుమనస పోషితవిశాల శోభితశీలా
విమలాంచిత సుమమాలా
ప్రమదంబున నన్ను బ్రోవు మాకన్యాంబా॥

విద్ పద్వరులు నుతింతురు
హృద్వీధిని నిన్నునిల్పి హేకల్యాణీ
సాధ్వీమణి కాళీ మక
రధ్వజ రిపు రాణి వైశ్య రాట్కన్యాంబా॥

మ తముల వైరము బెట్టక
సతతము వాదించుకొనుట సరసము గాంచన్
మతిహీను లట్లొనర్తురు
క్షితి నీశ్వరు గాంచలేక శ్రీకన్యాంబా॥

హే గౌరీ సుకుమారీ
హేగజరాడ్గమన దేవి హేరిపు మథనా
హేగిరిరాడ్దుహితా నను
వేగమె రక్షించి బ్రోవ వే కన్యాంబా॥

క రుణాపాంగ శుభాంగి
పరమేశ్వరు హృదయపద్మ బంభర గౌరీ
నిరుపమ గుణగణ ధారీ
పరమానందమున బ్రోవ వా కన్యాంబా॥

న్య గ్రోధ దళశయను నువి
దాగ్రణి పూజితు వెప్పు డాత్మను లోకా
నుగ్రహపాత్ర యుమామణి
యుగ్రాత్మనివాసినీ యహో కన్యాంబా॥

కు టిలాలకసద్వేణీ
జటిలపటల నుత వరాంగ సదయాపాంగా
త్రుటికాలము దలచగ న
క్కటికమునన్ బ్రోతువీవె కా! కన్యాంబా॥

మా మక ప్రార్థనలను విని
కామితములదీర్చరాద కారుణ్యముతో
సామజగమన మహేశ్వరి
సామజరిపుమధ్య దలతు సత్కన్యాంబా॥

రి పుహననీ రాజననీ
విపులాయత సన్నితంబ విధుజిద్బింబా
చపలాక్షీ శైలరాడ్సుత
కృపతోరక్షించు హారసతీ కన్యాంబా॥



ధీ నిధివీవు కుమారీ
లేనిది శాస్త్రములు దెలియ లేమనుపశమా
మానిత తత్త్వవిచారిణి
మానవతీ నన్ను గావు మా కన్యాంబా॥

మ ణిమాద్యష్ట సుసిద్ధులు
గుణయుతులై దలచగ నొసగూర్తువు గాదే
మణిరత్నహారధారిణి
ఫణిభూషణి గావవే కృప సత్కన్యాంబా॥

హి మగిరితోక మహేశ్వరి
సతి హైమవతీ దలంచ సర్వపాపముల్
హతమొనరింతువు గాదే
కతిపయదినములనె దీక్షగ కన్యాంబా॥

త॥ విధిపూజిత పాదకా
విధుశేఖరు రాణిగుణమణీ కల్యాణీ
ప్రథితాత్మబోధినీ నుత
బుధజన సంస్తుతి నొసర్తు బో కన్యాంబా॥

సత్యంబు బలుకనెంతయు
నిత్యము జరియించుచుండి నిక్కడివారల్
గత్యంతరంబులేక న
గత్యము గొల్చెదిని ముదముల గా కన్యాంబా॥

పద లక నీపదపద్మము
లెదనిల్పుచు భక్తిసేంచ నెంతయు వాడా
పదలగనకుండగని స
త్పదవిని జేకూర్తువు జల పక్కన్యాంబా॥

ధర్మం బొనరించుచు స
త్కర్మల జరియించెదనేని గతులనుగాంచుక
దుర్మార్గమెల్ల దొలగుచు
నిర్మలినులుగారె గుణము నే కన్యాంబా॥

చర మదశయందు నీదగు
చరణంబుల మదిని నిల్పి చండికకాళీ
పరమార్థదాయినీయని
హరియించును పాపచయము హా కన్యాంబా॥

క॥ మునుగనిరో! గనకుండిరో
మనవారలు యంత్ర తంత్ర వార్తలనెల్లన్
జనముల మాడ్చుచు నుండెను
ఘనతర కాటపుయగ్గిగా కన్యాంబా॥

క॥ దనరియదో మార్గంబులు
ధనధాన్యంబులకు కలవు తలపై బడుచున్
గొనివచ్చె నితరదేశపు
గొనముల పీడలను నెల్ల గురుకన్యాంబా॥

క॥ జబ్బులు యున్నాయి యెంజా
జొబ్బులు సుఖసంకటములు భూరితరముగా



తబ్బిబ్బుజేసి ధర్మజా
నబ్బపురికి జనులనంపె హా కన్యాంబా॥

క॥ ఏదేశంబున మానవు
నాదేశమునందె నిలువ నారోగ్యము? వే
రేదేశము లరిగిన బుజ
తే దార్కొని దుఃఖపెట్టువే కన్యాంబా॥

క॥ వేదండయాన గౌరి
పూదండలుగాను పద్యములు కూర్చితి దో
కోదండపాణి రుద్రా
ణీ దండము లిడుచు మాని నీ కన్యాంబా॥

క॥ జయజయ వినీలవేణీ
జయజయ నీరేజపాణి జయకల్యాణీ
జయజయదుర్గా ధీమణి
జయజయ సత్సత్త్వవాణి జయకన్యాంబా॥

॥క జయజయ పావనసువ్రత
జయజయ హిమశైలబాల సమధికశీలా
జయజయ వితరణశాలీ
జయజయ జితచంద్రబింబ జయకన్యాంబా॥

క॥ జయజయ గుంటూర్వాసిని
జయజయ వేదండగమన శాంకరి గౌరీ
జయజయ సుజనపరాయణి
జయజయ దుర్మార్గవిలయ జయకన్యాంబా॥

# భారతీపంచరత్నములు.



క॥ చేరి నాజిహ్వ నిలచియు
వారధివీచికలబోలి బలికించితివో
భారతి! పద్యముల నమ
స్కారమికను జాలునమ్మ సకలము వాణీ॥

క॥ అమ్మా యిక నిలచిన సా
దమ్మును కష్టంబుసుమ్ము దగజేయుగ జే
రమ్మును బుద్ధిజనింపదు
సమ్మతి నిక దొగ్గ మేలు చక్కఁగ వాణీ॥

క॥ పేరును బొందితి నీచే
భారతి వైశ్యాళిలోన వాణిజ్యంబే
దూరమునకు జేరె నమ
స్కారమిక గ్గవితమాపు సకలము వాణీ॥

క॥ ఈవున్నచోట లక్ష్మీ
దేవి పదంబిడదటంచు దెల్పిరి పెద్దల్
గావున దయతో వేరొక
తావు నలంకారమివ్వ తగ్గుము వాణీ॥

క॥ అత్తాకోడండ్లకు గన
పొత్తుఘటించుటలు వట్టి బూటకమనుచు౯
ముత్తవ్వలాడుచుండుట
కొత్తలుగావెందు తొలగ గోరెద వాణీ॥

